సాహిత్య
ప్రస్థానం
మార్చి 2019

సంపుటి : 18 | సంపాదకీయం | సంచిక : 3

# ఉగ్రవాద సవాలు- ఉద్రిక్త సరిహద్దులు

పుల్వామాలో జైషే మహ్మద్ ఉగ్రవాది ఆత్మాహుతి దాడిలో నలభై మంది సిఆర్‌పిఎఫ్ జవాన్లు బలైన ఘటన దేశమంతటా ఆగ్రహావేదనలకు దారి తీసింది. ఇందుకు ప్రతిగా భారత యుద్ధ విమానాలు పాకిస్తాన్‌లో శిబిరాలు ఏర్పాటు చేసుకుని శిక్షణ పొందుతున్న ఉగ్రవాదులపై దాడి చేయడం కూడా సంచలన కారణమైంది. పాక్ ప్రేరిత ఉగ్రవాదులు సరిహద్దులలో చొరబడి ఘాతుకాలకు పాల్పడ్డం ఇది తొలిసారి కాదు గాని ప్రాణ నష్టం మాత్రం చాలా ఎక్కువ. పాక్ పాలకులను ఆడించే సైనిక మతోన్మాద అధికార కూటమి అండదండలతోనే ఈ ఉగ్రవాద చర్యలు సాగుతుంటాయి. ఆ దేశ మాజీ ప్రధానితో సహా ఎందరో ఈ ఉగ్రవాదానికి బలైపోయారు. ఎందుకంటే ఉగ్రవాదం అనేది భస్మాసుర హస్తం లాటిది. ఈ విషయమై ఇండియా ఎన్నిసార్లు ఎన్ని వేదికలపై చెప్పినా పాక్ పాలకులు స్పందించరు. పాక్ సైనిక కూటమికి ఆర్థిక ఆయుధ సహాయం చేసి అండగా నిలిచే అమెరికా, సౌదీ అరేబియా వంటి దేశాలు కూడా గట్టిగా మందలించి వాటిని ఆపేవరకు వత్తిడి చేయవు. ఆఫ్ఘనిస్తాన్‌లో అమెరికా పెంచి పోషించిన తాలిబాన్లు, అంతకు ముందు అల్ ఖైదాలు పాక్‌నే స్థావరంగా చేసుకున్నారు. ఇప్పుడు భారత్‌కు ఇష్టం లేకున్నా అమెరికా తాలిబాన్లతో చర్చలు తలపెడితే పాక్ సంధాన కర్తగా వుంది. మోడీ ప్రభుత్వానికి సన్నిహితమైనదిగా చెప్పే సౌదీ అరేబియా రాజు పాక్‌లో దిగి సహాయం ప్రకటించి మరీ ఇండియా వచ్చారు. మరో పెద్ద పొరుగుదేశమైన చైనా పాకిస్తాన్ ప్రధాన నేస్తంగా ప్రభావం చూపగలదు గాని ఇండియా వాదనలను పూర్తిగా స్వీకరించడం లేదు. ఇరు దేశాలు శాంతి యుతంగా పరిష్కరించుకోవాలని మాత్రమే చెబుతున్నది. దీనికి తోడు జమ్మూ కాశ్మీర్‌లో ప్రజాస్వామ్య ప్రక్రియ, ప్రజాసంక్షేమ చర్యలు, ఉపాధి కల్పన వంటివి కొరవడటం యువతను ఉగ్రవాదంవైపు నెట్టింది. 2016లో ఉరి సైనిక స్థావరంపై దాడి తర్వాత మన సైన్యం సర్జికల్ స్ట్రయిక్స్ అంటూ హడావుడి చేసినా పెద్ద ఫలితం కలగలేదు. 2014లో ఉగ్రవాదానికి 200 మంది పైగా మరణిస్తే ఆ సంఖ్య 2017 నాటికి 600 దాటింది. పుల్వామా ఈ పరంపరలో తీవ్ర సవాలు. గతానుభవాల రీత్యా ఇండియా ముందస్తు కసరత్తు చేసి పాక్‌లో తట్టులోని బాల్‌కోట జైషే స్థావరంపై దాడి చేసింది. ఇది సైనిక చర్య కాదని ఉగ్రవాదులపైనే దాడి అని స్పష్టం చేసింది. ఈ చర్యను దేశమంతా బలపర్చింది. అంతర్జాతీయ సమాజం అర్థం చేసుకున్నట్టే కనిపిస్తుంది. అమెరికా కూడా ఉగ్రవాదులపై చర్య తీసుకోవాలని పాక్‌కు హితవు చెప్పింది. చైనా కూడా ఉగ్రవాద స్థావరాలపై దాడిని సానుకూలంగా చూస్తూనే ఉద్రిక్తతలు పెరక్కుండా చూసుకోవాలన్నది. పాకిస్తాన్ కూడా అధికారికంగా నిరసన తెల్పినా వెనువెంటనే యుద్ధానికి దిగే దుస్సాహసం చేయదనే భావిస్తున్నారు. ఇది రాసే సమయానికి మరో మూడు రోజులలో ఏ సంగతి తేలుతుందని పాక్ మంత్రి అంటున్నారు. తన దుర్నీతి కారణంగా ఒంటరిపాటుకు గురైన పాక్ ఉగ్రవాదానికి వూతమిచ్చే చర్యలు ఆపనంత వరకూ సమస్య పరిష్కారం కాదు. ఆ మేరకు దానిపై అమెరికా వత్తిడి తేవాలి. వారితో స్నేహసంబంధాలు బాగా పెరిగాయనే మన పాలకులు కూడా అందుకు ఒప్పించాలి. ఇరుగు పొరుగు దేశాల మధ్య సాయుధ ఘర్షణ అనర్థమనే మెళకువతో శాంతిని కాపాడుకోవడం అందరికీ మంచిది. అలా జరగాలని కోరుకుందాం. ♦

సంపాదకవర్గం:
తెలకపల్లి రవి ప్రధాన సంపాదకుడు
వొరప్రసాద్ వర్కింగ్ ఎడిటర్
కె. సత్యరంజన్ ◆ చీకటి దివాకర్
గనారా ◆ శమంతకమణి
కెంగార మోహన్
కె.లక్ష్మయ్య, మేనేజర్

బొమ్మలు: తుంబలి శివాజి
గంగాధర్ వీర్ల, చిదంబరం

కవర్ డిజైన్: బ్రౌన్

రచనలు, చందాలు, విరాళాలు, మనీ ఆర్డర్లు, చెక్కులు, డిడిలు పంపవలసిన చిరునామా:
సాహిత్య ప్రస్థానం, 27-30-4, ఎం.బి. విజ్ఞానకేంద్రం, 3వ అంతస్తు, ఆకులవారి వీధి, గవర్నరుపేట, విజయవాడ - 520002, ఫోన్: 0866-2577248, సెల్: 9490099059
ఇ-మెయిల్ : ssprasthanam@gmail.com, www.prasthanam.com
ISSN No: 2581 - 7477
సాహిత్య ప్రస్థానం మాసపత్రికకు చందా కట్టండి! తెలుగు భాషా, సాహిత్య కృషిలో భాగస్వాములు కండి!!
1 సంవత్సర చందా రూ. 240/- ◆ 5 సంవత్సరాల చందా రూ.1000/
◆ 10 సంవత్సరాల చందా రూ. 2000/-
Bank A/c Details: A/c Name: PRASTHANAM, SBI, Governorpet, Vijayawada
A/c No. 52001500585, IFSC: SBIN0020343
చెక్కులు, డిడిలపై prasthanam అని రాయగలరు.

**కవిత**

## బుడ్డోడు - బడి


- కిల్లాడ సత్యనారాయణ
8333987838




ఊరి చెవులు మారు మోగేలా
గంట మ్రోయించి
ప్రతి ఒక్కరినీ పలిచేది బడి
బుడ్డోడు బదులిచ్చేవాడు కాదు

పప్పు బెల్లం చూపించి
మధ్యాహ్న భోజనం తినిపించి
బ్రతిమాలుకునేది బడి
ప్రలోభాలకు తలొగ్గేవాడు కాదు

బుడ్డోడి బుద్ధి మారింది
సంచి భుజానవేసాడు
ఇప్పుడు
బడి బందరాయయ్యింది

బడి ముందు
మోడయిపోయిన చెట్టు తప్ప
పిలిచే గంట లేదు

బుడ్డోడి బింకం పెరిగింది
చదువుకోసం ఏరు దాటి
కాన్వెంటులో చేరాడు
ఇక
ఊరివైపు చూడనే లేదు ♦

## కథ



# తిక్క బాపనయ్య

**హెచ్చార్కె**

సుబ్బరాయుడు తిక్క బాపనయ్య నెత్తి పగులగొట్టి సంపినాడంట.

ఆయాల మాపద్దాం నేను బడి నుంచి ఇంటికొచ్చే తాలకు వూరంతా గోల గోల.

మా వూల్లో కూనీలు గీనీలు జరగవు. ఫ్యాక్షన్లనేటివి సినిమాలల్ల సూసినాం గాని మాకయేం తెలవు. బయటికి తెల్సే ఖూనీలైతే మా వూల్లో అస్సలు జరగవు. జనం బజారున పడి తన్నుకోడం శాన తక్కువ. ఎప్పుడన్నా దొంగతనాలు జరుగుతుంటాయి. అయి గుడ్క యా సిన్నాపురం పిల్లోల్లో రేత్రి పొల్లాల మింద పడి కాతకొచ్చిన జొన్న కంకులు కోస్కపోతె, బుడ్డల కట్టె పీక్కపోతె... దొంగలను మా వూరి సావిడి కాడికి పట్టుకొచ్చెటోల్లు... అగో అట్లాంటియే మాకు పెద్ద పంచాతీలు.

అవి గుడ్క ల్యాకుంటే వూరు వూకె మన్ను దిన్న పాము లెక్క పడుంటాది.

మా యింటి కాన్నుంచి దక్షిణం దిక్కు జూచ్చే గుమ్మడి కొండ అని ఒక కొండ వుంటాది. అది ఒక పేద్ద రాచ్చాసి నెత్తికింద ఎడం సెయ్యి వెట్టుకోని పండుకున్నెట్టుంటాది. మా వూరు ఆ కొండ లెక్కనె మన్వంతరాల్నించి కదలకుండ పడుందని అనిపిచ్చాది.

అట్లాంటిది వున్నెట్టుండి, కూని అనే సరికి మొద్దు నిద్ర పోతున్న మన్సి ఈప్మీద కొట్టి లేపినట్లు వూరు వులిక్కి పడింది.

సచ్చిపోయింది ఎవురనుకున్నారు?

పొయి పొయి, మా తిక్క బాపనయ్య.

అయ్య నా కన్న బాగా పెద్దోడే గాని, నా సావాసకాడని సెప్పొచ్చు.

తిక్క బాపనయ్యను ఎవురైనా ఎందుకు సంపుతారు? ఆయన కాడ ఏముంటాది, సంపి తీసుకోనీకి? ఎవురి జోలికి పొయ్యేటోడు గుడ్క గాదు.

ఆయ్న అసలు పేరు నాకే గాదు వూల్లో ఎవురికి తెలదు. అందరికి ఎట్టా తెల్సిందో గాని, ఆయ్న బాపనాయన అని మాత్రం తెలుసు. అందుకే ఆయిన పేరు తిక్క బాపనయ్య

ఐపొయ్యింది.

ఆయ్నది మా వూరు గాదు. యా వూరో తెలదు. యా దిక్కు నుంచొచ్చినాడో నాకైతె ఎర్క ల్యా. నాకే ఎర్క లేదంటే ఇంగ వూళ్లో ఎవురికి తెలదనే సెప్పాల. మా దోస్తాని అట్టాంటిది.

తను వూళ్లోకి వొచ్చిన్నాడో ల్యాకుంటె ఆ మర్నాడో నేను తనను సూసినా. అప్పటికి నేను అప్పర్ ప్రైమరీ వొదిలి పది కిలోమీటర్ల దూరంలో రెండూళ్ల అవతల వుండే ఐస్కూల్లో ఇంగా సేరింద ల్యా. శాన మట్టుకు వూళ్లోనె వుంటొంటి. అందుకే మా వూరికొచ్చిన దినమే నేను అయ్న ను సూసింటా.

వొచ్చినాక కొన్నాల్లు ఆయ్న తెల్ల దావుతి, తెల్ల అంగీ తొడుక్కోని బజాట్లో తిరుక్కుంటా ఏందేందో మాట్లాడేటోడు. మాటల్లో తెలుగే కాకుండ ఇంత సంస్కృతం, ఇంత ఇంగ్లీషు మాటలు దొర్లేటివి. కొన్నాళ్లన్నా కాలేజీ మొగం జూసింటాడని అనిపిచ్చొండ్య, అప్పుడప్పుడే కాసిన్ని ఇంగ్లీషు ముక్కలు వొంటబడ్తున్న నాకు.

తెలుగు కాని మాటలు తడుముకోకుండా మాట్లాడేటోడు. తడుముకోడం లేదంటే తప్పుల్లేకుండా మాట్లాడుతొండాడని అందరం అనుకునేటోళ్లం.

ఊళ్లో జనం అయ్న ని శాన దయతో జూసేటోల్లు.

పేదోడు. ఎవ్వురు లేనోడు. యా సిన్న కులమోడో ఐతే వుత్త బిచ్చగాడే. కాని, బాపనయ్య. అయ్య దరిద్రం వూరికి దరిద్రమైనట్టు సూచ్చారు పల్లె జనం. ఎన్కబడిన మా సీమ పల్లెల్లోనైతే ఇగ సెప్పేదే లేదు.

బాపనయ్య కదా అని వొండిన అన్నం పెట్ట కుండా వొండుకోనీకి బియ్యం బ్యాళ్లు ఇచ్చేటోల్లు ముందుగాల. అట్టా ఎన్నాళ్లు జేచ్చారు. రొన్నాల్లకు ఆ నిష్ట పోయింది. కాస్త కలిగినోల్లు ఇంట్లోకి పిల్సి సుబ్బరంగ పీటేసి కూకోబెట్టి బువ్వ పెట్టేటోల్లు.

మా బుడ్డ రంగాడ్డి మామ లెక్క మోతుబర్లు బువ్వ పెట్టి బట్టలు కుట్టిపిచ్చి, వాల్ల కల్లం కాడ మాసూలుకు కాయిలి కూకో బెట్టేటోల్లు. రంగాడ్డి మామోల్ల కల్లం మా కల్లం పక్కపక్కన్నే వుంటాయి. తిక్క బాపనయ్య మా కల్లాల మద్దెన గోడ మింద కూకోని వుండేటోడు. మేమిద్దరం శాన సార్లు ఆ గోడ మింద కూకోని యవ్వారం పెట్టుకునేటోల్లం.

మొదట్లో బిడెం బిడెంగా మాట్లాడేటోడు. పొయ్యే కొద్దీ మా మద్దెన సావాసం పెరిగింది.

నా లెక్కటి కాపోల్లందరు బాపనోల్లను పలకరించినట్టే నేను గుడ్క 'అయ్యా' అని పలకరిచ్చి మాట్లాడేటోన్ని.

తను ఎదురుంగ లేనప్పుడైతె, ఇగ, ఆయ్న పేరు తిక్క బాపనయ్యే.

ఎంత తిక్కోడు గాకపోతే, బాపన పుటక పుట్టి ఇట్టా బజార్లల్ల తిరుగుతాడు.

ఒక మనిసి బాపనయ్య అయితె సాలు. సంస్కృతంలో 'అయ్య' ఏం పాడుతున్నాడో ఎవురికి తెలుచ్చాది, ఎవరు అడుగుతారు? సూద్దరోల్లం, మనకు తెలదులే అనుకుంటాం. ఉతికిందో ఉతకనిదో ఒగ పట్టు పంచె కట్టుకోని పెండ్లిల్లు జెయ్యొచ్చు. తద్దినాలు పెట్టిచ్చొచ్చు. పూజార్లు లేని యా దేవులం కాడనో నాల్దినాలు దీపాలు ముట్టిచ్చుకుంట కూకుంటే, ఈ అయ్య కాడ యా మాత్యముందో యా మంత్రాలుండాయో అని వూరోల్లు, కాల్లు మొక్కి, దచ్చినలిచ్చి పోతారు. యా బాపన పిల్లనో పెండ్లి చేస్కోని, సంసారం గుడ్క జెయ్యొచ్చు.

ఈన అట్టాంటి పనేం పెట్కలా. అయ్యన్ని ఇష్టం ల్యాకనే ఆయ్న తన వూరిడ్సొచ్చినాడని నాకు అనిపిచ్చాది. ఆ మాట అడగబోతే సాలు, యాదో ఒగ మాట జెప్పి తప్పిచ్చుకునేటోడు.

అయిన గాని బాపనయ్య బాపనయ్యే. ఆయ్న వొప్పుకున్నా వొప్పుకోకపొయినా బాపనయ్యే. పుటక ముక్కెం గదా.

ఎవుర్దన్న బర్రెగొడ్డు తప్పిపోతే వొచ్చి 'ప్రశ్న' అడిగెటోల్లు. ఈనేం మాట్లాడేటోడో వాల్లకేం అర్తమయ్యేదో గాని, అయ్యకు వాక్శుద్ధి వుందనే మాట జనంలో బాగా నాటుక పొయ్యింది.

తిక్క తిక్కగ మాట్లాడ్తాడు గాని, మాత్యాలున్న అయ్య అనుకునేటోల్లు వూల్లో శానా మంది.

అదంతా మంది అనుకోడమే. ఆయ్న అనుకునేటోడు గాదు. ఎవరన్న అవుసరంగా వొచ్చి 'ప్రశ్న' అడిగితే ఆయ్న జూసే పిచ్చి సూపుల్లో జనానికి మాత్యం ?అగపడేది. వాల్ల బాదకు తట్క ల్యాక నోటికొచ్చినేది యాదో ఒకటి గొణిగేటోడు. దాంట్లోంచి వాల్లకు గావాల్సిందేదో వాల్లకు దొర్కేది.

ఆయ్న పేరు తిక్క బాపనయ్యనే గాని, ఆయ్నకు తిక్కా పిచ్చీ వున్నెట్టు నాకు యానాడు అనిపిచ్చ ల్యా. అయ్య నాతో ఒక సారన్నా సాలు దప్పి, కట్టు దప్పి మాట్లాడింది ల్యా.

ఇంగ జెప్పాలంటే మామూలోల్ల కన్న కొంచెం ఎక్కువ పద్దతిగ మాట్లాడేటోడు. ఒక్కో పాలి, ఇంకొంచెం ఎక్కువ పద్దతిగ మాట్లడబోయి, వున్నెట్టుండి మాటలు మింగేసినెట్టు,

తన తెలివితేటలు దాసిపెట్టుకుంటున్నెట్టు నాకు అనిపిచ్చొండ్య.

మద్దె మద్దెన నాకు ఇంగోటి గుడ్క అనిపిచ్చొండ్య.

మామూలోల్ల కన్న తనకు ఎక్కవ తెలునని మామూలోల్లకు తెలడం తనకు ఇష్టం లేదు. అప్పుడప్పుడు మా వూరికొచ్చే ఆ 'హేతువాదం' పెద్దాయ్న లెక్క, అయ్య గుడ్క యాదో పెద్ద సంగతి చెప్పబోతున్నెట్టు, అది నాకు అర్తం కాదని, నా దగ్గర ఆ మాటలు ఆపేస్తున్నెట్టు శాన సార్లు అనిపిచ్చొండ్య.

ఇట్టాంటి మనిషిని కూనీ జేసిన సుబ్బరాయుడేమన్న పేద్ద కూనీ కోరా అంటే అది గుడ్క కాదు.

తిక్క బాపనయ్య కూని జరిగిన మర్నాడు నేను పది కిలో మీటర్ల దూరం లోని మా ఐస్కూలు నుంచి నడిసొచ్చొంటే వాల్లు ఎదురైనారు. ఇద్దరు పోలీసోల్లు, మద్దెన సుబ్బరాయుడు.

స్టేషన్లో ఇనుప బేడీలు ల్యాకనేమో, సుబ్బరాయున్ని చేతులు వెనక్కి విరిచి పసువుల పగ్గంతో కట్టేసినారు. పగ్గం రెండు కొసల్ని ఇద్దరు పోలీసోల్లు పట్టుకోని మా వూరి డొంగులో గడాముల స్టేషన్ కు తీస్క పోతొండారు.

నా కాడికి వొచ్చేతాలకు ఒక పోలీసాయనకు అప్పడే ఓంటికి పోవాలనిపిచ్చినెట్టుంది. తన సేతిలో పగ్గం కొస గుడ్క రెండో పోలీసుకిచ్చి, కాకీ ప్యాంటు గుండీలిప్పుకుంటా పక్కన సేని గెట్టుకెల్లి పాయ. నేను వాల్లను దాటిపోతొంటే సుబ్బరాయుడు నన్ను పేరు బెట్టి పలకరిచ్చినాడు.

'తిక్క బాపనయ్య అట్టా అనకుంటే నాకంత కోపం రాకుంటొండ్య' ?అన్నాడు సుబ్బరాయుడు.

'అయ్య ఏమన్నాడు' అని నేను అడగల్యా, పక్కన పోలీసాయన నన్ను కసురుకుంటాడేమో అని.

'అయ్యకేం దెల్సు పెండ్లాం దగ్గెరికి రానియ్యకపోతే ఎవుడన్నా ఇంగొగర్ని సూసుకోడా? ఆ లంజేమో నా సొమ్ము దిని ఇంగోడి కాడ పండుకుంటే నాకు రేగదా. అందుకే దానిగ్గుడ్క నాలుగు తగిలిచ్చినా. అది తప్పంట. ఈ బాపనోనికెందుకు నాకు నీతులు జెప్పే పని, కూటికి లేని తిక్క బాపనోనికి... వానె...'

ఇంతలో ఓంటికి వొయ్యనీకి వొయిన పోలీసాయ్న తిరిగొచ్చి "ఆఁ, ఇగ జాల్లే, బాపనోన్ని జంపిన పాపం ఏడేడు జెల్మలగ్గుడ్క పోదు పా' అని పగ్గం రెండో కొస పట్కోని గుంజుక పాయ.

సుబ్బరాయుడు... బాగా గాలి గొడ్తే ఎగరిపొయ్యే జొన్న వొగుడు లెక్కటి సుబ్బరాయుడు... తానేదో బండకు మేపిన పెంటకోడెనో, దేవునికి ఇడ్సిన ఆంబోతో అయినెట్టు రొమ్మిరుసుకుని, తను రొమ్మిరుసుకున్నెట్టు నేను సూచ్చొండానో లేదో అన్నెట్టు ఒగ సారి నాకెల్లి జూసి పోలీసోల్ల మద్దెన నడ్సుకుంట ఎల్లి పాయ.

సుబ్బరాయుడు మల్ల వూల్లోకి రాల్యా. తన కేసు ఏమయ్యిందో వూల్లో ఎవురికి పట్టల్యా. ఎవురికన్న పట్టడానికి తనేమన్న మోతుబరా, రాజకీయ నాయకుడా?

మామూలు మన్సి. అంతో ఇంతో తాగుబోతు. ఆడోల్ల యవ్వారంలో ఇరుక్కున్నోడు.

అయ్య సంగతి సరే. ఆయిన పేరే తిక్క బాపనయ్య.

సుబ్బరాయునిది యాదో 'సిల్లర' కులం. వాల్ల ఇండ్లు బోయ ప్యాట్లో వుప్పునీల్ల బాయి కాడుంటాది. ఇండ్లంటే అది ఇండ్లా? ఇంటి ముందర కొంచెం స్తలముంటాది. ఆ స్తలంలో పూర్వకాలం ఎప్పుడో మంచి బండ సట్టం వున్నెట్టుంది. బండలన్ని పగిలిపొయి, పగిలిన బండల మద్దెన గడ్డి మొల్సింది. ఆ స్తలంలో బాగా ఎన్క ఒక రూము. అది గుడ్క ఎప్పుటివో తాతల నాటి గోడలు. అంతా పడిపొయ్యి, గోటిమోపున నిలబడ్నెట్టు వుంటాది.

ఆ ఇంట్లో సుబ్బరాయుడు, తన పెండ్లాం, ఇద్దరు పిల్లలు వుంటారు. కూలి పని చేసుకుని బతికెటోల్లు.

సుబ్బరాయునికి తాగుడు అలువాటు బాగానే వుంది.

తిక్క బాపనయ్యకు మొదట్లో లేదు గాని, నేను ఐస్కూలుకు పొయినాక అలువాటయింది తాగుడు.

తను బాపనయ్యననే స్పృహ అయ్యకెన్నడూ లేదు. బాపన తనం ఏమన్నా వుంటే దాన్ని మా వూరికి రాకముందే యిప్పి పార్నూకినాడు. పుటకతో ఒగరెక్కువ ఒగరు తక్కువా, ఏందిది, తప్పు అని నాతో ఎప్పుడన్నా అనేటోడు. అలాంటి తిరుగుబాటు ఆలోచనలతోనే అయ్య యా తూర్పునాటి నుంచో తిక్కోని లెక్క వొదరుకుంటొచ్చినాడని నాకు అనిపిచ్చాది.

అందుకే అయ్య తాగుతాడని తెల్సినప్పుడు నాకు ఆశ్చర్యం అనిపిచ్చ ల్యా.

మా వూల్లో తాగే నీల్లకు ఒకే ఒక్క అదారం మద్దిలేటి వాగు. వాగు పడమటి దిక్కున వూరిని తాకుతాది. ఉత్తర దిక్కుగా వూరిని చుట్టేసి, తూర్పున, వూరికి కాస్త దూరంగా ఎడమకు మలుపు తిరిగి ఇంకో వూరి దిక్కు పోతాది. మలుపు తిరిగే కాడ పెద్ద మడుగు కడతాది. మడుగు చుట్టూతా వాగు

వొడ్డున సెట్లు. అదంతా సిన్న అడివి లెక్క వుంటాది.

దాని పేరు తూర్పొనుం.

తూర్పొనుంలో సెట్ల మద్దెన వుంటాయి సారాయి బట్టీలు.

వూరికి తగినంత దూరం వుండి, శాన మంది కూకోని ఆడుకుంట పాడుకుంట తాగడానికి బలే సోటు. ఆడ సారాయి బట్టీలే గాదు. వాగు వొడ్డున ఈత సెట్లు బాగా పెరుగుతాయి. వాటిని యాలం పాడుకున్నోల్లు గీత గీసి, లొట్లు గట్టి తాజా తాజాగా దింపే ఈత కల్లు గుడ్క వుంటాది.

సారాయి గావాల్నంటే సారాయి, కల్లు గావాల్నంటే కల్లు.

ఒకనాడు మాపద్దాము అడికి వొయ్యొచ్చినోల్లు మర్నాడు పోకుండ వుండలేరు. వాల్ల పానం ఇగ ఆడికే పీకుతొంటాది.

ఆడ కల్సినారు తిక్కబాపనయ్య, సుబ్బరాయుడు.

సుబ్బరాయుడు మాటకారి. మన్సుల్ని వూకూకెనే ఐసు జేచ్చాడు. ఏమన్నా ఆశ పడి గుడ్క గాదు. మాటకారితనం సుబ్బరాయుని లచ్చెనం.

తిక్క బాపనయ్యలోని అమాయికం అన్పించే తెలివితేటలు నా లెక్కనే సుబ్బరాయునికి గుడ్క అర్తమయినట్టుంది. ఆయ్న మాటల్ని శ్రెద్దగా యినేటోడు. అయ్యేమో సుబ్బరాయుని మాటకారితనానికి ముర్సిపొయ్యి తనను సొంత మన్సి అనుకునేటోడు.

ఇంత వరకు కత నాకు తెల్సు. వాల్లిద్దరి దగ్గరితనం నాకు బాగా అన్పిచ్చొండ్య. వాల్లిద్దర్లో ఎవురు గల్సినా ఆ మాట వాల్లతో అనేటోన్ని. కల్లం గోడ మింద అయ్యతో పెరిగిన నా స్నేహం, వుప్పునీల్ల బాయికాడి సుబ్బరాయునికి గుడ్క పాకింది.

పెడరెక్కలు విరిచి కట్టిన పగ్గం మద్దెలో నిలబడి సుబ్బరాయుడు నాతో మాట్లాడిన ఆ మాటల అర్తం తెలుసుకోకుండా వుండడం నాతో అయ్యే పని గాదు.

తూర్పొనుం తాగుబోతుల్లో నాకు బాగా తెల్సిన ఇంగో మన్సి ఆకుల నారాయన. నారాయన గుడ్క అసలు కత నాకు సెప్పక పొయ్యేటోడే. సుబ్బరాయుడు కొట్టిన పట్టుడుకట్టె దెబ్బకు నెత్తి పగిలి, ఇంకా వూపిరుండగా తిక్క బాపనయ్య ఆకుల్నారాయనతో అన్నాడంట.

'ఎవురితో ఎంత స్నేహితమన్నా జెయ్యి గాని, వాల్ల తప్పులు యా నాడు ఎత్తి సూపిచ్చాకు. అందర్కీ అన్నీ దెల్సు. తెల్సి తెల్సే అన్నీ సేచ్చొంటారు. ఏటు దిన్న్య పాము లెక్క... తప్పు ఎత్తి సూపిచ్చినోన్ని కాటేచ్చారు'

ఆమాటల అర్తం గుడ్క నారాయనే సెప్పినాడు.

ఉప్పునీల్ల బాయి కాడ పాడువడిన ఇంట్లో సుబ్బరాయుడు, తన పెండ్లాం బాగానే వుండెటోల్లు. అట్టాంటిది, ఎట్టా గల్సిందో గాని, సుబ్బరాయునికి సింత సెట్టు బజాట్లో పుల్లమ్మకు లంకె కుదరింది. పుల్లమ్మ మొగుడొదిలేసిన ఆడామె. ఐదారేండ్ల ఇద్దరు పిల్లలతో ఒంటిగానే వుంటాది.

సుబ్బరాయుడు తిక్కబాపనయ్యతో ఈ కత యా నాడు సెప్ప ల్యా. సుబ్బరాయుడు, అతడి పెండ్లాం కలిసి బాగుండారనే తిక్కబాపనయ్య అనుకునేటోడు. సుబ్బరాయుడు గుడ్క అయ్యకు అట్టనే సెప్పెటోడు.

ఒక మాపద్దాం సింతసెట్టు బజాట్లో పుల్లమ్మ ఎవుర్నో వూరు పేరు ల్యాకుండ తిట్టిపోస్తోంది. ఒక్కదాన్ని వుండానని ఎవుడెవడో తన మింద పెత్తనం జేచ్చొండారని. వాడెవుడో తనను కొట్టిపొయినాడని. వాడేమన్న తాలి గట్టిన మొగుడా అని ... రక రకాల తిట్లు తిడుతోంది.

ఆమె తిట్టేది ఎవుర్నో గాదు, సుబ్బరాయున్నే.

ఇన్నాల్లు తనతో సీరెలు రయికలు కొనిపిచ్చుకోని, తనకు మాయ మాటలు జెప్పి, ఇయాల ఇంగెవుర్నో మరిగి తనకు ఎదురు తిరిగిందని సుబ్బరాయుని కోపం.

ఇంత జరిగినాక గాని ఈ కత తిక్కబాపనయ్యకు ఎర్క గాల్యా.

ఇన్నాల్లు తనకు చెప్పనే లేదని ఒక మాట. అట్టా ఆడబిడ్డ మింద నిందలేసి తన్నినావంట గదా, అదేం పని, నువ్వు ఇట్టాంటోనివా అని మరో మాట.

తూర్పు వనంలో తిక్క బాపనయ్య తన సావాసగానితో పేచీ పెట్టుకన్నాడు.

మాట మాట పెరిగింది.

ఈ వూరికి రాక ముందు తానెలా తిరుగుబాటుదారుడో మతికి వొచ్చినెట్టుంది అయ్యకు. మందు మింద ఇంకింత తిరుగుబాటుదారుడు అయిపొయినాడు. 'ముందు పెండ్లాన్ని, ఆ మింద ఇంగో ఆడపిల్లను ఇట్టా గోస పెట్టడమేంది' అని లిగాడి పెట్టుకున్నాడు సావాసకాడు సుబ్బరాయునితో.

'పెండ్లాం ముట్టుకోనియ్యకపోతే యా మొగోడైన ఏం జేచ్చాడు, తన దారి తను సూస్కోకుండా' అంటాడు సుబ్బరాయుడు.

**కవిత**

# చైనా పద్యాలు

- డా॥ ఎన్. గోపి

అవును!
నవచైనా నిర్మాత మావోయే
అంగుష్ఠమాత్రులు
మ్యావ్ మ్యావ్ మన్నా సరే.
మావాడు
చైనా వాచీ తెమ్మన్నాడు
ఇండియా రాగానే
సమయం మారిపోయింది
మ్యూజియం నిండా
చరిత్రే
ఈ పాత్రను చూడు
కాలాన్ని నింపి పెట్టుకుంది
అమెరికా గురించి
అన్నీ తెలుసు
పొరుగు వాడి గురించే
పట్టించుకోము.
దేశి సరుకుల్తో
నింపమన్నాడు గురజాడ



చైనా
ఆ పని చేస్తుంది.
భావుకతలో
మనకు వీళ్లే సాటి
ఎక్కడో పశ్చిమంలో
వెతుకుతున్నాం.
చైనా సంగీతాన్ని
శ్రద్ధగా వినండి
ఎస్.డి. బర్మన్‌లి
గుర్తుకొస్తున్నాడు.
ఇప్పటి గొప్ప చైనా కవి
జీదీ మాజియాలి
కవిత్వమే కాదు
మనిషీ అందమే.
పశ్చిమ గాలులను
చొరనీయరు
ఒరిజినాలిటీ
చైనీయులదే సారు.
చైనా అంటే
విప్లవం గుర్తొస్తుంది
ఇప్పుడు ప్రేమ కవిత్వం
పువ్వులై పూస్తుంది ◆

---

"అరెనీ, అట్టయితే, పెండ్లాంతో యిడాకులు దీస్కో. ఇంగొగర్ని జెస్కో. పుల్లమ్మ ఎట్టయిన మొగుడ్ని ఇడ్సిపెట్టి, ఒక్కతి బతికే ఆడదే గద. దానికి ఎవురొద్దంటారు?' అని తిక్కబాపనయ్య.

"ఏం పెండ్లే గావాల్నా? ఆ పుల్లి ముండ ఇంగ బతుకంత నాతోనే వుంటాననింది. అట్టాంటిది ఇంగొగని కాడ ఎట్టా పండుకుంటాది?" సుబ్బరాయుని వాదం.

"అదేం మాట, నువ్వేమో పెండ్లాం వుండి ఇంగొగరి కాడికి పోతే అది గొప్ప. ఆ ఇంగొగరు ఒక్క నీ దగ్గర్నే పండుకోవాల్నని, నీకే నమ్మకంగ పడుండాల్నని కడ్డాయం. ఇది తప్పు" బాపనయ్య ప్రతివాదం.

నీటికి నీరు నాచు. మాటకు మాట నాచు.

గిలాసల బిస. ఎవురికెవురు తగ్గ ల్యా.

సుబ్బరాయుడు పక్కన ఒక పట్టుడు కట్టె పడుంటే, అది తీసుకుని అయ్య నెత్తిన ఒగటేసినాడు. దెబ్బ ఆయంపాట్న తగిలింది. నెత్తి పగిలింది.

ఇంత జరుగుతాదని అయ్య అనుకోనిండ్ల్యా. అంత దెబ్బ తగిల్యాక గుడ్క నన్ను నిజంగా కొట్న్యావా అన్నెట్టు జూసినాడే గాని సుబ్బరాయున్ని ఒక్క మాట గుడ్కఅన్ల్యా.

కాసేపుంటే పానం బోతాది అనుకుంటున్నెప్పుడు అయ్యకు తన అధిక ప్రసంగం తనకే తెలిసొచ్చినట్టైంది.

అప్పుడు నేను ఆ సగాల వుండింటే నాకు సెప్పే మాటనే ఆకుల్నారాయనతో సెప్పి పొయినాడు. ఆ మాటేదో అయ్య పై లోకం నుంచి నాకు సెప్తున్నెట్టుండాది ఇప్పుటికీ.

నేను ఇంగేమన్నా మర్సి పోతే మర్సిపోతా గాని ఈ మాట మాత్రం మర్సిపోను.

వాక్శుద్ధి వున్న మాట తిక్కబాపనయ్య మాట.

'... ఎవురితో ఎంత స్నేహితమన్నా జెయ్యి గాని, వాళ్ల తప్పులు యానాడు ఎత్తి సూపిచ్చాకు. అందర్కి అన్నీ దెల్సు. తెల్సి తెల్సే అన్నీ సేచ్చొంటారు. ఏటు దిన్న పాము లెక్క... తప్పు ఎత్తి సూపిచ్చినోన్ని కాటేచ్చారు'. ◆

కవిత

# ఒక నష్టం - ఒక కష్టం

- శ్రీనివాస్
9441307185

జరిగిపోతుంది
ఒక భీభత్సం జరిగిపోతుంది
నీ తెలివి తెప్పరిల్లే లోపే
దేహాలు మాంసం ముద్దలు
ముద్దలుగా కురిసి
ఛిద్రమైన వాహన శకలాలు
మంటల్లో తగలబడుతూ
నువ్ ఆకాశం వరకూ కట్టిన మేడ
నిలువునా కూలిపోతుంది
ఒక విమానాన్ని ఒక పక్షి ఢీకొని
కూల్చేసినట్టుగా
నువ్ పొట్ట వుబ్బించి వూదిన బుడగ
ఒక పిన్ను పొడిచి పేల్చినట్టుగా
పూసపూసా కూర్చిన దండ
మధ్యలో పుటుక్కున తెంపేసినట్టుగా
నువ్ ఆదమరచి ఆనంద లహరుల్లో
తేలుతున్నప్పుడు
నవ్వుల మండపంలో ఒకడెవడో
విధ్వంసం వ్రేల్చి పోతాడు
విషాదగీతం రాసిపోతాడు

మనిషి కానివాడెవడో ఎప్పుడో
మనమధ్యే అంచెలంచెలుగా
తయారౌతాడు
నువ్ కూడా కొంచెం కొంచెం
ఎరువు వేసే వుంటావ్
తోటకూర నాడు
వుపేక్షించిన బీజం
ఒకనాటికి నిన్ను కూల్చే
వటవృక్షం అవుతుంది

సమాధానం చెప్పని ప్రశ్నలు
నువ్ సంచీలో
మిగుల్చుకుంటూ పోతే
మెల్లెక్కుతున్న స్వరాల గానం
తీవ్రశృతిలో వుంటుంది
దేశభక్తి అంటే కాశ్మీర్

కాపాడుకోవడం ఒక్కటేనా
వీరజవాన్లను స్తుతిస్తూ మరో
దుశ్చర్యవరకూ
వాయిదా వేసుకుంటూ పోవడమేనా

నీ తోటివాడ్ని మాలవాడన్నప్పుడే
నీలోంచి ఒకడ్ని పరాయివాడ్ని చేశావ్
నిను కన్న తల్లిని బతుకుతక్కెడ లో
సమాన తూకం ఇవ్వనపుడే
మరికొంత పోగొట్టుకున్నావ్
అష్ట దరిద్రుడ్ని చేసి వొకడినీ
కుత్సితాలతో కూల్చి వేరొకడ్నీ
నీ నిలువెత్తు స్వార్థానికి
కులమనీ,మతమనీ
ప్రాంతమనీ,లింగమనీ
వైరుధ్యాలు కల్పించీ
ఎదగాలన్న నీ సంకల్పం వల్లే కదా
దేశాన్ని కుట్టలేని దేశభక్తి
వొలికిపోతోంది
తాము మనుషులమనే గుర్తింపుకు
పోరాట భూమికల్ని ఏర్పరచిన
నీ మకిలితనం వాళ్ళనింకా
నీ బూటకదేశపు మంత్రం
ఆహ్వానించలేక పోతోంది

ఒకడు నువ్ నిల్చున్న భూమిని
పెళ్ళగించి
నిను కాందిశీకుణ్ణి చేస్తాడు
ఒకడు బుర్రకెక్కిన విషాన్ని
బీజావాపనం చేస్తాడు
ఏదో వొక విలయం తో
నిత్యం సంక్షోభాల పండుగ
చేసుకుంటాడు

పూర్ణ సంసారాల్ని
పసిపాపడితోసహా చిదిమి
రేపటిని కొంతకాలం
శూన్యంలోకి నెడతాడు
వెన్నెల శృతిచేసుకొన్న పూలకొమ్మకు
నెత్తురుపూస్తాడు

రక్తానికి రంగులద్దకు
కోటి వ్యాఖ్యాలు సమాధానం కోసం
దఖలైనప్పుడు
కోటి వాద్యాలతో కప్పిపుచ్చలేవు
ఒకానొక వల విసిరినగాలంలో
బందీ కాబోకు

కన్నుల గుమ్మం దగ్గర
చెవి ఆనించి చూడు
లోన వాన కురుస్తూన్నంత సేపూ
ముఖాకాశానికి వెలుగురాదు
శతఘ్నులు ఘుర్ఘురిస్తున్నంత సేపూ
ఆకాశం వెన్నెల కురవదు
చిన్న కెలక అడ్డు పడినా
గొంతు లోకి నీరు దిగడం పూర్తిగా
జరగదు

ఇవాల్టి విధ్వంసం
ఎన్నాళ్ళకింద పురుడు పోసుకుందో
మాళిగల్లో దాచిన తాళపత్రాలకు
కూడా అందవు

శవాల్ని పూడ్చడమంత సులభం కాదు
శవం పుట్టకుండా చెయ్యడం
పాతర పెట్టవలసిందొకటుంది
అనుక్షణం తీర్చిదిద్దుతున్న
అసమానత్వం!
అహరహం క్రమిస్తున్న లాభ దాహం! ◆



కందుకూరి వీరేశలింగం
(16.04.1848 -27.5.1919)

# కందుకూరి జీవిత చరిత్ర - విశేషాలు

- శ్రీమతి నాయని కృష్ణకుమారి

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారు, జిజ్ఞాసువులైన ముందు తరాలవారు తన జీవిత విశేషాలు తెలుసుకోవడానికి వీలుగా, మిక్కిలి దయతో స్వీయ చరిత్రను సంగ్రహించి పుస్తకరూపంలో మన ముందుంచి వెళ్ళిపోయారు. జీవితంలో ప్రతి ఘట్టాన్నీ శక్తి సంపన్నంగా తీర్చి దిద్దుకున్న మహాత్ముల చరిత్రలు మళ్ళీ మళ్ళీ మననం చేయతగ్గవి. ఈయన అటు సాంఘిక రంగస్థలం మీదా, ఇటు సాహిత్య రంగస్థలంమీదా ముఖ్య పాత్రధారణ చేసి అందరి హృదయాల్లోనూ చెదిరిపోని ఉజ్జ్వలవేషాన్ని రూపుకట్టించిన ప్రతిభాశాలి. ఒక వ్యక్తి కాలపు తెరమరుగున కనుచాటయిన వెనుక, ఆ వ్యక్తితో పరిచయంలేని ముందుతరాల ప్రజా బాహుళ్యం, ముక్తకంఠంతో అతన్ని కీర్తిస్తూ ఉండడంలో అతని ప్రతిభ అంతా వెల్లడి అవుతుంది. ఆ వ్యక్తి పరోక్షంలో అతణ్ణి గుర్తుచేసేవి. ఆయన నిర్వహించిన ఘన కార్యాలూ, రూపుకట్టించిన ఆదర్శాలూ, ఈనాటికే కాదు ఏనాటికీ ఆయన తెలుగు సాహిత్యానికి ప్రసాదించిన వివిధ శాఖలు విస్మరితాలు కాలేవు. ఆయన తెలుగు స్త్రీలోకాభ్యుదయానికి వేసిన గట్టిపునాదులు కదలనైనా కదలవు. అటువంటి మహాపురుషుని జీవితం, స్మరించుకోవడానికైనా మన జాతికి మిగలడం మన అదృష్టం.

తెలుగుజాతికి ఈయన స్వీయచరిత్ర ప్రసాదించబడకముందు, ఈ రకమైన రచనలులేవు. దీన్ని వరవడిగా, గ్రహించి, సమకాలికులైన శ్రీ చిలకమర్తి లక్ష్మీనరసింహం పంతులుగారు. శ్రీ టంగుటూరి ప్రకాశం పంతులుగారూ స్వీయచరిత్రలు వ్రాశారు. ఇందులో ఒకరు కళా పరిపూర్ణులయితే మరొకరు ఆంధ్రకేసరి. ఒకరు సాహిత్యరంగంలోనూ, మరొకరు రాజకీయరంగంలోనూ కీర్తిపథాలందుకున్నారు. ఇద్దరికీ నాటకాలంటేనూ, రంగస్థలాలంటేనూ మోజు. అయితే చిలకమర్తి వారు రంగస్థల ప్రయోగర్హాలయిన నాటకాలు వ్రాయడంలో కుతూహలం చూపితే, ప్రకాశంగారు ముఖానికి రంగు పులుముకొని, రంగంమీద వేషం రక్తికట్టించడంలో శ్రద్ధ చూపించారు. ఇవి వాళ్ళ చిన్ననాటి ముచ్చట్లు. శ్రీ వీరేశలింగం పంతులుగారి జీవితచరిత్రలో ఇటువంటి చిన్ననాటి ముచ్చట్లు ఎక్కువగా

కనిపించవు. ఈయన జీవితచరిత్ర అనగా, తన కుటుంబ చరిత్రా, బంధువర్గపు చరిత్రా, స్వీయప్రమోదాల విషాదాల చరిత్రా కాక, కేవలం ఆ కాలపు రాజీకయ సాంఘిక చరిత్ర మాత్రమే. చిన్నప్పటి నుండీ ఆయన ఊహలెప్పుడూ శక్యాశక్య విచారణ లేకుండా, ఉన్నతత్వం వైపుకు ఎగబ్రాకుతూ ఉండేవి. తపస్సుచేసి మహత్తులు సాధించాలనీ, మహాకవియై అమూల్య కావ్యజగత్తును సృజించాలనీ ఆయన అప్పటి నుండీ కలలు కనేవారట. పెద్దయ్యాక ఈ రెండు కోరికలూ ఈయన నెరవేర్చుకోగలిగారు. ఈయన చేసిన తపస్సంతా సంఘసంస్కరణ మహాఫలాన్ని వాంఛించి: అది చక్కగా ఫలించి ఈయన జీవితానికి స్త్రీ లోకాభ్యుదయ ప్రదాతృత్వమనే మహా మహత్తును ఆపాదించి పెట్టింది. అందువల్ల, పందోమ్మిదవ శతాబ్దపు అర్థభాగం నుండి ఆరవయ్యో శతాబ్దపు ప్రథమభాగం వరకూ తెలుగు జాతి వివిధ రంగాలలో పోయిన అద్భుతావహాలయిన మార్పులూ, స్పష్టంగా చూపించడానికి పట్టిన అద్దమే ఈయన జీవితచరిత్ర. అందులో ఈనాడు స్మృతిమాత్రులై నిలచిన మహా మహులెందరో మన కళ్ళ ముందు చకచకా మెరవడం కనిపిస్తుంది.

అన్ని జీవితాలకు మల్లేనే శ్రీ పంతులుగారి జీవితం కూడా అతి సామాన్యంగా మొదలయింది. ప్రథమ ఘట్టాలు చదువుతూ ఉంటే బాలుడుగా ఉన్న వీరేశలింగం, విద్యార్థిగా ఉన్న వీరేశలింగం, ముందు ముందు అద్భుత విజయాలు సాంఘిక సాహిత్యరంగాలలో సాధిస్తాడని మనం ఊహించనైనా ఊహించము. మూడడుగుల నేల యాచిస్తున్న వామనరూపి త్రివిక్రమమూర్తియై నింగీ నేలా ఆక్రమించినట్లుగా, ప్రౌఢుడైన వీరేశలింగం ఒక్కసారిగా మన అంచనాలకూ కొలతలకూ అందకుండా అద్భుత ప్రమోద భరితమైన పూజ్యభావాన్ని మాత్రమే చూరగొంటాడు. అయితే ఇంత హఠాత్పరిణామ క్రమంలో ఈయన జీవితంలో కూడా, చిలికికయ్యాలూ, ద్వేషాలూ, కోర్టులూ, దావాలూ, అపవాదులూ, అంతస్తాపాలూ కనిపిస్తయ్. అవన్నీ జానపదగాథల్లో కథా నాయకుడనుభవించే కష్ట పరంపరలతో పోల్చేట్లయితే పంతులుగారొక రాజకుమారుడూ, సంఘ సంస్కార ప్రయాసదశ కథాసారమూ అవుతుంది.

చిన్నతనంలో ఈయన ఇంట్లో వాళ్ళందరికీ అల్లారుముద్దుగా పెరిగిన పాపడు. ఉఫ్ఫున ఊదితే ఎగిరిపోయేంత దుర్బలంగా ఉండేవాడు. తిన్నతిండి జీర్ణం చేసుకోలేక, జలుబూ తుమ్ములూ వీటితో అవస్థపడుతూ ఉండడం ఒక అలవాటుగా ఉండేది. ఆరోగ్యం ఇంతనాసిగా ఉండడం వల్ల కాబోలు దానివంతు బలం కూడా పూరించుకుని మేధ అద్భుతంగా ఉండేది. ఏదైనా ఒక్కసారి చదివితేనే జ్ఞాపకం ఉంచుకోవడం, మతికెక్కినదాన్ని మర్చిపోకపోవడం ఈయన విశిష్టత. చిన్నతనంలో ఈ జ్ఞాపక శక్తి వల్లనే. అవధానాలు కూడా చేసి అందరిమెప్పులూ పొందుతూ వుండేవాడు. కాని నెమ్మదిమీద, అవి సారం లేనివనీ, గడ్డిమంటలా తక్షణాన మిరుమిట్లుగొల్పి, ఆ తర్వాత జ్ఞాపకానికైనా ఏమీ మిగల్చకుండా చల్లారిపోయేవనీ గ్రహించగలిగాడు. పంతులుగారు ఆనాడే ఆ మోజులో పడిపోయి ఉంటే మనకు సంఘ సంస్కర్తగా మిగిలేవారు కారేమో!

ఈయన పదమూడవ ఏటనే తొమ్మిదేళ్ళ రాజ్యలక్ష్మమ్మగారితో వివాహం జరిగింది. ఆ వివాహానికి సాక్షిభూతులైన ఎవరికి కూడా ఈ కుర్రవాడే పెద్దయ్యాక బాల్య వివాహాలను నిషేధించి, వితంతువివాహాలు చేయించి, సంఘంలో ఉండే అర్థరహిత సంప్రదాయాలకు స్వస్తి చెప్పే కీర్తిమంతుడౌతాడని తెలిసిఉండదు. అయితే పెద్దవాడై, బాల్యవివాహాల వల్ల చెడు జరుగుతుందని చాటి చెప్పిన ఈయనకు తన వివాహం మాత్రం శుభప్రదమూ, సర్వసహాయ్యమూ అయింది. రాజ్యలక్ష్మమ్మగారు అనుకూలవతియైన భార్య. ఆయన సంఘ సంస్కర్తగా చిరస్మరణీయుడు కావడానికి ఆవిడ చేసిన దోహదం ఎంతో ఉన్నది. తన జీవిత చరిత్రలో జీవిత భాగస్వామి అయిన ఆవిడను గురించి పంతులుగారు చాలా భావోద్విగ్నతతో చెప్పుకున్నారు. నిజానికి ఈయన జీవిత చరిత్రలో స్వీయకుటుంబాన్ని గురించి ప్రసక్తి ఎక్కువరాదు. చిలకమర్తి వారి స్వీయ చరిత్రలో ఆయన కుటుంబ బాధ ఇతర వ్యావర్తాలతోపాటు సమాంతరంగా నడుస్తుంది. ఆయనకున్న బంధువర్గమూ, ఎవరు తనను ఆశ్రయించిందీ, ఎవరి పెళ్ళిళ్ళు ఎప్పుడెప్పుడు జరిగినవీ, ఎవరి దశ ఎలా ఉన్నదీ, అన్ని వివరాలూ అందులో మనం చూడవచ్చును. వీరేశలింగంగారి చరిత్రలో తాను పూనుకున్న రకరకాల లోకోపయుక్త కార్యాల నిర్వహణా, అందులో ఆయన పడే

పాట్లు, శత్రుమిత్ర కులాలు అందుకు చేసే విఘాత సహాయాలూ – ఇవే ఎక్కడ చూచినా కనిపించేవి. కాని భార్యను అమితంగా ప్రేమించి, ఆవిడ సహాయాన్ని తన లోకోపహిత కార్యాలలో అనుక్షణమూ పొందగలిగిన పంతులుగారు ఆవిడను గురించి విపులంగా వ్రాసుకోలేకుండా ఉండలేకపోయారు. "షట్కర్మయుక్తా కుల ధర్మపత్నీ" అన్న సూక్తిని అక్షరాలా తన ధర్మ పత్నీత్వానికి అన్వయించుకున్న చరితార్థ ఆవిడ. సంప్రదాయబద్ధమైన కుటుంబంలో పుట్టి, ఎక్కువ చదువు సంధ్యలు లేని ఆవిడకు సహజంగా కరుడుగట్టిన మౌఢ్యం, ఆచారాలను అధిగమించలేనితనం ఉండవలసినమాటే. కాని రాజ్యలక్ష్మమ్మగారిది సంస్కర్త హృదయం. అందులో భర్త నూతన సంప్రదాయాల మీద కేవలం వాగ్రూపమైన యుద్ధాన్ని ప్రకటన చెయ్యడంలో సరిపెట్టుకోక, ఆచరణ పూర్వకమైన క్రియాసిద్ధికి తలపెట్టినవాడు. అయినా ఆవిడ అతనికంటే సంస్కరణమీద ప్రీతికలది. కాబట్టే బంధువులూ, మిత్రులూ, పరిచయులూ అందరూ "నీభర్త నీ పనినుండి మరలించు" అని దీనంగా వేడుకున్నప్పుడు ఆవిడ ఏ మాత్రమూ చలించక, "ఆయన పూనినది మంచి కార్యమని నేనును నమ్ముచున్నదాన నగుటచే నే నాయనతో వలదని చెప్పపోవుటయేకాక, యెన్ని కష్టములు వచ్చినను నే నాయనను విడువక తోడ్పడెదను" అని దృఢంగా చెప్పగలిగింది. అంతేకాక అనాథలై ఆశ్రయాన్ని చేరిన వితంతువుల్ని తల్లిలా బుజ్జగించేది. గురువులా బుద్ధులు చెప్పి అక్షరజ్ఞానం కలిగించేది; సోదరిలా, నెచ్చెలిలా వాళ్ల నమ్మకాన్ని చూరగొనేది. బయటకు వెళ్ళిన పంతులుగారు ఇంటికి చేరుకునేలోగా, ఎవరైనా వితంతు స్త్రీ ఆశ్రమంలో చేరడానిని వస్తే, భర్తకు ఆవిణ్ణి చూపించే ముందు, "మీకివ్వాళ మంచి శుభవార్త చెప్పదలచుకున్నాను సుమండీ;" అని చెప్పి మరీ చూపించేది. అంత విశాల దృక్పథం కలదీ. సంస్కరణాభిలాషిణీ కాబట్టి, ఆవిడ చనిపోయిందన్న ఎఱుక కలగగానే పంతులుగారు, "ఓ ఈశ్వరా, వృద్ధదశలో నా కిట్టి మహాపదను తెచ్చి పెట్టితివా" అని మాత్రమే అనగలిగారు.

పంతులుగారి జీవితంలో స్త్రీ పునర్వివాహ సంస్కరాభిప్రాయం చాలా చిత్రంగా కలిగింది. ఆయనకు 26 ఏండ్ల ప్రాయమప్పుడు ఉపాధ్యాయిత్వాన్ని నిర్వహిస్తూ పత్రికా విలేఖకత్వాన్ని కొనసాగిస్తూ నిమ్మకు నీరెత్తిన విధంగా ప్రశాంతంగా సాగుతుండేది జీవితం. ఆ రోజుల్లో నిస్తబ్దక కాసారంలో బెడ్డ విసిరిన మాదిరిగా ఆయన జీవితంలో కల్లోలాన్ని కల్పించిన వారు ఒక విధంగా బ్రహ్మశ్రీ కొక్కొండ వెంకటరత్నం పంతులుగారనే చెప్పాలి. వారి 'ఆంధ్రభాషా సంజీవని' లో పనిగట్టుకుని విద్యాభ్యాసం వల్ల స్త్రీకి, ఆవిడ మూలంగా సంఘానికీ కలిగే కష్టనష్టాలు అంచనా వేస్తూ వ్యాసాలు వ్రాస్తూ ఉండేవాళ్ళు. ధవళేశ్వరంలో ఉపాధ్యాయ వృత్తి నిర్వహిస్తున్న పంతులుగారు దీన్ని సహించలేకపోయారు. స్త్రీ లోకానికంతటికీ అపకారం కలిగించే అభిప్రాయాలు జనుల నెత్తిన రుద్దడం సంఘానికే ప్రమాదకరంగా ఆయన భయపడిపోయారు. యుక్తి ప్రయుక్తి సహితంగా కొక్కొండ వారి అభిప్రాయాలను ఖండిస్తూ, ప్రతి వ్యాసాలను పురుషార్థ ప్రదాయిని అనే పత్రికలో ప్రకటించడానికి పూనుకున్నారు. వాద వివాదాలతో ఈ విధంగా ప్రారంభమైన స్త్రీ విద్యోద్ధరణాభిప్రాయం, ఆయనలో వేరూని, దృఢమై చివరకు తనబోటి జిజ్ఞాసువుల సహాయంతో, ఒక బాలికా పాఠశాల స్థాపించడమనే సత్కార్య రూపంలో ఫలించింది. స్త్రీ విద్యను ప్రోత్సహించే తన అభిప్రాయాలను ఇతరుల పత్రికల్లో స్వేచ్ఛగా చెప్పుకోవడం కొంత ఇబ్బందిగా తోచి, ఆ సంవత్సరమే ఆయన ఒక చిన్న మాసపత్రికను నడపడం ఆరంభించారు. అదే వివేకవర్ధని. దాన్లో ఆయన మొదట తన్ను గురించి,

"బ్రాహ్మణుండను హూణభాష నేరిచి యందు
నేఁ బ్రవేశ పరీక్ష నిచ్చినాఁడ.
నాంధ్రమున నొకింత యభిరుచిఁగలవాఁడ
దేశాభివృద్ధికై లేశమైనఁ
బాలుమాలక పాటుబడ నిచ్చు c గలవాఁడ
కవితా పటిమ కొంత గలుఁగు వాఁడ"

అని చెప్పుకున్నారు. ఆ వివేకవర్ధనే పోను పోను పేరు మోసి యెన్నో లోకహిత కార్యాలను చేయగలిగింది. ఆ రోజుల్లో పెద్ద ఉద్యోగుల దగ్గర లంచగొండితనం అధికంగా ఉండేది. ముఖ్యంగా న్యాయస్థానాలలో న్యాయాధిపతులు న్యాయానికంటే లంచానికి ఎక్కువ ప్రాధాన్యం ఇచ్చేవారు. మునసబు ఎదుట కేసులు వాదించే వాది ప్రతి వాదుల ప్లీడర్లు కేసులో పాయింట్లు చెప్పడం మాని, న్యాయాధిపతులు ఈ కేసును 100వ సెక్షన్ ప్రకారం విచారించాలి. 120 వ సెక్షన్ ప్రకారం విచారించాలి అంటూ పాట పెంచుకుంటూ పోయేవారు. ఈ 100, 120, 130, 140 మొదలైనవి సెక్షన్ల నంబర్లు కాక కేవలం వాది

ప్రతివాదులు మునసబు గారికి ముట్టచెప్పుకోగల మొత్తం. ఈ విషయం తన కెవరికీ తెలియనట్లుగా అందరూ నటించే చిదంబర రహస్యం. అందువల్లే పాట ఏ పెద్ద మొత్తం దగ్గర ఆగిపోతుందో, ఆ మొత్తం పాడిన న్యాయవాడే సాధారణంగా కేసు గెలుస్తూ ఉండేవాడు. – ఇటువంటి లంచగొండి తనాన్ని శరపరంపర లాటి వ్యాసపరంపరతో చించి చెండాడ గలిగింది వివేకవర్ధని. దీని విమర్శలకూ, ఇది వెలిబుచ్చిన ఋజువులకూ, లక్ష్యులయిన వ్యక్తుల్లో ఒకరిద్దరు బర్తరపు కావడమూ, అవమానం భరించలేక ఆత్మహత్య చేసుకోవడమూ జరిగింది.

ఇందులో లోకాన్ని మరమ్మత్తు చేసే సాంఘిక విషయాలే కాక, సాహిత్య విషయికమైన వాద ప్రతివాదాలు కూడా జరుగుతూ ఉండేవి. వీటికి కూడా ముఖ్యకారకులు బ్రహ్మశ్రీ కొక్కొండవారే. వారి ఆంధ్రభాషా సంజీవనికి, వివేకవర్ధని పైకి వస్తున్న కాలంలో హాస్యవర్ధని అనే అనుబంధం చేరింది. దీని అట్టమీద హాస్యాధినేత, దంత ముఖుడూ, అయిన విఘ్నేశ్వరుడు నాట్యంచేస్తున్న రూపం ఉండేది. దీనికి సమాధానానుబంధంగా వివేకవర్ధనికి హాస్యసంజీవని అనే మరో అనుబంధం చేరింది. దీని అట్టమీద సింహముఖుడైన విఘ్నేశ్వరుడు కన్పించేవాడు. గజసింహాల పరస్పరవైరం. ఆ వుద్దండు లిరువురూ ఆ రకంగా వినియోగించుకున్నారు. ఈ రెండు అనుబంధాలకూ ముఖ్యాశయం. పరస్పర కృతులలో ఉండే దోషచర్చ. ఇది జరగడానికి సరియైన ఆలంబనం వీరిద్దరూ ఆంధ్రీకరించిన విగ్రహతంత్రం. ఈ రెండూ ఒకేసారి రావడంచేత ఒకరిమీద ఒకరికి రంధ్రాన్వేషణకు మంచి అవకాశం దొరికినట్లయింది. బ్రహ్మశ్రీ కొక్కొండవారి శిష్యుడు, శివశంకరపాండ్యా అనే ఆయన వారి విగ్రహతంత్రానికి ఇంగ్లీషులో పీఠికవ్రాస్తూ ప్రస్తావనా సందర్భంలో, శ్రీ వీరేశలింగం పంతులుగారి విగ్రహం కేవలం కొక్కొండవారే ఎడమచేత్తో వ్రాసినట్లుగా ఉందని అన్నాడట. ఇది పంతులుగారికి ఆగ్రహ కారణమైంది. అందువల్ల, కొక్కొండవారి విగ్రహతంత్రంలో లోపాల్ని ఎత్తిచూపడమే ప్రధానాంశయంగా కొంతకాలం విమర్శలు చేశారు. అటువంటి విమర్శలకు వివరణరూపంలో ఆయన ఇచ్చిన ఉపోద్ఘాతం చూస్తూంటే, శ్రీ కొక్కొండవారి మీద వారికా సమయాన గల కోపం ఎటువంటిదో తెల్లమౌతుంది. అది ''లోకములో నిష్పక్షపాతియగు విమర్శకునకు గుణబాహుళ్యముగల కృతుల విమర్శించుటయే మిగుల వ్యసనకరమైన పనిగానుండును. అట్టి మహాకావ్యముల విషయములోనే అట్లుండుననగా కుమ్మరావములో నిత్తడి ముంతలకొరకు వెదకినట్లు గుణలేశముల నేనిఁ గనిపెట్ట బహుప్రయాసముతో వెదకదగిన యీ విగ్రహతంత్రమువంటి పుస్తకముల విమర్శనకుం బూనుకొనుటకంటె చింతాకరమైన పని నాబోటులకు వేరొక్కటి కన్పట్టకపోవుట వాస్తవము.'' ఇటువంటి విమర్శనాధోరని చూస్తుంటే ఆశ్చర్యంతోపాటు భీతికూడా కలుగుతుంది మనకు. సముజ్జీలయిన, ఆ గొప్పవాళ్ళు అట్లా తిట్టుకున్నా, హోరాహోరి యుద్ధం చేసినా వారికి చెల్లింది. ఈనాడు, అటువంటి గొప్పతనమూ, ప్రతిస్పర్ధిత్వమూ ఉన్నాయేమోగాని, అంత తెగించి ప్రత్యక్షంగా దెబ్బలాడుకునే నిర్భీకతా, నిర్మొగమాటమూ లేవు.

వివేకవర్ధని యీ విధంగా సంఘ సాహిత్య విషయికంగా మార్పుల్ని కోరుతూ విప్లవాత్మకంగా సాగుతూ ఉండగా 1874లో ఒక సంఘటన జరిగింది. మదరాసు నుండి కొందరు జిజ్ఞాసువులు స్త్రీ పునర్వివాహాన్ని ప్రోత్సహిస్తూ ఒక సమాజాన్ని స్థాపించారు. క్రియారూపంలో ఏ పనీ చేయలేకపోయినా వాగ్వాదాలతోనూ, ప్రచారాలతోను కొంతలో కొంత రెండేళ్ళపాటు ఈ సమాజం కొంత సందడి చేసింది. ఆ సందడికే బెదిరి శ్రీ కొక్కొండవారు పంతులుగారి కొక లేఖ వ్రాశారట. ఈ ఉద్యమాన్ని ఖండించమనే సారాంశంకల ఆ లేఖలో యీ విధంగా ఉంది. ''తద్విషయము మనము మిన్నకుండవచ్చునా? తమకుఁ దోచినట్లు ఖండన వ్రాపి పంపుఁడీ: నేను నిందస్మత్సభానదులలోఁ దత్ఖండన పరాయణుండనై యున్నాఁడను. నాస్తికతా హర్మ్యసోపాన నివిష్టపరులైనవారు దుష్టులు గాక శిష్టులగుదురా?... ఒక వేళ మనకంటె విధవ వివాహవాదులు బలవంతులైనను మనము భీష్మానుయాయులమగుదుము గాక: మన ప్రతిపక్షుల భార్గవ ప్రతిభులగుదురు గాక. ధర్మమే జయము. చింతయేల? మన మందరమును గూడుకొన్నఁ బ్రతివాదులు విత్తమత్తులైనను, మత్తగజంబులు శృంఖలాబద్ధంబులై కంది కందుచందంబున నగుట సిద్ధంబు...'' ఈ లేఖకు పంతులుగారు ఏ సమాధానం వ్రాశారో మనకు తెలియదు – కాని కలిసివస్తారనుకున్న పంతులుగారు పూర్తిగా బ్రహ్మశ్రీ కొక్కొండ వారికి నిరాశ కలిగించడమేకాక, వ్యతిరేకంగా స్త్రీ పునర్వివాహ సంస్కారం కోసం తమ జీవితాన్ని ముడుపు కట్టినట్లుగా ప్రవర్తించసాగారు. – మొదట మొదట, నేను

దుర్బలుణ్ణి. అంగబలమూ, అర్థబలమూ లేనివాణ్ణి. నా వల్ల యింత మహత్తర కార్యం ఏమవుతుంది? అని ఉదాసీనత వహించినా తరువాత తరువాత, మిత్రబృందమూ సంస్కరణాభిలాషా ఆయన్ని ఉత్తేజితుణ్ణి చేయగలిగాయి. ఈ మిత్రుల్లో ముఖ్యులు శ్రీ న్యాపతి సుబ్బారావు పంతులుగారూ. చల్లపల్లి బాపయ్య పంతులుగారూను, ముప్పైవేల రూపాయలు దానంగా అర్పించి, అర్థబలం చేకూర్చిన ఉదారులు శ్రీ బారు రాజారావు పంతులుగారూ. పైడా రామకృష్ణయ్యగారూ, వీరికితోడు శ్రీ కంచి కృష్ణస్వామి, ఆత్మూరి లక్ష్మీనరసింహం. సోమంచి భీమశంకరం మొదలైనవారి సహాయసహకారాలు పంతులుగారికీ మహాకార్య నిర్వహణలో ఎప్పుడూ ఉండేవి. ఇంత బలగం వెంట ఉండి ఉత్సాహపరచడం వల్లనే ఆయన తన జీవితంలో అరవైకిపైగా వితంతు వివాహాల్ని నిర్విఘ్నంగా కొనసాగించ గలిగారు. వివాహాలు నిర్వహించడానికి మొదటి మెట్టుగా ఈయన సభలు చేసేవారు. ఆ సభల్లో పునర్వివాహ విషయమై రెండుపక్షాల వారికీ వాద ప్రతివాదాలు జరిగేవి. పంతులుగారు తన ఉపన్యాసం ముగించీ ముగించకముందే, ఆబోతుమీదికి కుప్పించి ఎగసే పెద్దపులుల గుంపులా పండితులంతా వాదనకు పూనుకునేవారు. కాని ఏ సభలోనూ చర్చితాంశం ఒకరిద్దరికి చేరేదికాదు. వాదప్రతివాదాలు, సారాంశమూ ఎలా ఉన్నా, విషయం సంప్రదాయ విరుద్ధమైనదీ కుతూహలాన్ని రేకెత్తించేదీ అవడం వల్ల ఊళ్ళో ఏ యింట్లో ఏ మూల చూచినా అదే చర్చకు ఆస్పదమైపోతూ ఉండేది. కేవలం కుతూహలంతోనో, ఏం జరుగుతుందో అనే భయ విస్మయాలతోనో, ఎలా జరుగుతుందో చూద్దాం అనే క్రోధావేశంతోనో మొత్తానికి అందరూ ఈ విషయాన్నే మననం చేస్తూ ఉండేవాళ్ళు – ఈ సభలమూలంగా పంతులుగారు మొట్టమొదట, ఊరుఊరంతటికీ చైతన్య కలిగించి ప్రజల మనస్సుల్లో 'విధవా వివాహం' అనే మాట విన్నప్పుడు ఇదివరకు కలిగే కాఠిన్యాన్ని తొలగించి దాని స్థానంలో సానుభూతినీ జిజ్ఞాసనూ ప్రవేశపెట్టగలిగారు. ఇది స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశలో మొదటి ఘట్టంకాగా, వివాహ నిర్వహణం రెండవ ఘట్టం అయింది. ఇదే పంతులుగారి జీవితానికే సాఫల్యాన్ని కలిగించి, ఆశయ సిద్ధి చేకూర్చింది. 1881లో ఈయన రాజమహేంద్రవరంలో మొదటి వివాహాన్ని నిర్విఘ్నంగా నిర్వహించగలిగారు. కాని దీనికిముందు ఎంతో ప్రయత్నం జరిగింది. ప్రతిపక్షులు దీన్ని ఆపడానికి శాయశక్తులా ప్రయత్నించక మానలేదు. దొమ్ములు, తన్నబోవడాలు, దూషణ తిరస్కారాలు, ఆంక్షలు – వంటి వాటి నెన్నిటినో పంతులుగారు ఎదుర్కోవలసి వచ్చింది. అంతవరకూ కలిసికట్టుగా పనిచేసిన మిత్రులు పెద్దల నిర్బంధం చేతా, ఒత్తిళ్ళవల్లా పెళ్ళికి హాజరు కాలేపోయారు. ఆ పెళ్ళికి వంట బ్రాహ్మణులు దొరక్కపోవడం, తాంబూలాలు అందుకోవడానికి ఎవరూ రాకపోవడం, చివరకు పెళ్ళి జరుగుతూ ఉండగా ఆ వీధిన నడచిన వాళ్ళకు కూడా ఆంక్షలు విధింపబడడం జరిగింది. అయినా పంతులుగారు ధీరులు. ధీరచిత్తులు మేరుపు మీద పడినా చలించరు. చేపట్టిన కార్యం తుదిముట్టందే వదలరు. అవ్యాహతంగా, ఆచంచల కార్యదీక్షతో ఆయన సాగించిన అరవై వివాహాలలో ఆరవ వివాహం మా కుటుంబానికి సంబంధించినదే. పిఠాపురం సంస్థానానికి రెండో దివానుగా ఉన్న కోకావెంకట సుబ్బారావుగారు వరుడు. ఆయన వితంతు వివాహం చేసుకున్ననాడు ఎంత ప్రతిఘటనా విముఖతా ఉండేవో మాకు తెలియకపోయినా దాని ప్రభావం తరువాతి తరంపైన కూడా ఎంత తీవ్రంగా ఉండేదో చెప్పడానికి ఓ చిన్న సంఘటన నిక్కడ చెప్తే అది అప్రస్తుతం కాబోదు. సుబ్బారావుగారికి ఈ వివాహం వల్ల కలిగిన కొడుక్కి మా పెద్దమ్మ కూతుర్ని ఇచ్చి బ్రహ్మ పద్ధతిలో వివాహం జరిపించారు. ఆ పెళ్ళికి హాజరు కాబోయే బంధువుల్ని బందరు రైలు స్టేషను దగ్గరే సంప్రదాయపరులు ఎదుర్కొని బ్రతిమాలి భంగపడి వెనక్కి తిప్పి పంపగలిగారట. మరీ మొండికెత్తి వెళ్ళిన మాలాటి వాళ్ళను మా మా ఊళ్ళల్లో కుల పెద్దలు వెలివేశారు. మమ్మల్ని వెలివేయడానికి మరో ముఖ్య కారణం, మా అమ్మ పెళ్ళి కూతురు తల్లికి సాక్షాత్తూ అప్పజెల్లెలు కావడం.

ఈ రకపు ప్రతిఘటననూ, కష్టాన్నీ అధిగమించి చురుకుగా వితంతువివాహాలు నడిపిన పంతులుగారు తెలుగు స్త్రీ లోకానికి ఎన్నిటికీ మరిచిపోలేనివారు. వారి జీవితం వల్ల సంఘ సంస్కరణోద్యమమే సఫలత చెందింది. ఈ సాఫల్యం పంతులుగారి జీవితంలో ఒక భాగం మాత్రమే.

మరోభాగం ఈయన సాహిత్య ప్రపంచంలో సాధించిన విప్లవాత్మకమైన మార్పు. ఈయన జీవితంలో గ్రంథకర్తృ దశ 1870 నుండి 1900 వరకూ సాగింది. స్త్రీ పునర్వివాహ సంస్కార ప్రయాసదశ 1880 నుండి 1890 వరకూ సాగింది.

అంటే యీ రెండు మహాకార్యాలూ, ఈయన జీవితంలో ఒకేకాలంలో సమాన ప్రాతినిధ్యం వహించాయనే చెప్పాలి. అందువల్లనే యీయన సృష్టించిన సాహిత్యంలో కేవలం ఊహలూ, గాలిమేడలూ, స్వప్న సౌధాలూ, స్వర్గ సౌఖ్యాలూ కాక జీవితంలో సంఘ సంస్కరణకోసమై ఈయన తిన్న ఢక్కా మొక్కీలూ, ఎదుర్కొన్న అడ్డంకులూ, యుద్ధం చేసిన శత్రువులూ కనిపించడం సంభవించింది. లలితకళల్లో మేటి అయిన సాహిత్యాన్ని హృదయానందకారకమైన ఉపాధి అని యీ యన చేపట్టినట్లు కనిపించదు. అది బలవంతమైన ఉపకరణమనీ, దానిచేత తాను తలపెట్టిన సంఘ సంస్కరణ మహా ప్రయత్నానికి రూపులు దిద్దవచ్చుననీ గ్రహించినట్లుగా తోస్తుంది. అందువల్లనే పంతులుగారి సాహిత్యంలో, సంఘంలోని మూఢాభిప్రాయాలను దుయ్యబడుతున్న పంతులుగారు, ప్రతిపక్షుల్ని తమ సునిశిత హాస్యవాక్కులతో నిగూఢంగా నొప్పిస్తున్న పంతులుగారు, దురాచారాలను సమూలంగా నాశనం చేయడానికి ఘళిపిస్తున్న పంతులుగారు, ఎటుచూచినా, సహస్ర ముఖాలుగా విజృంభిస్తూ కనిపిస్తారు. – సంఘంతోనూ, సంస్కరణతోనూ ప్రమేయంలేని యితివృత్తాలుకల వారి యితర రచనలు చూచినా, వాటిల్లోకూడా, ఏదో విప్లవాత్మకధోరణీ, ఆశయమూ కనిపించక తప్పదు. మన సాహిత్యానికి అంతవరకూ అనువాద నాటకాలు లేవుకదా అని, సంస్కృతాంగ్ల నాటకాలు అనువదించినట్లు కనిపిస్తుంది. నవలలు లేవుకదా అని రాజశేఖర చరిత్ర వ్రాశారు. చిన్నయసూరి పంచతంత్రాన్ని పూర్తిగా పరివర్తించకపోవడంచేత, విగ్రహాన్నీ, సంధినీ రచించారు. జీవిత చరిత్ర వ్రాసి, ఆ శాఖకు తామే ప్రారంభకులై ముందువాళ్ళకు మార్గదర్శకులయ్యారు. ఎన్నో సాంఘిక సారస్వత విషయాలమీద ఉపన్యాసరూపంలో, సభల్లో ప్రసంగించిన వాటిని వ్యాసరూపంలో అమర్చి ఆ శాఖకు బీజం నాటారు. పైకి నవ్వు తెప్పిస్తూ, లోలోపల గ్రుడ్లనీరును గ్రుడ్ల కుక్కించే నిశిత హాస్యాన్ని ప్రహసన రూపంలో వెలయించారు – అంతగా వచనమే వ్రాస్తూ ఉంటే, ఛందోలంకార సహితంగా, చక్రబంధ ఖడ్గబంధ పూర్వోకంగా సాహిత్యంలో సర్కసుచేసే పండితులకు చులకన కాగల ప్రమాదమున్నదని, వాళ్ళకు కూడా భయ గౌరవాలు కలిగేటట్లు శుద్ధాంధ్ర నిరోష్ఠ్య నిర్వచన నైషధాన్నీ, శుద్ధాంధ్ర భారత, ఉత్తర రామాయణాలనూ రచించారు. అంతేకాక శాస్త్ర విభాగంలో కృషిచేసి, వృక్షశాస్త్రాన్నీ, వ్యాకరణాన్నీ, ఆరోగ్యవిధుల్నీ, నీతిసారాన్నీ జనులకు తెలిసేటట్లుగా సులభపద్ధతిలో అందించడానికి సర్వప్రయత్నాలూ చేశారు.

లోకంలో బహు రచనా వ్యాసంగం కలవారి కృతులు అన్నీ చిరస్థాయిగా నిలిచిపోవడం అరుదు. కాని పంతులు గారి అభిజ్ఞాన శాకుంతల అనువాదం పాశ్చాత్య ప్రశంసల్ని అందుకుంది. అది యింతవరకూ వచ్చిన అనువాదాల్లో మేలిపూస. ఈయన జీవిత చరిత్ర జీవిత చరిత్ర రచనకే రాచబాటలు వేసిన ప్రక్రియ. 'విగ్రహమం', చిన్నయసూరి మిత్రలాభ, మిత్రభేధాలలో కలిసిపోయినట్లుగా అమరగలిగింది. – ఇక వీరి ప్రహసనాలకు అవే సాటి.

ఈయన జీవితంలో అటు సంఘ సంస్కరణా, ఇటు సాహిత్య సంస్కరణా దేనికదే, సమాన ప్రాతినిధ్యాన్ని వహించినట్లుగా కనపడుతుంది. అందుకే సంఘ సంస్కర్త వీరేశలింగం, రచయితగా వీరేశలింగాన్ని జ్ఞాపకం రానీయదు. అలాగే సాహిత్య కారుడు వీరేశలింగం సంఘసంస్కారిని గూర్చి ఆలోచించ నీయదు.

శ్రీ పంతులుగారు పూర్ణపురుషులు, కారణజన్ములు. తాము జీవించిన డెబ్బై ఒక్క సంవత్సరాలలో ఇంచుమించు ప్రతిక్షణమూ ఆశయ నిర్వహణకోసం నిర్విరామంగా, విశ్రాంతిరహితంగా, బహుముఖంగా ఎలా పనిచేయాలో, మనకు నేర్పడానికే పూనుకున్నాడు. నిర్ణీతకాలంలో, జీతం తీసుకుని, ఆఫీసుల్లో పనిచేయడానికి అసురుసురై తదుపరి ఏమిచేయడానికీ త్రాణ మిగలని యీ యాంత్రికయుగం మనుష్యులం. మనకు ఈ ఎరుక విస్మయాన్నే కాక భయగౌరవాలను కూడా కలిగిస్తుంది. ఇటువంటి జీవితచరిత్రలు ముందు తరాల ప్రజలకు ఆదర్శాలుగానూ, అవశ్య పఠనీయాలుగానూ ఉంటాయి. ఆ కాలంలో జీవించి, అస్థితిగతుల్ని ప్రత్యక్షంగా అనుభవించలేని జనులకు, ఆ చరిత్ర పఠనంతోనే కొంత తృప్తి.

కాని యెందువల్లనో తెలుగు సాహిత్యంలో ఈ జీవిత రచనాశాఖ అంతగా విస్తరిల్లడం లేదు. దీనికి కారణం నలుగురుకీ తెలియజేసేంత గొప్ప చరిత్ర తెలుగు వాడికి లేదనేకంటే, అతగాడిలో నరనరాన జీర్ణించుకుపోయిన అకర్తృత్వ బుద్ధీ, ఆత్మ చరిత్ర చెప్పుకోలేని ఉదాసీనతా కారణాలు అయి ఉండవచ్చును. ♦

## పురస్కారాలు

# సాహిత్య ప్రస్థానం ఫిబ్రవరి 2019 పురస్కారాలు

**ఏనుగు అంబారీ**
కథకు: రూ.700/-
రచయిత: వనజ తాతినేని

**పెళ్ళి మంత్రాల్లో సమాజ దర్శనం**
వ్యాసం: రూ.500/-
రచయిత: సింహాద్రి నాగశిరీష

**నానీల సేద్యం**
కవితకు : రూ .500/-
రచయిత : సుమనశ్రీ

■■■

*కథ, కవితకు సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కారం, వ్యాసానికి కర్లపాలెం రుక్మిణమ్మ పురస్కారం చెక్కులు ఈ రచయితలకు అందుతాయి*

■■■

పాఠకులు తాము చదివిన కవితలు, కథలు, వ్యాసాలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. సీనియర్, ప్రసిద్ధ రచయితల రచనలు కాక ఔత్సాహికులను, ఇటీవల రాస్తున్నవారిని ప్రోత్సహించడమే ఈ పురస్కారాల ఉద్దేశ్యంగా గ్రహించగలరు. తగిన రచనలు లేనప్పుడు పురస్కారాలు ప్రకటించబడవు.

- ఎడిటర్

---

**కవిత**

## ప్రగతి కోసం

- ఆడిగోపుల వెంకటరత్నమ్
9848252946



ఏడ్పులు ఎన్ని రకాలైనా
అన్నీ కార్చేది అశ్రువులే
నదుల్ని జీవనదులు చేసిన
అశ్రువులు
చెలరేగిన వరదలు !

సమతకు మమతకు
సమ సమాజ నిర్మాణానికి
కవి మహాపథికుడు
రచనతో పాటు ప్రజ్ఞ
టోకుగా చిల్లరగా అంకితాలు !

సముద్రాన్ని కవి దోసిట్లో నిలగట్టాలి
ఏవి ఎప్పుడు పుట్టాయో
ఏవి ఎప్పుడు మరణించాయో
పారదర్శకమై పూసగుచ్చుతాయి
అలల విసిరే పంజాలు
చెలియలికట్ట నెరపేనెయ్యం తెలుస్తుంది

గాలిని కవి పిడికిట్లో బంధించాలి
గాలి చొరబడని చోట అన్వేషించాలి
శ్వాసించలేని బడుగుల్ని వెతకాలి
స్వేదజలం పారే శరీరాల్ని గుర్తించాలి
అంచెలంచెలుగా గాలిని పంచి
నిశ్శబ్దాన్ని శబ్దం చేస్తూ
గాలిని మాట్లాడించాలి!

అగ్నిని కవి అరచేతిలో ఆవిష్కరించాలి
ఎక్కడ రాజెయ్యని పొయ్యివుందో
ఎక్కడ అశక్తులు పొర్లాడుతున్నాయో
ఎక్కడ తమస్సు ఘనీభవించిందో
అక్కడ రగిలించాలి!

కవి నిశ్శబ్దానికి జీవితేశుడు
శబ్దానికి జనకుడు!

ఆకాశానికి సార్వభౌమత్వం
అయినా
పక్షిని ఎగరకుండా నిషేధించలేదు
చంద్రుడు నింగికి సామ్రాట్టు
నక్షత్రాల వెలుగుల్ని నిరోధించలేదు
పగలూ రాత్రీ కవి
తూర్పుకు ప్రయాణించే పథికుడు!

రెండున్నర పర్వాలు తెనిగించిన
నన్నయభారతం అసంపూర్ణమైతే
అర్ధపర్వంతో ఎర్రాప్రెగడ
పదిహేను పర్వాల్తో తిక్కన
మహా పథికులయ్యారు!

◆




# కవితా సప్తమి
# ఈ ఏడవ రుతువు

*"అప్పుడు నాలో నేను అక్షరమై ప్రవహిస్తాను/ కాగితం నిండా అక్షరాలు/ కావ్య నక్షత్రాలై కురుస్తాయి/ కావ్యాన్ని రచించింది నేననుకుంటావు కానీ/ ... / కావ్యకర్తవు నీవైతే/ ప్రాణం ప్రణవం అక్షరాలదే"*

జీవితాన్ని అక్షరాలలోకి అనువదించగలిగినప్పుడు సజీవమైన సాహిత్యంగా మారుతుంది. అక్షరాలా అక్షరాల్లోకి మలచడం గురించే వైష్ణవిశ్రీ ఇక్కడ చెబుతున్నది. అరుంధతీ రాయ్ ఒకచోట అంటారు. రచయితలు తాము ఇతివృత్తాలు ఎంచుకున్నామనుకుంటారు గాని నిజానికి ఆ అంశమే రచయితలను ఎంచుకుంటుంది అని. రాయడం కోసం రాసేవాళ్లు ఒకరకమైతే రాయకుండా వుండలేనితనంతో రచించే వాళ్లు వేరు. వారు జీవితంలోంచి మనసు లోతుల్లోంచి . ఆనంద విషాద భరితమైన అనుభవపు పొరల్లోంచి ఆవేదనాగర్భం లోంచి రాస్తారు. వైష్ణవిశ్రీ ఈ కోవకు చెందిన కవయిత్రి అని ఇందులోని చాలా కవితలు మనకు చాటిచెబుతాయి. వాటన్నిటా కవయిత్రి ముద్ర గోచరిస్తుంది. జీవితపు ఘర్షణలో సామాజిక వేదనలో నలిగిన మనసు రాతలు అక్షరాలై సాక్షాత్కరిస్తాయి. ఏ కవితనూ తేలిగ్గా తీసేయలేం. తిప్పేయలేం.

*"జీవితమంటే ../ జ్ఞాపకాల గాళ్ల సందుల్లోంచి నడిచే/ అనుభూతుల నడక/ ఎర్రగా విచ్చిన మందారపు గాయాల మధ్య/ నలిగే క్షణం/ జీవితమంటే/ నిర్వేద నైరాశ్యాల మధ్యనో గెలుపు/ హర్షాతిరేకాల మధ్యలో ఆదే వూగిసలాట/ పొత్తిళ్ల నుంచి మృత్యుకుహరం దాకా/ బతుకు నీదే మెలోడ్రామా"*

జీవితం గురించి ఇప్పటికే వున్న నిర్వచనాలకు ఇవన్నీ చేర్చుకోకుండా వుండలేం.

*"కొన్ని జీవితాలంతే/ చిగురించనూ లేవు/ మరణించనూ లేవు/ గెలవనూ లేవు/ ఓడిపోనూ లేవు/ శూన్యానికి మిథ్యకూ మధ్య / జీవచ్ఛవంలా వేళ్లాడుతుంటాయి"*

శూన్యం, మిథ్య రెండు పదాలు ఒక్కలా కనిపించినా ఒక్కటి కావు. ఒకటి ఏమీ లేకపోవడం. రెండోది ఏదో వుందని భ్రమపడటం. దీని ఫలితం ఏమిటి?

*"నడకలు నిద్రపోతాయి/ కలతలు విడవనంటాయి/ స్వప్నాలు నడవనంటాయి/ వూహలు జనించనంటాయి"*

ఈ సంపుటిలోని చాలా కవితల్లో ఇలాటి బలమైన వేదన దర్శనమిస్తుంటే కవయిత్రి భావ సాంద్రత తెలుస్తుంటుంది.

*"ఒంటరిపక్షిలా/ గతమొక గాయమై/ రాకాసి నీడల ఆక్రమణ/ వదిలించుకోలేని/ శిశిరం జీవితాన్ని ఆహ్వానించిన ప్రతిసారీ/ వేదన చర్విత చరణం"*

గాయపడిన కవి గుండెల్లో రాయబడని కావ్యాలెన్నో అని దాశరథి అన్నారు గాని ఈమె రాసిన మేరకు చూస్తేనే గుండె బరువెక్కుతుంది. నిస్సందేహంగా అన్నిటికన్నా పురుషాహంకారం ఆధిక్యతను ఆక్షేపించే కవితలు చాలా చూస్తాం. ఆవేదన ఆగ్రహాక్షర రూపం దాల్చడం గమనిస్తాం.

*"నమ్మకాన్ని చివరి అంకం వరకూ నరుక్కుంటూ వచ్చావు/ ఇక మిగిలింది చిగురు వేయలేని/ మోడని తెలియక కాదులే/ ఈ మోడును కూడా మట్టిగరిపించగల/ మొగత్వం నీది"*

మృగాళ్లు అన్న పదం ఇప్పుడు ఎక్కువగా వాడుతున్నారు గాని మొగత్వం అనడంలో అంతకంటే ఎక్కువ నిరసన గోచరిస్తుంది. సహజత్వమూ వుంది. దాని వల్ల ఆ మొగత్వం కూడా పాముకునేదేముంది?నవమాసాలే కాదు, నా బిడ్డనెప్పుడూ గర్భాన మోస్తా అనడంలో హక్కుల సింహానాదం వుంది. ఇదే మాతృస్ఫూర్తి తననూ నడిపించినట్టు చక్కగా చెప్పారామె

*"అమ్మచేతి గాజుల అలికిడితో తడిసిన/ ఆప్యాయతల నక్షత్రాల వాన/ ఇప్పటికీ కురుస్తూనే వుంది నా మనసు తోటంతా!"* అందుకే ఆమె అమ్మపైన అమ్మతనం పైన చాలా కవిత్వమల్లారు.

"రాయలేని గేయాలకు రాచపుండువై గుండెను రగుల్చుతూనే వుంటావు/ ఎండుటాకులో కలసి పొమ్మంటావు /నిలువుటద్దాన్ని పగలగొట్టి నేను బాగున్నానా/అంటే ఏం సమాధానమిస్తుంది/ఎప్పటికీ అతుక్కోలేని ఈ ముక్కల పోగు?"ఇంతకంటే సున్నితంగా స్త్రీ హృదయాన్ని ఆవిష్కరించిన చరణాలున్నాయి

*"తలలో తురుముకుంటానికి సరే /ఆప్యాయంగా నా తలనెప్పుడైనా నిమిరావా/ కంటి చివర తడిని స్పృశించావా"* అని అడగాలనిపించింది ఆమెకు! అతనూ ఆమె ఏమో గాని మనకు కంటతడి వచ్చేస్తుంది.

ఈ కవిత్వం మొత్తం అక్కడే ఆగిపోలేదు. ఇంతటి ఆవేదన పక్కనే అపారమైన విశ్వాసం చిగురిస్తుంది. త్రివేణీ సంగమంలో కొంతదూరం నదులు, సముద్రాలు వేర్వేరుగా కనిపించినట్టు వైష్ణవిశ్రీలోని ఈ మూడు నాలుగు పాయలు మనకు గోచరిస్తాయి. వైయక్తిక వేదనలా ధ్వనించే ఇలాటి కవితలతో పాటు ఆమె మహిళల మనోస్థితిని మనుగడను గురించి మరెన్నో రాశారు. గర్భస్థ శిశు హత్యలు, పేద కుటుంబాల వేదనలు, వ్యభిచార కూపాల్లో శాపగ్రస్త జీవితాలు, అమ్మానాన్నల ఆరాటలు అవి తెలియని శిశువుల కేరింతలు ఒకటేమిటి సామాజిక కౌటుంబిక జీవితం మానవీయ స్పర్శ దర్శింపచేశారు. మరో వైపున మనోహర స్నేహ మధురిమలూ ప్రేమ ప్రేరణలూ అక్షరీకరించారు. ఆ మేరకు చాలా కవితల్లో అతను అగుపిస్తుంటాడు.

*వీటితో పాటే కొన్ని తాత్విక తరగలు... 'చప్పుడు చేయని మరణం/ చెప్పి రాదు/ రాకుండా వుండదన్నది నిజం/ ఏడ్చేవాళ్లు ఎందరుంటేనేం/ బతికిన క్షణాల్లో పలకరించని నిజాలు"* మానవ సంబంధాల ఒడుదుడుకులతోనే ఆగక శ్రమైక జీవనాన్ని ఆవిష్కరించారు చాలా చోట్ల.

*"సముద్రంలో వేటకెళ్లాక/ తిరిగొస్తరో లేదో ఎరకలేదు/ సునామిలొస్తే హెచ్చరికలు జారీ చేయడం తప్ప/ తమ జీవితాలకో పచ్చజెండా వూపే/ నాయకుడే లేడు/ గడియారంలో ముల్లులా పడవతో పరిగెడుతూ/ చేపలు పడితే చాలు/ ఆలు బిడ్డల కడుపు నిండినంత సంబరం"*

మట్టి వీరుడు కవితలో రైతులను గురించి – *"ఆకలంతా*
*ఎ ో ే గ స ి*
*ఆకుమళ్లుపోసి/ మడిమడిని తన చెమట చుక్కతో తడిపి/ ఏపుగా పెరిగేదాక రెక్కలు ముక్కలు చేసుకుని/ కంటి చూపును కంచెగా వేసి కాపు కాస్తాడు/ గింజ పుట్టేదాకా గుండెను/ పంట పొలానికి కట్టేసుకుంటాడు/ ఎందరి కడుపునో నింపిన తనకు/ చిత్రంగా ఆకలే బహుమతిగా మిగులుతుంది/ పెట్టుబడిని దిగుబడిని గణించి చూస్తే/ అప్పు ఒక్కటే శేషమై వెక్కిరిస్తుంది."*

ప్రక్షాళన కవిత ప్రారంభంలోనే *"ఇప్పుడు గుడీ బడీ అన్నిటా అకృత్యాలే/ అన్నింటా దేగ చూపులు/ నలుదిక్కులా కామదాడుల నైవేద్యాలతో హాహాకారాలు/ నైతిక విలువలకు తిలోదకాలిచ్చే/ నేపథ్య జీవన దృశ్యాలు"*

చాలా చోట్ల వైష్ణవి యువతను దారి తప్పిస్తున్న ఇప్పటి కాలుష్య సంస్కృతిని సూటిగా హత్తుకుపోయేలా రాశారు. ప్రపంచీకరణ దుష్ఫలితాలు అవినీతి ఆధిపత్యాల విలయ తాండవం వంటి అంశాలపైనా రాశారు. విశాఖనూ అక్కడి సముద్రాన్ని ప్రత్యేకంగా ప్రేమించే కవయిత్రి పర్యావరణ విధ్వంసాన్ని కళ్లకు కట్టే కవితలు రాశారు

*"వచ్చునోట్లకు ఆశపడి/ వచ్చుదనాన్ని నమిలిమింగుతున్నావుగా/ గుండెలు మండుతున్నాయి/ ఎండలూ మండుతున్నాయి/ కాలాలు మండుతాయి/ ఆరు రుతువులూ/ ఏకకాలంలో ఒకే రాగాన్ని వినిపిస్తాయి/ మండే కాలమంటూ!"*

గ్లోబల్ వార్మింగ్‌కు కవితా చిత్రణ ఇది. ఈ పర్యావరణ కాలుష్యాన్ని మించిన సామాజిక కాలుష్యం

*"మేకతోలు కప్పుకున్న మొహాల వెనక/ అహాల కుంపటి/ కులాల మేళ తాళాలతో/ ఉక్కిరి బిక్కిరవుతున్న మానవత్వం/ ఊకదంపుడు వుపన్యాసాల హోరులో/ ఊడిపడుతున్న నిరుద్యోగం/ నిజానికి నిప్పంటిస్తూ/ నింగికెగిసే అవినీతి ...*

## కవిత

# నేనే...పంజరం!

- భండారు విజయ
8801910908



అనంత కాలగమనంలో
ప్రతి రోజూ..నేను
తెల్సీ తెలియకుండానో
అన్యమనస్కంగానో
నిరంతరంగా...నన్ను నేను
ఇరువై నాలుగు గంటలతో
జార విడిచేసుకుంటాను

కుక్క పిల్లలా
నా వెనువెంట
అతినమ్మకంగా
నడచిన జ్ఞాపకం ఒకటి
ఏదో ఒక క్షణాన
కన్నీటి చుక్కై రాలి
భళ్ళున పగిలిపోయి
గాలిలో ఇంకిపోతూ వుంటుంది

నమ్మకం ఉన్నప్పుడే కదా
మోసగించబడేది
మాటలెన్ని మీరినా
మనోవ్యధలెన్ని రగిలినా
పొరపాట్లన్నీ..మన్నించుకొని
చిరునామా లేని నిన్ను
ప్రేమానుబంధాల లోగిలి
పరచి జల్లించుకుంటాను
జారి పడిపోయిన నిన్నను
ప్రశ్నల తుంపర వెంటాడి
కౌగిలించుకుంటున్నప్పుడు
జవాబులు రెక్కలువుతూ
కదిలిపోవటం చూసి
నన్ను నేను కప్పుకుంటూ
రేపటి కలుగులోకి
ఒదిగిపోతూ వుంటాను

జీవితం చిన్నదే
ఆశలవలయాలే పెద్దవి
జిగేలుమంటూ
మనిషితనం మౌనం
పరుచుకున్నప్పుడల్లా....
నన్ను పంజరంలో చుట్టి
రెక్కలచప్పుడు వినబడకుండా
దాచేసుకుంటాను

అక్కడెక్కడో..గాలి
దుమారం రేగినప్పుడు
మనసును ఒలిచేసి
చీకటి వస్త్రాన్ని దులిపేస్తూ
వెలుతురు స్నేహాన్ని
ఆహ్వానిస్తాను...
నన్ను నేను వెదుక్కుంటాను

కాలమా!
నువ్వు నాకొక జ్ఞాపకానివి
విరిచేసుకున్న విలాపానివి
మిగుల్చు కున్న ధరహాసానివి ◆

---

మన స్వతంత్రం మేడిపండు అన్నట్టు దీని నిజరూపాన్ని చాలా చోట్ల కళ్లకు కట్టారు. దేశాన్ని అతలాకుతలం చేసిన నోట్ల రద్దుపై మంచి కవిత – ***"దొంగను పట్టడానికి/ సామాన్యులను ఎరవేసినట్టుంది/ చెల్లని నోటు హల్‌చల్ చూస్తుంటే"***

కనుక కవయిత్రి కేవలం ఆవేదనకు పరిమితం కాలేదు. అనుభూతుల్లో మునిగిపోలేదు. ఆచరణనూ ఆశయాల ప్రస్థానాన్ని ఆహ్వానిస్తోంది. నిరాశకు విరుగుడు నిజమైన సమరమేనని చాటి చెబుతున్నది. పోరాటంలో ముళ్ళూరాళ్లూ వున్నా ఆశయమే నడిపిస్తుంది మరి. దేశాన్ని ఉత్తేజపర్చిన ముంబాయి కిసాన్ మార్చ్‌పై కవిత ఇందుకో మచ్చు తునక – ***"ఆశయం ఎర్రబడినప్పుడు/ వేసిన ప్రతి అడుగూ పూలబాటవుతుంది/ ముళ్లన్నీ పువ్వులై పలకరిస్తాయి/ ఎర్రతివాచి పర్చుకున్న ముంబాయి నగరమంతా/ మట్టి గుప్పెట్లో తలవాల్చింది/ లాల్ సలామంటూ..."*** ఆశయాల వైపు నడకే అమృత సోపానం అన్న మెళకువతో రాసిన కవితలు ఇందులో మూడో వంతు వరకూ వున్నాయి

ఇలాటిదే మరో భావన ***"జీవితమంటే రంగు కాగితంతో/ రగిలించుకున్న అహాల బూడిద కాదు/ మానవత్వపు కాగడాతో/ మరో మనిషినైనా వెలిగించాల్సింది"*** అలా వెలిగించాలన్న తపనే ఈమెతో ఇన్ని మంచి కవితలు పలికించిందనుకోవాలి.

***"సర్వం తానై సకలం తానై/ సత్యం తానై న్యాయం తానై/ వికలమైన మనసులన్నిటినీ ఒకటిగా/ గర్జింపచేయమని నన్ను శాసిస్తోంది"***

ఆ శాసనాన్ని పాటించి మరిన్ని ఉత్తేజ దాయకమైన కవితలు వైష్ణవిశ్రీ నుంచి రావాలని ఆశిద్దాం. విశాఖ పట్టణంలో సాహితీ సభలతో సాహితీస్రవంతికి చేరువై తర్వాత ప్రజాశక్తిలో చేరిన వైష్ణవి జీవిత గమనం ఆమె నిరంతరకవనంలో ప్రతిబింబించడం ఈ సంకల్పాన్ని సఫలం చేసే దోహదకారి అవుతుందనడం నిస్సందేహం. ఈ కవయిత్రికిదే నా అభినందనలు.

*(ఏడవ రుతువు కవితా సంపుటికి తెలకపల్లి రవి గారు రాసిన ముందుమాట)* ◆

# ద్వా.నా. శాస్త్రి ఇకలేరు!



ప్రముఖ రచయిత, సాహిత్య విమర్శకులు ద్వా.నా.శాస్త్రిగా ప్రసిద్ధి కెక్కిన ద్వాదసి నాగేశ్వర శాస్త్రి(72) ఫిబ్రవరి 26న హైదరాబాద్‌లో కన్ను మూశారు. ఆయనకు భార్య, కుమారుడు, కుమార్తె ఉన్నారు. తల్లి లక్ష్మీప్రసన్న. తండ్రి కృష్ణశాస్త్రి. కృష్ణాజిల్లా లింగాల గ్రామంలో 1948 జూన్ 15న జన్మించిన శాస్త్రి ఏలూరు సిఆర్‌రెడ్డి కళాశాలలో బిఎస్సీ, ఆంధ్రవిశ్వవిద్యాలయంలో ఎంఎ (తెలుగు) ఉత్తీర్ణులై, నాగర్జున విశ్వవిద్యాలయం నుంచి ఎంఫిల్, తెలుగు విశ్వవిద్యాలయంలో డాక్టరేట్ పొందారు. 1972 నుంచి 2004 వరకు అమలాపురంలో కొనసీమ భానోజీ కామర్స్ కళాశాలలో తెలుగు శాఖలో రీడర్‌గా పనిచేసి పదవీ విరమణ పొందారు. అనంతరం హైదరాబాద్ స్థిర నివాసం ఏర్పరుచుకున్నారు. సివిల్ సర్వీస్, గ్రూప్ 1, గ్రూప్ 2, జూనియర్ లెక్చరర్లు, తెలుగు పండిట్ ఉద్యోగులకు తెలుగు భాష, సాహిత్యాలలో శిక్షణ ఇస్తూ వచ్చారు. ద్వానాశాస్త్రి రాసిన తెలుగు సాహిత్య చరిత్ర పలు ముద్రణలు పొందింది. వచన కవిత్వం, వ్యాసాలు, కవితలు, హాస్య రచనలు తదితర ప్రక్రియలో ఆయన సిద్ధహస్తుడు. సమాధిలో స్వగతాలు వచన కవితా సంపుటి, ద్వాదశి వ్యాస సంకలనం, మన తెలుగు తెలుసుకుందాం, అక్షర చిత్రాలు వంటి పలు పుస్తకాలు వెలువరించారు. పన్నెండు గంటలపాటు తెలుగు భాషా సాహిత్యాలపై ప్రసంగించి ప్రపంచ రికార్డు, శతక సాహిత్యంలో వ్యక్తిత్వ వికాసం అంశంపై 188 నిమిషాల ప్రసంగం, పలకరిస్తే ప్రసంగం పేరుతో నిర్విరామ ప్రసంగం వంటి విశిష్ట ప్రయోగాలతో ద్వానా శాస్త్రి పేరుగడించారు. ద్వానాశాస్త్రి అక్షర శ్రామికుడు-మానవ ప్రేమికుడని సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి కొనియాడారు. సాహితీ లోకానికి ఆయన లేని లోటు భర్తీ చేయలేనిదని పేర్కొన్నారు. ◆



*హైదరాబాద్‌లో నివాళి అర్పిస్తున్న సాహిత్య ప్రస్థానం ప్రధాన సంపాదకులు తెలకపల్లి రవి, సాహిత్య కిరణం సంపాదకులు పొత్తూరి సుబ్బారావు, నవ తెలంగాణ పబ్లిషర్స్ జనరల్ మేనేజర్ కోయ చంద్రమోహన్, ప్రముఖ కవి జూలూరి గౌరీశంకర్ తదితరులు*

---

## ప్రజాస్వామ్యమా వర్ధిల్లు!



**- వి. సూర్యారావు**
**9246911234**

*ఈ నేల ఏమై పోతేనేం*
*గుండెలు బీటలు బారితేనేం*
*మనకెందుకు -*

*రైతు ఏమై పోతేనేం*
*కులవృత్తుల బతుకు ఏమైపోతేనేం*
*మనకెందుకు -*

*దోపిడీ దొరతనం ప్రబలితేనేం*
*దుర్నీతి దుష్టశక్తిగా ఎదిగితేనేం*
*మనకెందుకు -*

*అవినీతి వేయితలల పామైతేనేం*
*కాయం కష్టం కన్నీళ్ళు మిగిల్చితేనేం*
*మనకెందుకు -*

*ఈ దేశం ఏమైపోతేనేం*
*ఈ జనం ఏమైపోతేనేం*
*మనకెందుకు -*

*కేంద్రం రాష్ట్రం ముఖాన*
*గుప్పెడు మట్టి గుక్కెడునీళ్ళు కొడితేనేం*
*మాటల్లో తేనే వెన్నా*
*చేతల్లో చీడ పీడ పట్టిస్తేనేం*
*మనకెందుకు -*

*నా ప్రజాస్వామ్యం పులిలా గర్జిస్తుంది*
*పిల్లిలా మ్యావ్‌మంటుంది*
*మనకెందుకు -* ◆

## డా॥ పుట్ల హేమలత



విహంగ మహిళా సాహిత్య అంతర్జాల పత్రిక వ్యవస్థాపకురాలు ప్రముఖ కవయిత్రి డా॥ పుట్ల హేమలత (56) ఫిబ్రవరి 9న తుదిశ్వాస విడిచారు. వీరు ప్రముఖ కవి డా॥ ఎండ్లూరి సుధాకర్ సతీమణి. రాజమహేంద్రవరంలో పొట్టిశ్రీరాములు విశ్వవిద్యాలయంలో సాహిత్య పీఠంలో ఎం.ఏ. విద్యార్థులకు కంప్యూటర్ విద్యను బోధించేవారు. అంతర్జాలంలో తెలుగు సాహిత్యంపై పరిశోధన చేసారు. తన పరిశోధనను ఇటీవలనే ప్రచురించారు. వందకు పైగా కవితలు, పలు వ్యాసాలు రాసారు. కుసుమ ధర్మన్న జీవిత ప్రస్థానం పేరుతో వీరు రాసిన కుసుమ ధర్మన్న జీవిత చరిత్రను ప్రజాశక్తి బుక్‌హౌస్ ప్రచురించింది. 40కి పైగా జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో పాల్గొన్నారు. దళిత, మైనారిటీ, స్త్రీల సాహిత్యం అధ్యయనం చేయడంతో పాటు దళిత స్త్రీలపై జరుగుతున్న దాడులు, వేధింపులు వెనుక ఉన్న సామాజిక కోణాలపై నిశిత విమర్శ చేసేవారు. వేకువ రాగం కవితా సంపుటి వెలువరించారు. ప్రజాస్వామిక రచయిత్రుల వేదిక ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర అధ్యక్షులుగా ఉన్నారు. తెలుగు సాహిత్య రంగంలో క్రియాశీలంగా కృషిచేస్తున్న డా॥ పుట్ల హేమలత మృతి తెలుగు సాహిత్యానికి తీరనిలోటు. వీరి మృతికి సాహితీస్రవంతి, సాహిత్య ప్రస్థానం తరపున నివాళి అర్పిస్తున్నాం.

## గజల్ గాయకుడు ప్రధాన ఆదినారాయణ



*"ప్రజల మాటను పాడలేని పాట గెలిచేనా*
*పోరు బాటకు దూరమైన జాతి నిలిచేనా"*

అంటూ ప్రజల్ని ఉత్తేజపరుస్తూ ప్రజా గజళ్ళతో చైతన్య పతాక ఎగరేసిన ప్రధాన ఆదినారాయణ శ్రీకాకుళంలో ఫిబ్రవరి 12న కన్నుమూశారు. ప్రజాగజళ్ళు అనగానే గుర్తుకొచ్చే ప్రధాన ఆదినారాయణ డిసెంబర్ 27, 1940న శ్రీకాకుళం జిల్లా సంతబొమ్మాళి మండలంలోని కొత్తూరు గ్రామంలో జన్మించారు. తల్లి లక్ష్మమ్మ, తండ్రి రామన్నలు. 1959లో పంచాయతీరాజ్ శాఖలో రికార్డు అసిస్టెంటుగా ఉద్యోగంలో చేరి జిల్లా పంచాయతీ అధికారిగా పదవీ విరమణ చేశారు. మచ్చలేని ముక్కుసూటి అధికారిగా పేరు గడించారు. సుబ్బారావు పాణిగ్రాహి జముకు పాటద్వారా ప్రజాజీవితాన్ని ప్రతిబింబింపజేయగలగడం ఆదినారాయణను ఆకర్షించింది. అక్కడ నుండి ప్రజా సమస్యల్ని ప్రతిబింబించే జానపద గీతాలను, బుర్రకథ, ఒగ్గు కథ వంటి కళారూపాల్ని గానం చేసేవారు. సినారె, అద్దేపల్లి, పెన్నా, సిరా వంటి ప్రముఖుల గజళ్ళను అనేక వేదికలపై ఆలపించి ప్రజల మన్ననలు పొందారు. ప్రధాన ఆదినారాయణ కేవలం గాయకుడు మాత్రమే కాదు నటుడు కూడా. భక్తప్రహ్లాద, ఉద్యోగ విజయాలు వంటి పౌరాణిక నాటకాలే కాకుండా అల్లూరి సీతారామరాజు, రైతుబిడ్డ, మాభూమి, ప్రేమ తరంగాలు వంటి సాంఘిక నాటకాల్లో, సిరా రాసిన 'అమానుషం' టెలిఫిల్మ్, నరబలి నాటికల్లోనూ ముఖ్య పాత్రలు పోషించి మెప్పించారు. సాహితీ స్రవంతి శ్రీకాకుళం శాఖకు ప్రస్తుతం అధ్యక్షులుగా కొనసాగుతూ కన్నుమూసిన ఆయన శ్రీకాకుళం రంగస్థల కళాకారుల సమాఖ్య, శ్రీకాకుళ సాహితి, గరిమెళ్ళ అధ్యయన వేదిక, వివేకానంద భావ ప్రచార సమితి, కథానిలయం, సాంస్కృతిక సమాఖ్య, ఐరిక్ క్రియేషన్స్ వంటి అనేక సాహితీ, కళా రంగాల సంస్థలలో ముఖ్యభూమిక పోషిస్తూ ముందుకు నడిపించారు. ప్రజా గజల్స్, బాలశ్రీ గజల్స్, అద్దేపల్లి గజల్స్, గోపి నానీలు, భావశ్రీ గజల్స్ మంచి పేరు తీసుకొచ్చాయి. 'సిక్కోలు నానీలు' అనే సంకలనం తీసుకొచ్చారు. శ్రీకాకుళం సాహితీస్రవంతి వెలువరించిన 'కవన జ్వాల' శతాధిక కవుల సంకలనానికి సిరా, డి.ఆర్.కె. నాయుడుతో పాటు ప్రధాన ఆదినారాయణ కూడా సంపాదకులుగా ఉన్నారు. తుదిశ్వాస వరకూ ప్రజాగళం వినిపించిన ప్రజాకవి, గాయకుడు ప్రధాన ఆదినారాయణకు జోహార్లు.

**- సిరా**

కవిత

# అరచేతిలో దృశ్యా దృశ్యాల మాయ

- డాక్టర్ కత్తి పద్మారావు

ఆ నది కర్రల వంతెనను తాకుతూ పారుతోంది
ఆకాశం నేల వైపు చూడటానికి సిగ్గు పడుతుంది
మల్లెలు, జాజులు స్వతంత్రంగా భాసిస్తున్నాయి
కోయిల కంఠంలో ఏదో ఒక గీర పలుకుతోంది
మొగ్గలన్నీ త్వరగా వికసించి, త్వరితంగా రాలిపోతున్నాయి
అవును! ఆమె సహజ సౌందర్యవతే
మై పూతలను నమ్ముకొంది, త్వరగా వసివాడింది
సహజ ప్రకృతులన్నీ సజీవంగానే వున్నాయి
కృత్రిమమైనవి సంక్షోభంలో వున్నాయి
కోరికలు తీవ్రరూపం దాలుస్తూ వున్నాయి
ప్రకృతి విస్తుపోయి చూస్తుంది
గచ్చుపొదల మీద పరికిణీలు చిరుగుతున్నాయి
యుక్త వయస్సు రాకముందే భావోద్వేగాలు
అవును! ఆ సింహాలు, పులులు ఏమిటి?
అడవిలో దుప్పులు దొరక్క
మానవ ఆవాసాల మీద పడుతున్నాయి
వీరెవరు! కామోద్రేకులవుతున్నారు
శరీరం చీరిన వస్త్రంలా వుంది
సూదితో కుట్టడానికి అది పాత గుడ్డ కాదుగా!
వీరెందుకు తొందర పడుతున్నారు
చేలో పంట కంటే తెగులే ఎక్కువ పడుతుంది
అవును! వీరెవరు పురుష భయంతో
తోడును నిరాకరిస్తున్నారు
తోడేదైనా ఒక సముత్తేజమే కదా!
మరి వీరెందుకు సంశయిస్తున్నారు
నిజమే! వీరి సంశయంలో ఒక అర్థం వుంది
తోడే ఒక హింసయితే, తోడే ఒక అనుమానం అయితే
తోడులో ఆనందం ఏముంది?
జీవితం ఒక సుదీర్ఘ సంభాషణే
జీవితం అంటే ఒక గొప్ప అన్వయం
జీవితం అంటే ఒక గొప్ప అవగాహన
ప్రకృతే మనకు ఓ పాఠశాల
అవును! జీవన గమనంలో ఎంతో యుద్ధం జరుగుతుంది
తనలో తనకూ యుద్ధం జరుగుతుంది
సమాజానికి తనకూ యుద్ధం జరుగుతుంది
యుద్ధంలో ప్రావీణ్యం, యుద్ధంలో శిల్పం
యుద్ధంలో విజయం, అన్నీ యుద్ధంలోనే జరుగుతున్నాయి
అవును! ఆ చెట్టు ఐదు దశాబ్దాలుగా పాతుకొని వుంది
ఎన్నో ఋతువులు దానిమీదగా వెళ్ళాయి
వెన్నెల కంటే, చీకటినే అది ఎక్కువ అనుభవిస్తుంది
దాని నీడను ఎందరో సేదతీరారు
అది నిశ్శబ్దంగా నిలబడి వుంది
దాని వేళ్ళు భూమిలో లోతుగా పాతుకొని వున్నాయి
అందుకే! అది కాలాన్ని అధిగమిస్తూ వుంది
ఒక వసంతంలో అది చిగురించింది
పాత ఆకులన్నీ రాలిపోయాయి, జనం కళ్ళు విప్పి చూశారు
నిజమే! ఓట్ల పండగ దగ్గరలో వుంది
జనానికి పై నుండి కాసుల వర్షం కురుస్తుంది
కానీ జోలె నిండడం లేదు, మనుషులను భిక్షగాళ్ళను చేశాక
ఉత్పత్తి ఎక్కడ నుండి వస్తుంది ?
చీకటి పడిందా! కత్తులు, కటార్లు, కత్తిపోట్లు
ఎవరు చంపారో తెలియదు? హతమయ్యింది నిజం!
అవును! ఓటు వెనుక రూపాయే కాదు
ఓటు వెనుక నెత్తురోడుతుంది ఓట్ల వెనుక బలి
నిజమే! జనం చైతన్యం కానంత కాలం
మోసమే రాజ్యమేలుతుంది
అబద్ధానిదే ప్రచార అస్త్రం,
ఇది అంకెల యుగం, అంకెలు చుక్కలు
కూడికలే నక్షత్రాలు, నిజాన్ని చూసే ఓపిక లేదు
అరచేతిలో దృశ్యా దృశ్యాల మాయ
ఆప్ టూ డేట్స్ జాతరలో
జీవితం వెళ్ళిపోతుంది ఇక జీవించేదెక్కడ
జీవితాన్ని వెతుక్కునే టైమ్ లేదు వెతికినా దొరకదు
ఒక్క నిమిషం ఆగితే,
వెనక్కి చూడవచ్చు, ముందుకీ చూడవచ్చు
స్ఫూర్తి, స్పృహ, దృష్టి అన్నీ సమన్వయంలో లేవు
అవును! వీరు బొమ్మలు చూస్తూ బతుకుతున్నారు
బొమ్మలుగా మిగిలి పోతున్నారు
ఆలోచించే శక్తి పోయాక,
రాయికి మనిషికీ తేడా ఏముంది?
నిజమే, ఇప్పుడు మెదడుకు కదలిక కావాలి!
ప్రజలు ప్రజ్వలన శక్తితో ముందుకు నడవాలి
పునర్వీక్షణమే భవిష్యద్దర్శనం. ◆

## పరిశీలన

# దళిత స్త్రీవాద కథల భాష - సంస్కృతి

- ఆచార్య మూలె విజయలక్ష్మి
9966138779




సమాజం - సాహిత్యం - భాష ఒక దానితో ఒకటి ముడిపడి వున్న అంశాలు. ఒక సమాజ సంస్కృతి సంబంధి పదజాలం భాషలో ఇమిడి వుంటుంది. ఒక భాషలోని పదజాలం, జాతీయాలు, సామెతల్లో ఆ భాషా సమాజ సంస్కృతి నిబిడీకృతమై ఉండడం వల్ల భాష సంస్కృతి వాహకంగా పని చేస్తుంది.

ఉద్యమ భావజాలాన్ని ప్రజల్లోకి తీసుకెళ్ళటానికి ప్రజల భాషనే ప్రయోగించడం వల్ల ప్రయోజనం అధికం. దళిత స్త్రీ వాద సాహిత్యంలో దళిత స్త్రీల జీవిత కోణాలే కాక, దళిత సంస్కృతి చోటు చేసుకుంది. ఫలితంగా దళిత స్త్రీ వాద సాహిత్య భాష దళిత సంస్కృతి, సామాజిక ప్రతి పత్తి అంచనా వేయడానికి ఆకరం. ఈ సాహిత్య భాషలో స్థానిక, కుల, ప్రాంత, వర్గ మాండలికాలున్నాయి. కుల సంస్కృతి, స్థానిక సంస్కృతి, ప్రాంత సంస్కృతి నిక్షిప్తమై వుంది. దళితుల ఊరూ, వాడా, తిండి, తిప్పలూ, గుడ్డాగుసురూ, నగనట్రా, కట్టూబొట్టూ, వంటావార్పు, పనిపాటలు, ఆచారాలు, సంప్రదాయాలు కట్టుబాట్లూ, తిట్లు ఒట్లు, కులాలు, ఉపకులాలు, ఆశ్రిత కులాల మధ్య అంతరాలు వంటి అంశాలు ప్రస్ఫుటమవుతున్నాయి.

ఈ వ్యాస రచనకు జూపాక సుభద్ర, గోగు శ్యామల సంకలనం చేసిన 'నల్లరేగడి సాల్లు', గోగు శ్యామల 'ఏనుగంత తండ్రి కంటే ఏకుల బుట్టంత తల్లి మేలు" ఎండపల్లి భారతి 'ఎడారి బతుకులు' ఆకరాలు.

దళిత కులాల్లో మాదిగ, మాల ప్రధానమైనవి. మాదిగవాడ, మాల వాడ వీరి ఆవాసాలు, మాదిగవాడను మాదిగ గేరి అనికూడా అంటారు. మాదిగలు "ఊరికొలువు" చేయాలి. పలకలు కొట్టడం, గొడ్డు చనిపోతే తోలు వలిసి పోతం చేసి యజమాని కివ్వాలి. కపిల బానలు, మెట్లు కుట్టివ్వడం యాతం లేదా కపిలతో నీళ్ళు తోడి పోయడం, సావుసుద్ది చనిపోయిన వారి బంధువులకు చెప్పి రావడం, పాడి (పాడె)కు వెదుర్లు కొట్టకరావడం వంటి పనులు ఊరి కొలువులో భాగం. పెండ్లి పేరంటం అంటే ఇంటి ముందర పందిరి వెయ్యడం, వంటకు కట్టెలు చీల్చడం, ఎంగిలాకులు ఎత్తేయడం, పగ్గాలు పేనడం వంటి పనులు చేయాలి.

కులస్థుల ఇండ్లలో పెండ్లయినా చావయినా "పాలోళ్లు" ఇంటికొకరు వెళ్ళి కార్యాలు చేయాలి. పీనుగుమన్ను అయిందాక దప్పులు ధూం ధాం కొట్టడం పద్ధతి.

అనాదిగా సమాజం దళితుల పట్ల అస్పృశ్యతను పాటిస్తోంది. పిల్లలు బడిలో తిండి దగ్గర వివక్షకు గురవుతున్నారు. చదువులో మిన్నగా ఉన్నా ఇతర కులాల పిల్లలు తగలకుండా జాగ్రత్తపడుతుంటారు. తెలిస్తే అమ్మానాన్నలు తిడతారని భయం.

దళిత సాహిత్యంలో దళిత ఉపకులాలు, ఆయాకులాలు దళితులకు (మాదిగలకు) చేసే ప్రకార్యాలు, ఉపకులాల సమస్యలు ప్రస్తావించబడినాయి. దక్కలి, చిందు బైండ్ల, మాస్టీ, బాగరి, వ్యాసరచనకు తీసుకున్న కథల్లో కన్పించే మాదిగ ఉపకులాలు, దక్కలి కులస్థులు మాదిగల కుల పురాణం 'జాంబపురాణం, ఏటం కథగా చెప్తారు. మాదిగల యాచకి

కులం కులపురాణం చెప్పడానికి పల్లెకు వచ్చినపుడు తిండీ తిప్పలు మాదిగలు చూడాలి. లేదంటే కులం తప్పు తీసి పంచాలి. పెట్టి దండగ కట్టిస్తారు. పుత్ర సంతానం లేకపోతే ఆడపిల్లలకు 'యిస్స అంటే హక్కు గ్రామాలను అప్పగిస్తారు. కులకట్టులో పెట్టేకాడ పోసేకాడ తేడాలొస్తే యస్సదారి – దక్కలి వాళ్ళు తీర్పు చెప్తారు.

చిందు మాదిగలు/ సిందోళ్లు జాంబముని చిన్న భార్య కుమారులంటారు. జాంబపురాణం, సారంగధర చరిత్ర, హరిశ్చంద్ర కథ మొదలైన కథలు చెప్తారు. చిందుకులంలోని బాలిక ఎల్లమ్మ వేషం కడ్తుంది. దీనికి మానెడు గవ్వలు, మానెడు పసుపు మోయాల్సి వస్తుంది. దేవునితో లగ్నం చేసి 'ఏశాని' కి యిడిసి పెడ్తారు. ఆటాడడానికి సమూహంగా ఏర్పడడం 'మ్యాలం' బెట్టడం. ఆటాడినందుకు ఇచ్చే ఇనాం 'త్యాగం (ఏడాది కోసారి వచ్చినపుడు కులానికి మూడు ఆటలు, ఊర్లో కులానికో ఆట ఆడాలని నియమం.) బైండ్లవారు పెండ్లిబలం చెప్పటం, పౌరోహిత్యం వహించడం వీరి కార్యాలు. జోగినికిడిసిన బైండ్ల స్త్రీ 'పర్పులామె జోగుకిడిసిన ఆడది ఊరుమ్మడి పెండ్లం అని ఉన్నా, ఆర్థిక బలం, సోదరుల అండ వుంటే ఊరి ఆడ్విల్ల (ఆడపిల్ల) గా మర్యాద వుంటుంది. ఈమె కొలువు చెప్పినందుకు ఇచ్చే ఇనాం కట్నం.

మాస్టీలు మాదిగలకు చెక్క పని చేస్తారు. మాస్టీ స్త్రీ చుట్టుకుదుర్లో, డప్పు కుదుర్లు, ఈల పీటలు, ఆరెపిడులు, తెడ్లు, రొట్టె పీటలు, కవ్వం పిడులు, ఏటకోలలు పప్పుగుత్తులు ఇంకా పిల్లలాడుకునే గిలక్కాయలు, లక్కకోళలు, మాదమూతిబుట్టలు, శిబ్బులు, మాదిగ వాడల్లో అమ్ముతుంటారు. మాస్టీ మొగోల్లు కుర్చీలు, బల్లలు, నాగండ్లు, పారకట్టెలు వంటి చెక్కసామాన్లో ఇచ్చి ఇనాం తీసుకుంటారు. ఇంకా లంద తొట్టికాడ కావలి వీరి పని. మాదిగలు గొడ్డును కోసి, పంచుకున్న తర్వాత మిగిలిన 'యిచ్చర్లు బొచ్చుర్లు, ముడ్సులు వీరికిస్తారు. తోలును 'పొతం చేసి' తొట్టెలో పెడతారు. వారం రోజులయినా ఎండేదాకా కావలి ఉండాలి.

ఆడపిల్లలు పెద్దమనిషి అయితే మాస్టీ స్త్రీ 11 రోజులు కాపలాగా వుండాలి. అందుకు వడ్లు, పాతబట్టలు, పైసలు ఇనాంగా ఇస్తారు. పొద్దుమాపింత 'అంతబువ్వ పెడ్తారు మాస్టోళ్లు మాదిగలు పెట్టింది ఇచ్చింది తిని బతకాలి. దళిత స్త్రీ వాద సాహిత్యంలో ప్రస్ఫుటమయిన దళిత ఉప కులవ్యవస్థ ఇది. అల్పాదాయ వర్గం, ఎకరా అరఎకరా పొలం వర్షాధారితం. అందువల్ల పచ్చజొన్నలు, తెల్లజొన్నలు, సీతమ్మ జొన్నలు, అచ్చల కుసుమలు, నల్ల కుసుమలు, తెల్ల కుసుమలు, అవిసెలు, సజ్జలు, సామలు, కొర్రలు, కందులు, శెనగలు వంటి పంటలు పండిస్తారు. పంటలను బట్టే తిండి – జొన్న రొట్టెలు, సద్దగట్క, మక్కగట్క, జొన్నగట్క, జొన్నబువ్వ, నూకల జబురు సంగటి, మొక్కజొన్న లేదా జొన్నల నూకలతో కాచుకునే జావ గట్క వీరి తిండి. దేవుని ప్రసాదానికి బియ్యంతో వండిన 'సామి బువ్వ' పెడతారు.

వీరికి గొడ్డు మాంసమంటే ప్రీతి. తునకల చారు (మాంసం కూర) మాంసం ఎండబెట్టి ఎండుముక్కలతో కూర చేసుకుంటారు. పొయ్యిలో కాల్చుకుని తింటారు. కుందేల్లు, కొండగొర్రెల మాంసం కూడా ఇష్టమే. కూరకు దినుసులు లేకుంటే పచ్చి చింత కాయల్ని నిప్పుల్లో కాల్చి, ఉప్పు, మిరపకాయలు వేసి, పిసికి 'గొజ్జు' చేసుకుంటారు. పచ్చి పులుసు, పప్పుశారు సాధారణంగా ప్రతిరోజు బువ్వలోకి చేసుకునే కూరలు.

పండగోపబ్బమో అయితేనే దోసెలు, ఓలిగెలు వంటివి కరువు కాలంలో బద్దాకు, దేదారాకు ఆదరువు. కరువులోనే గాక గొట్టి గడ్డలు ముక్కలుగా దంచి అనపబేడలు, బెల్లం పొడి చేసి చింతతుండు వేసి, అంటేస్తారు. (మంటపెట్టారు) తెల్లవారు చూస్తే గడ్డలు, బేడలు, బెల్లం కలగలిపి తినడానికి అదిరిపోయే రుచి. నెయ్యికాచిన దుత్తలో రాగిపిండి, బెల్లం కొట్టివేసిన పిండి తినడం పిల్లలకు భలే ఇష్టం. తిరుణాలలో 'బత్తాయిబిళ్లలు' (చెక్కరబిల్లలు), కొమ్ములు, 'కారాసులు' కొనుక్కుని తింటారు. పని పాటలకు వెళుతూ దోవంటి దొరికే బలిసికాయలు, సీతారాంకాయలు ఇష్టం. పిల్లలు జొన్న ఆకులపై వజ్రపు రాళ్లలాగా మెరిసే జొన్న 'జిగిని' నాక్కొని తింటారు.

తాటాకు మట్టలు లేదా బోదతో కప్పిన గుడిసెలు నివాసం. గాలివస్తే పై కప్పు ఎగిరిపోయేట్లుంటుంది. వానొస్తే ఇళ్ళంతా మడుగే. ఇంటి ముందు విశ్రాంతి కోసం 'ఇడపరుగు' ఉంటుంది. ఇళ్ళు పేడతో 'ఈమ్లు' తీసి 'పట్టెలు'గా అలుకుతారు. ఇంటిలోపల చుట్టూ ఎర్రమన్ను నీళ్ళలో కలిపి పట్టేలాగా రుద్దుతారు. దీన్ని 'అరుగోడు' తీయడమంటారు. ముగ్గుపిండి గుంత నుంచి ముగ్గుపిండి తవ్వుకొచ్చి, ఇంటి ముందు ముగ్గులేసుకుంటారు. నాలుగేళ్ల సందుల్లోంచి నాలుగుగిర్రల్తో పీట ముగ్గు వేయడం నేర్పరితనం.

స్త్రీలు ఇంటి పని, బయట పని చేయడంలో దిట్టలు. శ్రామికశక్తి అధికం. కొంగునడుముకు చుట్టి 'కుందెన' (ధాన్యం పడిపోకుండా పెట్టే వెదురు అల్లకం) వేసి బస్తాల కొద్దీ వడ్లుదంచగలదు. సేర్ల కొద్ది జొన్నలు, పెసలు, కందులు

'విసుర్రాయి'లో పోసి విసరగలదు. పొలంలో నాట్లేయడం, కలుపులు తీయడం, కోతలు కోయడం, కట్టలు కట్టడం తూర్పారబట్టడం, ధాన్యం, గండలు మోయడం సునాయాసంగా చేయగలదు. ఆరుగాలం కష్టం పడితేనే తల్లీ పిల్లలకు తిండి – ఇక ఏ పూటకు ఆపూట అంగిడికెల్లి ఉప్పు, మిరపకాయలు కొనుక్కొచ్చి, వండి వార్చడం ఇంటిల్లి పాదీ మురిగి గుడ్డలు చెరువుకెల్లి ఉతుక్కురావడం, తప్పే పనులుగాదు. ధైర్యశాలి, బలశాలి. నీళ్ళలో ఈదుతూ కుందేలును పట్టగలదు, కొండగొర్రెను వేటాడి భాగాలు వేయగలదు,పడగ విప్పిన పామును చిన్నపాటి కర్రతో అంతం చేయగలదు.

గ్రామదేవతారాధనకు ప్రాధాన్యం – ఆయా గ్రామాల్లో కొలువైవున్న మైసమ్మ, పోసమ్మ, గంగమ్మ, ఊరడమ్మ, వులిగంగమ్మ, సవురమ్మ వంటి దేవతలను పూజిస్తారు. కోడి లేదా పొట్టేలు లేదా దున్నపోతును బలివ్వడం ముఖ్య కార్యక్రమం. స్థానికంగా ప్రాశస్త్యం ఉన్న దేవతల ఉత్సవాలకు వెళ్ళడం మొక్కులు చెల్లించుకోవడం ఉంది. చిత్తూరు జిల్లాలో తిరుమల ప్రసిద్ధ పుణ్యక్షేత్రం. అక్కడ వెలిసిన వేంకటేశ్వరస్వామి కొందరికి ఇల్లిలపదేవుడు (ఇలవేల్పు) శనివారం ఒక్కపొద్దుండి దీపం పెట్టందే నోట్లో నీళ్ళు పోసుకోరు. పిల్లలకు అనారోగ్యం కలిగినా ప్రసవం కష్టమైనా 'మీదు' 'కడతారు. అంటే ముడుపు–ముడుపు చెల్లించటానికి తిరుమల వెళ్ళాలంటే ఖర్చు భరించలేని వారు "సమేదాసరి" ద్వారా చేరుస్తారు. జాగిటి (జేగంట) పట్టుకొని, గోవింద నామస్మరణ చేస్తూ ఊరూరు తిరిగి మీదులు సేకరించి తిరుమల చేర్చే వ్యక్తి సమేదాసరి. పశువులకు ప్రసవం కష్టమైతే బోయ కొండ గంగమ్మకు పసుపు గుడ్డలో రూకపెట్టి కుడికొమ్ముకు కట్టి సుఖప్రసవం జరగాలని కోరుకుంటారు.

చిత్తూరు జిల్లా కురబలపేట మండలం తెట్టు గ్రామంలో వేణుగోపాలస్వామికి జరిగే "తెట్టు తిరుణాల"లో పిల్లా పెద్ద పాల్గొంటారు.

పండుగలు పద్ధతిగా జరుపుకుంటారు. తెలుగు సంవత్సరాది ఉగాది. చలి తగ్గి వెచ్చ వెచ్చగా ఎండకాస్తా ఉగ (వేడి) మొదలవుతుంది. కాబట్టి ఉగాది అనే పెద్దలుకు ఇష్టమైన వంటలు చేసి పెట్టి, కొత్తగుడ్డలు పెడతారు కాబట్టి "పెద్దల పండుగ" అని అంటారు. "అన్నం పొద్దు పండుగ" అంటే కూడా ఉగాది. ఉగాది పండుగనాడు కుమ్మరింటి నుంచి కొత్త కడవ, మేదర ఇంటి నుండి కొత్త చాట తెచ్చి, కడవ నిండా నీళ్ళు నింపి, నామాలు పెట్టి ఐదు విస్తరాకులు వేసి వండిన వంటలు ఆకుల్లో పెట్టి, కొత్త గుడ్డలు పెడతారు. గుడ్డలు పెట్టే తావు 'నిలుపు. పెద్దల పటాలుంటే నిలుపు మింద పెడతారు. వేపపూత, పొడి బెల్లం కలిపి "యాపబెల్లం" దేవుని ముందు పెట్టి టెంకాయ కొడతారు. ఇదంతా తొమ్మిది గంటలకు పూర్తి కావాలి. కాబట్టి "అన్నం పొద్దు పండుగ" ఐదు విస్తర్లో ఒకటి దేవునికి, నిలుపుకు ఒకటి, ఇంటికప్పు పైకి ఒకటి, గోగికు (ఆవుకు) ఒకటి, అందరికి ఒకటి. 12 గంటలలోపల యాపబెల్లం ఊరందరికి పంచుతారు. ఇన్ని పనులతో ఆ రోజు ఆడోళ్లకు ఊరూసెరూ (విశ్రాంతి) పొందరు.

'టెంకాయల పండుగ' అంటే వినాయక చవితి. దసరా జరుపుకుంటారు. తెలంగాణలో దసరాకు పిల్లలకు కొత్త గుడ్డలు కుట్టిస్తారు. బగారన్నం, సియ్యా బువ్వ వండుకుంటారు. బతుకమ్మ పండుగ ఊరంతా ఉత్సాహంగా జరుపుకున్నా మాదిగోల్లకు 'హొంతన' (ఆచారం) లేదు అని బతుకమ్మను చేయరు. పిల్లలు ఉబలాటపడి గునుగుపూలు, ఉప్పుపూలు, తంగేడుపూలు, బంతిపూలతో 'సత్తు తబుకు'లో ఆనిగెంకాయి (సొరకాయ) లెక్క పేర్చినా ఇతర కులస్థులు తమతోపాటు బతుకమ్మ ఆడనివ్వరు. అందుకు చెప్పే కథ 'తపుకు'లో పూలను పేర్చి నడుమ 'కుడక'పెట్టి గౌరమ్మను చేయాలి. ఒక స్త్రీ ముడుసుబొక్కనే గౌరమ్మ లెక్క వుంచి బతుకమ్మను పేర్చిందట. దాంతో గౌరమ్మకు కోపం వచ్చి 'నీకులపోల్లకు యింక జిందగీల బతుకమ్మను ఆడేది లేదు' అని శాపం పెట్టిందట.

దళిత, దళిత ఉపకులాల్లో ఆచారాలు ప్రత్యేకంగా ఉన్నాయి. మాదిగల ఇళ్లలో నిశ్చితార్థంకు బైండ్లకులస్థుడు పురోహితుడుగా వ్యవహరించి, కంకణాలు కట్టి, ఎల్లమ్మ మంత్రాలు చదువుతాడు.

'సెక్కరేసే దినం' అంటే పెళ్లిరోజు పెళ్లికూతురికి ఓలి ఇచ్చే ఆచారం ఉంది. 30 రూపాయలు, పగిడి పదకొండు రూపాయలు, తొమ్మిది రయికలు, తొమ్మిది కుడుకలు, కజరపండ్లు, చిట్టిపోకలు, సాదలు (సరుకులు) ఓలిగా ఇచ్చినట్లు లసుమవ్వ దుక్కి కథ ద్వారా తెలుస్తోంది.

పెళ్ళికూతురుకు మాదిగవాడలోని స్త్రీ సొమ్ములన్ని అలంకరించి ముస్తాబు చేస్తారు. వారం తర్వాత ఎవరివి వారికి అప్పగిస్తారు. 'మారు మానం" (మారు మనువు) చేసుకోవడం, భర్తను వద్దనుకొని మరొకరితో సహజీవనం చేయటం తప్పుగా పరిగణించరు. అయితే 'తాలీత బొట్టుకట్టోడికే ముండమొయ్యాల అనే ఆచారముంది. ఈ ఆచారం చిత్తూరు జిల్లాలో ఉంది. తెలంగాణ ప్రాంతంలో లేదని తెలుస్తుంది.

భర్త చనిపోతే స్త్రీ గాజుపూస తీసేసి, తెల్లచీర ధరించి చుట్టాలిండ్లకుపోయి దీపం చూడాలి. దీపం చూడటానికి బంధువుల ఇండ్లకు వెళ్ళినపుడు నట్టింట దీపం పెట్టి 'కడపమాను' కు ఇరువైపులా బియ్యం గింజలు వేసి, దీపం చూపించి ఉప్పుచట్లో చేయి పెట్టిస్తారు. అలా చూడకపోతే తర్వాత వాళ్ళింద్లకు వెళ్ళకూడదు.

దళిత, దళిత ఉపకులాల్లో కొనసాగుతున్న దురాచారం మొక్కుబడికోసమో, గ్రామపెద్దల బలవంతం మీదనో, ఇంటి ఆచారమనో ఆడపిల్లలను బసివిని, జోగిని చేయడం అంటే దేవతతో వివాహం తంతు జరిపిస్తారు. ఇది అమ్మ కార్యంగా భావిస్తారు. తర్వాత పెళ్లి చేయరు. ఆ బాలిక జీవితం తర్వాత చింపిన విస్తరాకు. బసివిరాలును చేయడానికి ఊరందరూ చందాలు వేసుకుంటారు. పులిగెమ్మ లేకపోతే సవురమ్మ గుడిలో దేవతను నిలుపతారు. పెద బసివిరాళ్లు బాలిక బట్టలు తీసి వేప మండలు కట్టి బుక్కపిండి మొఖానికి పూసి ఊరేగింపుగా తీసుకెళ్ళి గంగస్నానం చేయించి గుళ్లోకి తీసుకెళ్ళతారు. జోగుళ్లు వేసి పసుపు చీర, రవిక తొడిగిచ్చి కర్నుం స్వామితో బొటన వేలు తొక్కిస్తారు. మరొకరి చేత 'ద్వావర్లు' కట్టిస్తారు. నాటి నుండి ఆమె ఊరుమ్మడి సొత్తు. ఈ తంతులో దున్నపోతుని నరికి భాగాలు వేసుకుంటారు. ఈ తంతు 'నడిమింటి బోడెక్క బసివిరాలయ్యెద' కథలో సవివరంగా వర్ణింపబడింది.

అమ్మవారు పోస్తే గ్రామదేవతలకు ఆగ్రహం వచ్చిందని భావిస్తారు. గ్రామంలో ఊరుదమ్మకు ఉత్సవం చేయడానికి ఏర్పులామె'ను బైండ్లోన్ని 'పోతురాజు'ను సంప్రదించి కార్యం జరిపిస్తారు. ఏర్పులామె కొలుపు చెప్పిందానికి 'కట్నం' ఇస్తారు. ఊరడమ్మకు దున్నపోతును బలి యిచ్చి పెద్ద పచ్చితునకను జోగిని నోటిలో వేలాడదీసి ఊరు చుట్టూ తిప్పుతారు. ముందు దినం నుంచి ఉపవాసముండి పచ్చికుండ మీదెక్కి ఊరి భవిష్యత్తు చెప్పడం 'కొలుపు చెప్పడం' అంటారు. ఏర్పులామె అమ్మవారి ప్రతిరూపంగా భావిస్తారు. ఇలాంటిదే జోగిని 'రంగమెక్కడం' జోగినికి వృద్ధాప్యం వచ్చి నుడుగులు డొల్ల కొచ్చి, 'శిడి' ఎక్కడం కష్టమైతే ఈ వృద్ధురాలు ఉండగానే మరో బాలికను జోగుకిడిసి తర్ఫీదు ఇప్పిస్తారు.

దళిత స్త్రీ జీవితం వివిధ నమ్మకాలతో ముడిపడి ఉంది. తమకున్న కాసింత నీడను గాలిదేవత ఎత్తుకొని పోకుండా గుడిసెకప్పాక బెల్లం, బియ్యం, వేపాకు మూటగట్టి కప్పుపై వేస్తారు. ఇంట్లో 'గాళ్లూ దూళ్లు' రాకుండా "పోలి" కడతారు. అంటే 'కోడి గూజ్బాం' ముందే లేచి ఎవరూ చూడకుండా ఆవు పేడతో ఇంటి చుట్టూ గీత మాదిరి గీస్తారు. మంగళవారం కోడిని పొదిగేస్తే మస్తుగా పిల్లల్ని చేస్తుందనీ, తొలీత పెట్టిన గుడ్డును మొదట గంపలో పెట్టాలంటారు.

గర్భవతి దేని మీదన్నా ఆశపెట్టుకొనుంటే కాన్పు అవదని ప్రసవం కష్టమైతే అడిగి ఆ తల్లి ఆశ తీర్చుతారు. 'మీదు కట్టి చేతికి కడతారు, పశువుకైతే కుడికొమ్ముకు కడతారు.

ప్రసవ సమయంలో గురికపోచతో బొగ్గిలి చుట్టూ ఆముదం పోస్తారు. బొగ్గిలి పై కారితే ఆ రోజే కాన్పు అవుతుందని పక్కకు కారితే రెన్నాళ్ళు తాలి అవుతుందని అనుకుంటారు.

దళితుల ఆర్థిక పరిస్థితి అంతంత మాత్రమే దాంతో అందుబాటులో ఉన్న ఆకులో, వేళ్లో వాడుకుంటారు. లేకపోతే మంత్ర తంత్రాలను నమ్ముతారు. తాగివచ్చి భర్త చితక బాదితే కుయ్ కుయ్ అనకుండా ఆ దెబ్బలకు వాయిలాకు కాపడం పెట్టుకుంటారు. 'కొయ్యకాలు' అంటే పైరుకోసాక మిగిలిన మొదలు తగిలి గాయాలయితే నల్లలం ఆకులు నలిపి గాయాలకు పెడతారు. పిల్లలు ఆడుతూ పడిపోతూ మోకాళు దొర్రుపోతే చెరువు అంచుల్లో ఉండే జెర్రిపోతు చెట్లపాలు పూస్తారు. ఒళ్ళు ఉడుకైతే బొగ్గిలికి పేడ మెత్తుకుంటారు. రేచీకటికి 'పొద్దుమూకెల్ల' తమ గోత్రస్థులు, కాందనోళ్ల (వంశస్థుల) దగ్గర ఏడిండ్లు తిరిగి తిండి అడుక్కోని తింటే పోతుందని నమ్మకం. అమ్మతల్లి పోస్తే మంత్రించిన నీళ్లిస్తే శాంతిస్తుందని నమ్ముతారు.

దళిత స్త్రీవాద కథలు దళిత, దళిత ఉపకులాల స్త్రీల సమస్యలు ప్రధానాంశంగా సాగినా మొత్తం దళిత జీవన సంస్కృతికి అద్దం పడ్తున్నాయి. ఈ కథల్లో భాష ఆధారంగా దళిత స్త్రీ సంస్కృతి గుర్తింపబడింది. దళిత స్త్రీ శ్రామికశక్తి, ధైర్యశీలి అయినా పురుషాధిపత్యంలో నలుగుతూ ఉంది. కుటుంబంలో ఇంటిపని, కుటుంబ పోషణకు కావాల్సిన ఆర్థిక బాధ్యత దళిత మహిళదే. కూలీనాలీ చేసి సంపాదించిన డబ్బులకు, లైంగికంగా భర్తలతో వేధింపులు పడుతున్నారు. అడపాదడపా చితక బాదుడు తప్పడం లేదు. పనిబాటల దగ్గరో మరోచోటో యజమానుల దగ్గరో ఆధిపత్య వర్గాల పురుషుల వేధింపులు అనుభవిస్తున్నారు. దురాచారాలైన కొనసాగుతున్న జోగిని, బసవిని ఆచారాలు స్త్రీల పాలిట శాపాలే. దళిత స్త్రీవాద కథలు భాషాపరంగా అధ్యయనం చేసినా, సాహిత్యపరంగా చూసినా దళిత స్త్రీ జీవితంలోని కడగండ్లు, కష్టాలు, కన్నీటి వెతలు ప్రస్ఫుటమవుతాయి. ◆

## కవిత

# మౌనం ఇక మాట్లాడ వలసిందే !

- నిఖిలేశ్వర్
9177881201



కాలం లిఖిస్తున్న
అక్షరాల నడుమ
సాగుతున్న జీవన యాత్ర
ఎక్కడో ఆగిపోయిన వాళ్లు
దారిలో దిశను కోల్పోయిన వాళ్లు
చక్రవ్యూహంలో తప్పిపోగా
అమరత్వమే అంతిమ శ్వాసగా
మిగిలిపోయే పాదముద్రలుగా !

ఇప్పుడైనా
నీ మౌనం మాట్లాడవలసిందే
ఒంటరితనం
సమూహశక్తిగా
సమాధానాలు పొందవలసిందే,
ఇక్కడే ఇదంతా పాడుకాలం
ఇక్కడే ఇదంతా ఎంతో మంచికాలం
నిద్ర నటించినా

ఎవరైనా మేల్కొనవలసిందేనని
చెంప చెల్లుమనిపిస్తున్న కాలం !!

---

# ప్రజాస్వామ్యం

- మోకా రత్నరాజు
9989014767



చీకట్లో
రాత్రిపూట సంచరిస్తూ
ఇళ్ళల్లో కన్నాలేసే
దొంగల్ని వదిలేసి
పొద్దున్నే చెత్తలేరుకునే వాళ్ళమీద
కలబడే వీధికుక్కలల్లే

అవయలోప
యోగ్యులైన యాచకుల్ని కాలదన్ని
జాతక; జ్యోతిష్యాల
కల్లబొల్లి మాయమాటల్ని నమ్మి
నోట్లతో సత్కరించే
అపాత్రిదాన కర్ణులల్లే

అన్నమేదో; సున్నమేదో
గమనించక
ఎన్నుకోవాల్సిన వాళ్ళను కాదని
మన్ను కరిపించె వాళ్ళను
అందలమెక్కించే
విలువెరుగని ఓటర్లున్నంత వరకూ-

ప్రజాస్వామ్యం
ఈనగాసిన నక్కలపాలై
కుక్కలు చింపిన విస్తరికాక
ఇంకేమవుతుంది?

---

# ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చైర్మన్‌గా కొలకలూరి ఇనాక్ నియామకం



ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ చైర్మన్‌గా ప్రసిద్ధ రచయిత, కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు గ్రహీత కొలకలూరి ఇనాక్‌ను ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం నియమించింది. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం గతంలోనే సాహిత్య, సంగీత, నాటక, జానపద అకాడమీలను ఏర్పాటుచేస్తున్నట్టు ప్రకటించిన విషయం తెలిసిందే. రెండు నెలల క్రితం నాటక అకాడమీకి చైర్మన్‌గా గుమ్మడి గోపాలకృష్ణను, వైస్ చైర్మన్‌గా డా॥ కందిమళ్ళ సాంబశివరావును, 11 మంది సభ్యులను నియమించింది. ఫిబ్రవరి 12 న సాహిత్య, సంగీత, జానపద అకాడమీలకు కూడా కమిటీలను ప్రభుత్వం ప్రకటించింది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర సాహిత్య అకాడమీ చైర్మన్‌గా కొలకలూరి ఇనాక్, వైస్ చైర్మన్‌గా అట్టాడ అప్పలనాయుడు, సభ్యులుగా పి. దక్షిణామూర్తి, డా॥ వి.ఆర్. రాసాని, ఆర్.ఎం. ఉమామహేశ్వర రావు, నారంశెట్టి ఉమామహేశ్వర రావు, పాటిబండ్ల రజని, జగద్ధాత్రి, కత్తిమండ ప్రతాప్ కుమార్, రసరాజు, కంతేటి శివరామకుమార్, నాగభైరవ ఆదినారాయణ లను నియమించారు. సంగీత అకాడమీకి చైర్మన్‌గా వందేమాతరం శ్రీనివాస్, జానపద అకాడమీకి చైర్మన్‌గా పొట్లూరి హరికృష్ణను నియమించారు.

కథ

# గమనం



- రాచపూటి రమేష్
9866727042

నారాయణ సీట్లో సర్దుకొని కూర్చున్నాడు. ట్రైను చీకటిని చీల్చుకొని వేగంగా వెళుతోంది. ఏ స్టేషను దాటి వెళుతోందో తెలియడం లేదు. రాత్రిపూట చిన్న చిన్న స్టేషన్లలోని మసక వెలుతురు బోర్డులను పరిశీలనగా చూడ్డానికి వీలు లేకుండా చేస్తోంది.

కార్నర్ సీట్లో వున్నవాడు విండోకున్న అద్దాన్ని కొద్దిగా తెరవడంతో చలిగాలి రివ్వున లోనికి దూసుకొచ్చింది. అసలే జలుబూ, జ్వరంతో బాధపడుతున్న నారాయణకు దగ్గు తెర ముంచుకొచ్చింది. అద్దాన్ని మూసెయ్యమంటే విండో సీట్లో కూర్చున్న కుర్రాడు మూసి మళ్లీ మూసి, మళ్లీ మళ్లీ తెరుస్తూ వున్నాడు.

నలుగురు కూర్చోవాల్సిన సీట్లో ఆరుగురు సర్దుకుని కూర్చున్నారు. పాసింజరు ట్రైను కాబట్టి ప్రతి స్టేషన్లో ఆగి మళ్లీ బయల్దేరుతూవుంది. ఎంత రాత్రైనా, జనాలు ట్రైన్లో ఎక్కుతూనే వున్నారు.

పుంగనూరు గంగజాతరకు మూడు రోజులపాటు డ్యూటీ పూర్తి చేసుకొని ఆ రోజే తానుండే తిరుపతికి తిరిగి వచ్చాడు. పోలీస్ కానిస్టేబుల్ నారాయణ, నిజానికారోజు తనకు ఆఫ్. కానీ సాయంత్రం ఐదుగంటలకు ఎస్ఐ ఫోన్ చేసి అర్జంటుగా స్టేషనుకు రమ్మన్నాడు. సబిన్స్‌సెక్టరు ఫోన్ చేశాడంటేనే తనకు మళ్లీ ఏ దూరప్రాంతంలోనో డ్యూటీ పడి వుంటుందనుకున్నాడు నారాయణ.

"రేపు సి.ఎం గారు అనంతపురం జిల్లా విజిట్‌కు వస్తున్నారు . రేపుదయం ఎనిమిదింటికల్లా నువ్వక్కడ ఎస్పీ ఆఫీసులో బందోబస్తు డ్యూటీకి హాజరుకావాలి" చావు కబురు చల్లగా చెప్పాడు. ఎస్సై లోకనాథం, వక్కపొడి నములుతూ.

"కానీ నేను మూడు రోజులు పుంగనూరులో జాతరకు డ్యూటీ చేస్తున్నాను సార్. అక్కడ తాగే నీళ్లు పడక జలుబూ, జ్వరమూ పట్టుకొన్నాయి. నా మనవరాలికి కూడా హైఫీవర్‌గా వుంది. నేను మళ్లీ క్యాంపుకు వెళ్లలేను సార్"

"నేనేమీ చెయ్యలేనయ్యా, ఎస్పీ దొరగారి ఆర్డర్సు, ఈ రోజు వెళ్లవలసిన ఫారూకు వాళ్లత్తగారు కాలం చేశారని లీవుపెట్టి కడప వెళ్లిపోయాడు. మరొక కానిస్టేబుల్ శామ్యూలు టైఫాయిడ్ జ్వరమని నాలుగు రోజులు సిక్‌లీవు పెట్టాడు. నువ్వు, మనోహర్, నాయుడూ అనంతపురానికి వెళ్తే స్టేషన్లో నేనూ, ఇంకో ముగ్గురు లేడీ కానిస్టేబుల్సూ మాత్రం వుంటాం.

మాకూ ఈ రెండు రోజులూ కష్టమే" తాపీగా శలవిచ్చాడు లోకనాథం.

చేసేదేమీ లేక నారాయణ ఇంటికి వెళ్తూ మనవరాలికి జ్వరానికి టాబ్లెట్స్ మందుల షాపులో కొని తీసుకువెళ్లాడు. (అతని పెద్ద కూతురు సునంద వాళ్ల అమ్మాయి హరిణి వాళ్లింట్లోనే వుండి చదువుకొంటోంది. సెకండ్ క్లాసు చదువుతున్న ఆ పాపకు రెండు రోజుల నుండి జ్వరమట. ఆ పాపను తీసుకొని తన ఇంటి సమీపంలోని డాక్టర్ ప్రభాకర్ వద్దకు వెళ్లాడు నారాయణ. ఆ డాక్టరు ఏదో పనుందని ఆ రోజు క్లినిక్ తెరువలేదట. తీర్థకట్ట వీధిలో తనకు తెలిసిన మరో డాక్టరు నారాయణరెడ్డి వద్దకు పాపను తీసుకొని వెళ్లాడు. కానీ అక్కడ చాలా రద్దీగా వుంది. టోకెను తీసుకొని తన వంతు కోసం ఓపికగా కాచుకొని వున్నాడు నారాయణ. ఇంతలో మరో కానిస్టేబుల్ నాయుడు నుండి ఫోన్ వచ్చిందతనికి.

ఇంకో అరగంటలో లగేజి సర్దుకొని స్టేషన్ వద్దకు వచ్చెయ్యి. ఎస్సై సారు వారంట్లు ఇస్తారంట. రాత్రి తొమ్మిది పైన అనంతపురానికి బస్సులు లేవంటున్నారు" అన్నాడు నాయుడు.

"అలాగే" అని నారాయణ మరో పావు గంట ఓపికగా కాచుకొని వున్నా డాక్టరు వద్ద వున్న పేషెంట్లు తరగలేదు. ఇక లాభం లేదని టోకెను నర్సుకు వాపసు ఇచ్చి డబ్బు తీసుకొని పాపతో బాటూ ఆటోలో ఇల్లు చేరుకున్నాడు. భోజనం చేసి, రెండు ప్యాంట్లు, షర్టులు, తువాలు, లుంగీ వగైరా ఒక లెదరు బాగ్‌లో కుక్కుకొని జ్వరం టాబ్లెట్ వేసుకొని హడావిడిగా ఆటోలో పోలీస్ స్టేషన్‌కు చేరుకున్నాడు.

"ఎంతసేపయ్యా నీ కోసం వెయిటింగూ" అని తిట్టుకుంటూ ఎస్సై నారాయణకు బస్సులో ఉచితంగా రానూ పోనూ ప్రయాణానికి కావలసిన వారంటు రాసిచ్చాడు, ఆ సరికే తమ లగేజితో అక్కడ సిద్ధంగా వున్న మరో ఇద్దరు కానిస్టేబుల్స్ మనోహర్, నాయుడులతో బాటూ నారాయణ ఆటోలో బస్టాండుకు బయలుదేరాడు.

గ్రూప్ థియేటర్స్ జంక్షన్ వద్ద ఆటో మలుపు తీసుకుంటుండగా, త్రిబుల్ రైడింగ్‌లో వేగంగా వెళ్తున్న మోటర్ బైక్‌పై వున్న ముగ్గురు స్టూడెంటు కుర్రాళ్లు నారాయణ కళ్లపడ్డారు. వారిలో చివరిగా కూర్చున్న జీన్స్‌ప్యాంటు కుర్రవాడిని చూసి నారాయణకు పై ప్రాణాలు పైనే పోయాయి. ఆ ఇరవై ఏళ్ల అబ్బాయి మరెవరో కాదు. నారాయణ చిన్న కొడుకు రాజేషే. ఆ బైకు వెళ్తున్న వేగానికి నారాయణ గుండెలు అవిసిపోయాయి. నడుపుతున్నది రాజేష్ ఫ్రెండు సతీష్ అనే పోరంబోకు వెధవ. ఇద్దరూ ప్రైవేట్ కాలేజీలో ఇంజనీరింగ్ చదువుతున్నారు.

నారాయణ చిన్న కొడుకు రాజేష్ తనకు లేటెస్ట్ మోడల్లో వచ్చిన మోటర్‌బైకు కొనివ్వమని రెండు నెలల నుండీ నారాయణను పోరుతూ వున్నాడు. తనకు లీవు ఎన్‌క్యాష్‌మెంటు జరిగినపుడు బైకు కొనివ్వగలనని నారాయణ చెప్పినా, వినిపించుకోవడం లేదు రాజేష్. 'కొడుక్కు బండి కొనివ్వనిదే మేలైంది' అనుకున్నాడు నారాయణ.

"ఈ ఇంజనీరింగ్ చదువు వద్దంటే నారాయణ భార్య ఆదిలక్ష్మి వినిపించుకోక పట్టుబట్టి మరీ నారాయణతో డొనేషన్ కట్టించి రాజేష్‌ను బిటెక్‌లో చేరేలా చేసింది. తన ప్రావిడెంటు ఫండు నుండి లోను తీసుకొని సంవత్సరానికి లక్ష రూపాయల డొనేషన్ కట్టే షరతుతో నారాయణ తిరుపతిలోని ఓ ప్రైవేట్ ఇంజనీరింగ్ కళాశాలలో రాజేష్‌ను చేర్చాడు. మరుసటి ఏడాది ఫీజు కోసం ఓ మార్వాడీ దగ్గర నెలకు మూడు రూపాయల వడ్డీతో అప్పు తెచ్చాడు నారాయణ. ఇంతింత ఫీజులు కట్టి చదివిస్తున్నా, తండ్రి కష్టాన్ని ఎంతమాత్రం పట్టించుకోని రాజేష్, ఫ్రెండ్స్‌తో సినిమాలు, షికార్లని తిరుగుతూ సెకండ్ ఇయర్లో రెండు సబ్జెక్టుల్లో తప్పాడు.

నారాయణ పెద్ద కొడుకు కృష్ణమూర్తికి బి.యస్సీ., బి.ఇడీ మంచి మార్కులతో పాసైనా, డీయస్సీలో టీచరుద్యోగం రాలేదు. తిరుపతిలోనే ఓ ప్రైవేట్ స్కూల్లో నెలకు ఆరువేల జీతానికి టీచరుగా చేరాడు కృష్ణమూర్తి.

నారాయణ పెద్ద కూతురు సునందకు లక్ష రూపాలు కట్నమిచ్చి మూడేళ్ల క్రితం నెల్లూరులో జూనియర్ అసిస్టెంటుగా కలెక్టరాఫీసులో పనిచేస్తున్న ఆనంద్‌తో వివాహం జరిపించాడు. మొదట అమ్మాయి పుట్టడంతో అత్తగారు సునందను చిన్న చూపు చూస్తూ ఆరళ్లు పెట్టసాగింది. దానికి తోడు రెండేళ్ల తరువాత మళ్లీ కూతురు పుట్టడంతో పెద్ద యాగీ చేసి లక్షైనా అదనపు కట్నం తెమ్మని సునందను పుట్టింటికి పంపివేసింది. మూడు నెలల తరువాత నారాయణ

ఎలాగో ఒక యాభైవేలు సమకూర్చి కూతురిని అత్తగారింట్లో వదలి, మనవరాలు హరిణిని తామే కొన్నాళ్లు పాటు పెంచుతామని ఆనంద్ తల్లికి సర్దిచెప్పాడు. నోట్లో నాలుకలేని ఆనంద్ తల్లి నెదిరించలేకపోవడం, సునంద మెతకదనం అత్తగారి ఆగడాలనాపలేకపోతున్నాయి.

ఇక నారాయణ రెండో కూతురు గిరిజ రెండేళ్లక్రితం బి.ఏ. పాసైంది. టీవీలో వచ్చే సీరియల్సూ సినిమాలు వదలకుండా చూడడం, తల్లికేమాత్రం ఇంటిపనిలో సహాయపడకపోవడం ఆ అమ్మాయి హాబీలు. ఏ బ్యాంకు పరీక్షలకో కష్టపడి ప్రిపేరవ్వమని నారాయణ ఇచ్చే సలహాలను ఆమె తలకెక్కించుకోదు. ఇక నారాయణకున్న ఆశాకిరణమంతా అతడి చిన్న కూతురు ప్రశాంతినే. బి.యస్సీ ఫస్ట్ క్లాసులో ఆ ఏడాదే పాసైన ఆ అమ్మాయి ఏదో కంప్యూటరు కోర్సు సాయంత్రం పూట చదువుతూనే, తన ఫీజుల కోసం ఓ స్కూల్లో సైన్సు టీచరుగా పనిచేస్తూ వుంటుంది. తల్లికి ఇంటి పనుల్లో తీరిక వేళల్లో సహాయపడడంతో బాటూ ఇంటికి కావలసిన సరుకులు, కూరగాయలు తెచ్చి పెడ్తూ వుంటుంది. కొంతలో కొంత బాధ్యత తెలిసిన అమ్మాయి తమ కుటుంబంలో ప్రశాంతే అని నారాయణ అభిప్రాయం.

బస్టాండులో వారు వెళ్ళేసరికి అనంతపురం వెళ్లేందుకు ఆఖరు బస్సు సిద్ధంగా వుంది. ఆ బస్సు ఆఖరి సీట్లో ఇద్దరు కూర్చునేందుకు స్థలం వుంది అంతే. ముందుగా బస్సు ఎక్కిన నాయుడు, మనోహర్ ఆ స్థలాన్ని ఆక్రమించారు.

"దూరప్రయాణం, నిలబడి రాలేవు. మరో అర్ధగంటలో తిరుపతి నుండి అనంతపురం వెళ్లే పాసింజరు స్టేషన్లో వుంటుంది. టికెట్టు యాభై రూపాయలకు మించదు. నా మాట విని వెంటనే రేల్వేస్టేషన్‌కు వెళ్లి ఆ రెలైక్కేయి. పొద్దున్నే ఎస్పీ ఆఫీసులో కలుసుకుంటాము" తాపీగా శలవిచ్చాడు నాయుడు.

చేసేది లేక నారాయణ వుసూరుమని స్టేషన్ బాటపట్టాడు. అతని మనసంతా బైక్లో వేగంగా వెళ్తూ వున్న చిన్న కొడుకు ఎలా వున్నాడో అనే వుంది. కొడుక్కు ఫోన్ చేస్తే, మొబైల్ స్విచ్‌డాఫ్ అని వస్తూ వుంది.

రైలు ప్లాట్‌ఫామ్‌పై సిద్ధంగా వుంది. జనరల్ బోగీ కిటకిటలాడుతూ వుంది. ఎక్కడా సీట్లు ఖాళీ లేవు. నిలబడేందుకు కూడా జాగా లేదు. నారాయణ ఎలాగో ఒక చోట నిలబడ్డాడు.

ట్రైను పీలేరు దాటాక రద్దీ కొంచెం తగ్గింది. కానీ నారాయణకు మాత్రం కూర్చునేందుకు సీటు దొరకలేదు. బాత్రుంల వద్ద కొద్దిసేపు కింద కూర్చున్నాడు. కానీ ఆ తొక్కిడిలో వుండబుద్ధి కాకుండా ఆ బోగీలోనే అటూ ఇటూ తిరుగుతూ సీటేమైనా ఖాళీఔతుందా అని చూస్తున్నాడు.

రైలు వాయల్పాడు దాటాక ఖద్దరు చొక్కా, పంచెకట్టులో వున్న ఓ యాభై ఐదేళ్ల పెద్దాయన నారాయణను పిలిచి, "నేను వచ్చే స్టేషన్లో దిగిపోతున్నాను. మీరు కూర్చుందురుగానీ, ఇందాకట్నుండీ చూస్తున్నాను. మీతో ఇది వరకు ఎక్కడో మాట్లాడాను. ఎక్కడది"? అన్నాడు.

నారాయణకు ఆ ఖద్దరు చొక్కా వ్యక్తితో గల పూర్వ పరిచయం గుర్తుకురాలేదు. కాసేపు ఆ పెద్దాయన నారాయణ ఎక్కడ వున్నదీ, అతని పిల్లలు ఏం చేస్తున్నారు లాంటి విషయాలన్నీ కనుక్కొన్నాడు.

ఇంతలో ట్రైను స్టేషన్లో ఆగింది. ఆ వ్యక్తి లేవగానే నారాయణ గబ్బుక్కున ఆ సీట్లో కూర్చున్నాడు. ఆ పెద్దాయన వెళ్తూ వెళ్తూ నారాయణ ఫోన్ నంబరు అడిగి తీసుకున్నాడు.

ట్రైను ఉదయం గంట ఆలస్యంగా అనంతపురం చేరింది. నారాయణ ఆదరాబాదరా వెయిటింగ్ రూంలోనే స్నానాదికాలు ముగించుకొని, స్టేషను క్యాంటిన్‌లోనే టిఫిన్ చేసి ఆటోలో ఎస్పీ ఆఫీసుకు చేరుకున్నాడు.

"ఏమయ్యా, ఉదయం ఎనిమిది గంటలకు రమ్మంటే ఇప్పుడా రావడం? బుద్ధుండక్కర్లా, మీ వాళ్ళు ఎప్పుడో రిపోర్టు చేసి డ్యూటీలకు వెళ్లిపోయారు" అని నసుక్కుంటూ ఒక హెడ్‌కానిస్టేబులు సీ.ఎం. సభ జరిగే ప్రాంగణం సమీపంలోని పార్కింగ్‌లాట్ దగ్గర నారాయణకు డ్యూటీ అలాట్ చేశాడు.

సభకు వచ్చే వాహనాలను రోడ్డుపై అడ్డదిడ్డంగా కాక, పార్కింగ్ లాట్లో పార్క్ చేయించడం, అక్కడ ట్రాఫిక్‌ను నియంత్రించడం నారాయణ పని. అతనికి సహాయంగా మరొక కానిస్టేబుల్ కూడా వున్నాడు.

సి.ఎం. సభకు వెహికల్స్‌లో వచ్చేవాళ్లు, ఎంఎల్ఏ లూ, మంత్రులు, వ్యాపారస్థులు, రాజకీయ వేత్తలు, ఇంకా బడాబాబులు, వాళ్లు నారాయణ చెప్పినట్లు వినకపోతే, వాళ్లను

బతిమాలి, బామాలి పార్కింగ్ ప్లేస్‌లోనే వాహనాలను పార్క్ చేయిస్తున్నాడు నారాయణ. అప్పటికీ కొందరు సభకు వెళ్లే ఆత్రుతలో వాహనాలను తమ ఇష్టానుసారం అడ్డదిడ్డంగా రోడ్డుపై పార్క్ చేసి నారాయణ మాటలు వినిపించుకోకుండా వెళ్లిపోయారు.

నారాయణకు జ్వరంతో నీరసంగానూ, జలుబు, దగ్గుతో ఊపిరాడకుండానూ వుంది. టాబ్లెట్ వేసుకుందామన్నా నీళ్లు లేకుండా వున్నాయి. వాటర్ బాటిల్ తెచ్చుకుందామని మరొక కానిస్టేబుల్‌కు చెప్పి దగ్గర్లోని కిరాణా కొట్టుకు వెళ్ళాడు.

ఆ కొట్టులో రద్దీగా వుండడంతో, నారాయణకు కొట్టువాడు నీళ్లసీసా అందించే సరికి ఐదు నిమిషాలు పట్టింది. ఈలోగా షాపులో వస్తున్న ఏదో టీవీ ఛానెల్ న్యూస్ చూస్తూ వున్నాడు నారాయణ.

"తిరుపతి బైపాస్‌రోడ్‌లో నిన్న రాత్రి జరిగిన ప్రమాదంలో సతీష్ అనే విద్యార్థి తీవ్రంగా గాయపడ్డాడు. మరో ఇద్దరి పరిస్థితి ఆందోళనకరంగా వుంది" అని వార్త చదువుతూ వున్నాడు న్యూస్‌రీడర్.

నారాయణ పై ప్రాణాలు పైనే పోయాయి. "తాను నిన్న అనుకున్నదంతా అయ్యింది. ఆ సతీష్‌గాడి బైక్లో ఎక్కొద్దని తాను ఎన్నిసార్లు చెప్పినా కొడుకు రాజేష్ పట్టించుకోడు. వాడికి ఏమైందో ఏమో" అని దడదడా కొట్టుకుంటున్న గుండెలతో కొడుకు రాజేష్ సెల్‌నంబరుకు ఫోన్ చేశాడు. కానీ ఆ ఫోన్ స్విఛాఫ్‌లో వుందింకా.

ఆత్రుతతో పెద్దవాడు కృష్ణమూర్తికి ఫోన్ చేశాడు. "రాజేష్ నిన్న రాత్రి ఇంటికి రాలేదు. ఎవరైనా ఫ్రెండ్ ఇంట్లో వున్నాడనుకున్నాం" అన్నాడు పెద్ద కొడుకు.

"టీవీ న్యూస్ చూడు..." అని నారాయణ యాక్సిడెంటు విషయం కొడుక్కు చెప్పాడు. "సరే, నేను ఆసుపత్రికి వెళ్లి ఎంక్వేరీ చేసి వస్తాను" అని తండ్రికి ధైర్యం చెప్పాడు కృష్ణమూర్తి.

నారాయణ టాబ్లెట్ వేసుకోవాలన్నది కూడా మరచిపోయి అచేతనంగా పార్కింగ్ లాట్ వైపు నడిచాడు.

ఈలోగా రౌండ్స్‌కు వచ్చిన సి.ఐ. మరో కానిస్టేబుల్‌పై చిందులు తొక్కుతూ వున్నాడు. నారాయణను చూసి, అతడిపై విరుచుకుపడ్డాడు.

"డ్యూటీ చెయ్యకుండా ఎక్కడ పెత్తనాలు చేస్తున్నారయ్యా? బుద్ధుందక్కర్లా, రోడ్డుపైన అడ్డంగా ఈ వెహికల్సేమీ, ఆ మాత్రం డ్రైవర్లకు చెప్పి పార్కింగ్లో పెట్టించలేవా? ఇక్కడ ట్రాఫిక్ జామైతే ఎవడిది బాధ్యత?..... " అని రంకెలు వేస్తున్నాడు సి.ఐ.

వాహనాల యజమానులు తమ మాటలు పట్టించుకోవడం లేదని నారాయణ ఎంత చెప్పినా సి.ఐ. పట్టించుకోవడం లేదు. మరోసారి ఇలా జరిగితే నారాయణను సస్పెండ్ చేయిస్తానని వార్నింగ్ ఇచ్చి కదిలాడు సి.ఐ. నారాయణకు నిస్సత్తువగా వుంది. మాత్ర వేసుకొని మౌనంగా డ్యూటీ చేయసాగాడు.

"ఈలోగా పెద్ద కూతురు సునంద నుండి ఫోన్ వచ్చిందతనికి.

"నాన్న, రానూ రానూ మా అత్తగారి సాధింపులు ఎక్కువైపోయాయి. కట్నం చాల్లేదనీ, ఇద్దరూ అమ్మాయిలే పుట్టారనీ, అదేదో నా నేరమైనట్లుగా నన్ను కాల్చుకొని తింటూ వుంది. ఇంట్లో బండెడు చాకిరీ చేసినా ఆమెకు తృప్తి లేదు. నాకు నాలుగు రోజుల నుండి జ్వరం, ఒళ్లు నొప్పులు. నువ్విక్కడికి వచ్చి నన్ను ఒక నెల రోజులు మనింటికి తీసుకువెళ్లు. లేకపోతే నేనేమైపోతానో నాకే తెలియదు" అని దిగాలుగా చెప్పింది సునంద.

"అలాగేనమ్మా, వీలు చూసుకొని ఒక వారం రోజుల్లో వస్తాను" అని నారాయణ ఆ అమ్మాయికి ధైర్యం చెప్పాడు. తాను పోలీసు డిపార్ట్‌మెంట్లో వున్నా, కూతురికి వరకట్నం వేధింపులు వస్తూ వుంటే ఏమీ చేయలేకుండా వున్నాడు. కడుపు చించుకుంటే కాళ్లపై పడుతుంది. "ముళ్లకంపపై గుడ్డ పడినట్లుంది కూతురి పరిస్థితి. గుడ్డ చిరక్కుండా జాగ్రత్తగా తీసినట్లు, ఆమె కాపురం నిలబెట్టాలి" అనుకున్నాడు. సభాస్థలి దారిలో జనాలు తండోపతండాలుగా సభకు వెళ్తూ వున్నారు. అప్పటికే ముఖ్యమంత్రి రాక గంటన్నర ఆలస్యమైంది. చూస్తుండగానే హెలికాప్టర్ శబ్దం వినవచ్చింది. మరో పావుగంటలో సి.ఎం. సభావేదిక వద్దకు చేరుకున్నాడు. పెద్దగా చప్పట్లు, టపాకాయలు పేల్చిన చప్పుడు, డప్పులమోత వినవచ్చాయి. సభ ప్రారంభమైనట్లు గుర్తుగా వుపన్యాసాలు వినవస్తున్నాయి.

"కృష్ణమూర్తికి మళ్లీ ఫోన్ చేశాడు నారాయణ. చిన్న

కొడుకుకేం జరిగిందో ఏమో. ఎందుకు కృష్ణమూర్తి ఇంకా తనకు ఫోన్ చేయలేదు?" అనుకున్నాడు, ఆందోళనగా.

"ముత్యాలరెడ్డిపల్లె పోలీస్‌స్టేషన్‌కు వెళ్లాను. అక్కడ ఏ బైక్ యాక్సిడెంట్ కేసూ నమోదు కాలేదట. ట్రాఫిక్ పోలీస్ స్టేషన్‌కు వెళ్తూ వున్నాను" అన్నాడు కొడుకు. "వాడు చిన్నగా తన సైకిల్లో ఎప్పటికి అక్కడకు వెళ్లేది? ఎపుడు వివరాలు తెలుసుకునేది" అనుకున్నాడు నారాయణ. తన ఫోన్లో వెతికితే ట్రాఫిక్ పోలీస్‌స్టేషన్లో పనిచేసే ఒక కానిస్టేబుల్ నెంబరు దొరికింది. యాకూబ్ అనే ఆ పీ.సీ.కి ఆత్రుతతో ఫోన్ చేశాడు నారాయణ.

"ఆ, ఎవరూ, నారాయణా, ఆ, సరే, నేనిప్పుడు ఇంటినుండి డ్యూటీకి బయలుదేరాను. రాత్రి డ్యూటీలో లేను. స్టేషన్‌కు వెళ్లి డీటైల్స్ కనుక్కొని నీకు ఫోన్ చేస్తాను" అన్నాడు యాకూబ్.

మైకులో వుపన్యాసాల హోరు శృతిమించుతోంది. ఒక్కొక్క వక్తా మాట్లాడగానే సభికులు చప్పట్లతో సభాస్థలి హోరెత్తిస్తూ వున్నారు. నారాయణ, మరో కానిస్టేబుల్‌తో కలిసి, వాహనాలను నియంత్రించడంలో పడిపోయాడు. మరోసారి యాకూబ్‌కు ఫోన్ చేశాడు కానీ సిగ్నల్ అందలేదు.

చిన్న కొడుకు.. ఏమైపోయాడో తెలియకపోయినా పెద్దకూతురి పరిస్థితి దయనీయంగా వున్నా, అవేవీ పట్టించుకోకుండా నారాయణ నిర్వికారంగా డ్యూటీ చేస్తూ వున్నాడు. మనసులోని అలజడి, జ్వరం వల్ల కలిగిన నీరసం... ఇవేవీ అతడిని కార్యోన్ముఖుడు కాకుండా తప్పించలేదు. గీతోపదేశం పొందిన పార్థుడిలానో, జ్ఞానసాకారం కలిగిన బుద్ధ భగవానుడిలాగానో కేవలం కర్తవ్యం పై దృష్టి పెట్టి నారాయణ డ్యూటీ చేయడంలో ట్రాఫిక్‌కు ఇబ్బంది కలగకుండా, పార్కింగ్ లాట్లో వాహనాల సంఖ్య తరుగుతూ వచ్చింది.

ఇంతలో అటుగా వచ్చిన సి.ఐ. "ఏమయ్యా మీటింగ్ పూర్తయి పావుగంట దాటింది. స్టేడియం వద్ద పోలీసులకు పెరుగన్నం, వాటర్ బాటిల్స్ ఇస్తున్నారు. మీరింకా తెచ్చుకోలేదా?" అన్నాడు నారాయణతో.

"ఇవిగో, ఈ కొన్ని వెహికల్స్ వెళ్లిపోగానే అక్కడికి వెళ్తాను సార్" అని నారాయణ తదేకంగా డ్యూటీ చేయసాగాడు. అతనితో వున్న మరొక కానిస్టేబుల్ వెళ్లి ఫుడ్ పాకెట్ తెచ్చుకున్నాడు. అతడు భోం చేశాక, "సార్, నేను డ్యూటీ చేస్తాను – మళ్ళీ పాకెట్స్ ఐపోతాయి. వెంటనే వెళ్లి భోజనం తెచ్చుకోండి" అన్నాడు నారాయణతో.

నిజంగానే నారాయణ స్టేడియం దగ్గరకు వెళ్లేసరికి భోజనం పాకెట్లు ఐపోయాయి. కొందరు పోలీసులు రెండు పాకెట్లు కూడా తీసుకోవడంతో తెచ్చిన పాకెట్లు చాలలేదు. ఉసూరుమని నారాయణ మళ్లీ స్టాండు దగ్గరకు నడిచాడు. నిజానికతనికీ పరిస్థితి కొత్తకాదు. డ్యూటీ హడావిడిలో పడి ఎన్నో రోజులు భోజనం లేకుండానే వుండిపోయాడు. నక్సలైట్ల సెర్చ్ ఆపరేషన్లో అడవుల్లోకి వెళ్ళినప్పుడు నీళ్ళు కూడా దొరికేవి కాదు. ఆకలిదప్పులు మరచి కర్తవ్యదీక్షతో వుద్యోగం చేయడం అతనికి కొత్తేమీ కాదు.

నారాయణ జేబులో సెల్ మోగింది. యాకూబ్ మాట్లాడుతూ వున్నాడు. "సార్ సి.ఐ. గారితో మాట్లాడండి" అని ఫోను సి.ఐ.కిచ్చాడు యాకూబ్, నారాయణ గుండెలు వేగంగా కొట్టుకున్నాయి.

"ఎవరు నారాయణనా, అదేమిటయ్యా, నిన్న మీ వాడు ఎవరో ఫ్రెండుతో అంత స్పీడుగా బైక్లో వెళ్తున్నాడు. గాంధీరోడ్డు కూడల్లో నేను వాళ్లను ఆపి, కేసు రాయబోయి, మీవాడిని చూసి ఆగిపోయాను. జీతాలరోజు అప్పుడప్పుడు నీకోసం స్టేషన్‌కు వస్తూ వుంటాడు కదా మీ అబ్బాయి నాకు తెలుసులే, మీ వాడిని దిగమని ఫ్రెండ్సును బైక్లో వెళ్లనిచ్చాను. కేసు రాసినా బావుండేది. ఆ బైకుకే యాక్సిడెంట్ అయ్యిందటగా" అన్నాడు సీఐ. నారాయణ మనసు తేలిక పడింది. అంతలో మరో ఫోను కృష్ణమూర్తి సెల్‌ఫోన్లోంచి నారాయణ చిన్న కొడుకు రాజేష్ మాట్లాడాడు.

"నాన్నా, నాకేం కాలేదు. మా ఫ్రెండు సతీష్‌కు యాక్సిడెంటైంది. వాడినీ, మరో ఫ్రెండ్ కుమార్‌నీ హాస్పిటల్లో చేర్చారు. రాత్రంతా వాళ్లతోనే వున్నాను. ఛార్జింగ్ లేకపోవడంతో నా ఫోన్ స్విఛాఫ్ అయ్యింది" అన్నాడు రాజేష్. బైక్లో వెళ్తున్న సతీష్, కుమార్‌లతో బాటూ వారికెదురుగా వేగంగా బైక్లో వచ్చిన మరొక వ్యక్తికీ యాక్సిడెంటైందట. ఇప్పుడు వారి పరిస్థితి కొంత మెరుగ్గానే వుందన్నాడు రాజేష్.

నారాయణ గుండెల్లోంచి దిగులు దూదిపింజలా

## కవిత

# మొండిపట్టు

హిందీ మూలం : స్వాతి ఠాకూర్
అనువాదం : డా॥ వెన్నా వల్లభరావు

లోపల ఒక మొండిపట్టు
వాళ్ళ ఆలోచనాధోరణిని మార్చాలని
పుట్టుకతోనే వాళ్ళ మెదళ్ళలో నాటే
స్త్రీ అంటే కేవలం
ఒక భార్య, ఒక తల్లి అనే భావాల నుంచి
అసత్యాలనుంచి, బాధ్యతల నుంచి
వాళ్ళని దూరం చెయ్యాలని నా పట్టుదల
పతిని పరమేశ్వరుడని చెప్పే
సంప్రదాయాల నుంచి బైట పడేవేసి
తామూ మనుషులమేనని
స్వయంగా పరిపూర్ణులమని,
తమ భర్తలంత పరిపూర్ణులమని
విశ్వసింపజెయ్యాలని నా ఆరాటం
కాని
ఎంత ప్రయత్నించినా
వాళ్ళు బయట పడాలనుకోవటం లేదే!



పరిపూర్ణ వ్యక్తులుగా మారటానికి సిద్ధంగా లేరే !
అంతేకాదు
నా మొండిపట్టుని
పెడత్రోవ అంటుంది నా సమాజం
అయినా
నా మొడిపట్టు అలాగే ఉంది
పెడత్రోవపట్టిన సమాజాన్ని మార్చాలని....

◆

---

తేలిపోయింది. ఇంతలో బస్టాండు దగ్గరకు రమ్మని అతని తోటి కానిస్టేబుల్ మనోహర్ ఫోన్ చేశాడు. స్టేడియంలోనే మనోహర్, నాయుడు డ్యూటీ చేశారట.

నారాయణ సమీపంలోని ఓ హోటల్లో టిఫిన్ చేసి, జ్వరం మాత్ర వేసుకొని ఆటోలో బస్టాండుకు చేరుకున్నాడు. అక్కడ తిరుపతికి వెళ్లే బస్సు రెడీగా వుంది. నాయుడు అతనికి సీటు పెట్టి వున్నాడు. నారాయణ సీట్లో కూర్చోగానే అతని జేబులోని సెల్‌ఫోన్ మోగింది. ఈ సారి అతని చిన్న కూతురు ప్రశాంతి మాట్లాడింది.

"నాన్న, హరిణిని నేను డాక్టరు దగ్గరకు తీసుకువెళ్లాను ఇందాక ఇంజక్షన్ వేశాక దానికి జ్వరం తగ్గింది, మీరేమీ దిగులుపడొద్దు"అన్నదామె.

నారాయణ మనసు మళ్లీ తేలికపడింది. బస్సు హైవేపై వేగంగా వెళుతోంది. ఆకాశం మేఘావృతమై కొద్దిసేపట్లోనే చినుకులు ప్రారంభమయ్యాయి. దూరంలోని కొండల చుట్టూ మేఘాలు దూదిపింజల్లా కనిపిస్తున్నాయి. మళ్లీ నారాయణ ఫోన్ మోగింది.

"నిన్న రాత్రి నేను ట్రైన్లో మీకు సీటిచ్చాను చూడండి. గుర్తొచ్చానా? నాపేరు రాఘవయ్య లెండి" అని వినిపించింది. నారాయణకు రైలు ప్రయాణంలో తాను ఖద్దరు చొక్కా వ్యక్తికి తన ఫోన్ నెంబరివ్వడం గుర్తొచ్చింది.

"చెప్పండి రాఘవయ్యగారూ" అన్నాడు నారాయణ

"నేను మీకు గుర్తులేను కానీ, పదేళ్ల క్రితం మేము తిరుపతిలో వున్నప్పుడు ఫోర్త్‌క్లాస్ చదువుతున్న మా అబ్బాయి మిస్సింగ్ కేసులో మీరు మాకు చాలా సాయపడ్డారు. ఎంతో శ్రమ, రిస్క్ తీసుకొని మా అబ్బాయిని కిడ్నాపర్ల నుండీ రక్షించారు. మీ మేలు మరచిపోలేను. ఇప్పుడు మేం నెల్లూరులో వున్నాం. మీ అమ్మాయి సునంద అత్తగారు రమాదేవి నాకు అక్కయ్య వరుస. సునంద మీ కూతురని నాకివాళ ఉదయమే మా అక్క ఇంటికి వెళ్ళినప్పుడు తెలిసింది. మా అక్కయ్య స్వభావం నాకు తెలుసు. కోడలిని రాచిరంపాన పెడ్తుంది. ఈ రోజు ఉదయం మా అక్కయ్యకు గట్టి వార్నింగిచ్చి వచ్చా. మీ అమ్మాయి ఇక మా అమ్మాయితో సమానం. మా అక్కకు నా మాటల మీద ఎంతో గురి. ఇక మీ అమ్మాయిపై ఈగ వాలనివ్వను." అన్నాడు రాఘవయ్య. అతని మాటలు నారాయణకు పన్నీటి జల్లులా తోచింది. 'థ్యాంక్యూ రాఘవయ్యగారూ' అన్నాడు గద్గదికస్వరంతో.

◆

విశ్లేషణ

# సాహిత్య, సాంస్కృతిక యోధుల సంక్షిప్త జీవిత చిత్రణ.






- నందనోదయ
9295074595

తెలుగు సాహిత్యంలో ఆధునిక యుగం కందుకూరితో మొదలైంది. అప్పటి నుంచి నేటివరకూ సాహిత్య సాంస్కృతిక రంగాలలో కొత్త కొత్త మార్గాలు నిర్మించిన వాళ్ళెవ్వరు? కొన్నెత్తురు పారించిన వాళ్ళెవ్వరు? ధృవతారలుగా నిలబడే వాళ్ళెవ్వరు? ప్రచండ భాస్కరులై ప్రజ్వలించిన వాళ్ళెవ్వరు? నవసమాజం కోసం- మానవసమాజం కోసం తపించి తమను తాము సమిధలుగా అర్పించుకున్న యోధులెవరు? నేటి యువతరం తెలుసుకోవాలి. కొంత తెలిసిన వాళ్ళు మరికొంత తెలుసుకొనాలి. మళ్ళీ మళ్ళీ మననం చేసుకోవాలి. తెలుసుకున్న నేటితరం వాళ్ళ కృషికి బదులుగా ఏమివ్వాలి? మొదట నివాళి అర్పించాలి. ఆ నివాళి ఎలా ఇవ్వాలి? వాళ్ళ నిర్గమనానికి శోకిస్తూనా? వాళ్ళ తెగువనీ వాళ్ళ త్యాగాన్నీ శ్లోకిస్తూనా? వాళ్ళని స్ఫూర్తిగా తీసుకోవాలి తప్ప కృతజ్ఞత తెలిపి చేతులు కడిగేసుకోవడం సరికాదు అనుకొంటే అది అశోక నివాళి అవ్వాలి. అదే సింగంపల్లి అశోక్‌కుమార్ మనకి అందించిన 'అశోకనివాళి'.

అశోక నివాళి రెండు భాగాలుగా వెలువడిన నూరు మంది సాహిత్య, సాంస్కృతిక, సామాజిక యోధుల (కందుకూరి నుంచి కాశీపతి యాదాటి దాకా) సంక్షిప్త జీవిత చిత్రణ. సంక్షిప్త జీవిత చిత్రణ అయినా సమగ్ర జీవితాలను అందించిన రచన. ఇదొక తపస్సులాంటి కృషి. బృహత్తరమైన కృషి. ఎందుకంటే ఈ రచన పరిధి సుమారు 160-170 సంవత్సరాలు. ఇంత సుదీర్ఘ కాలానికి చెందిన తెలుగు సాహిత్య చరిత్రను తరిచి చూడాలి. ఈ కాలానికి చెందిన ఏఏ సాహితీవేత్తలు సమాజాన్ని పురోగమనంవైపు నడిపించారో, ఎవరు నూతన మార్గాలని నిర్మించి ఆటుపోట్లని సమర్థంగా ఎదుర్కొన్నారో, ఎన్నెన్ని ఎదురు దెబ్బలకోర్చారో బేరీజు వెయ్యగలగాలి. ఇది మామూలు విషయం కాదు. ఇదంతా ఒకెత్తయితే అటువంటి సాహితీవేత్తల జీవిత విశేషాలను పూర్తిగా తెలుసుకోవడం, వాళ్ళ నాడిని పట్టుకోవడం, ఒక్కోసారి వాళ్ళ శాఖాచంక్రమణాల్నీ సాహిత్య సమాజం మీద వాటి ప్రభావాన్ని సరిగా అంచనా వెయ్యడం మరో ఎత్తు. ఇంచుమించుగా ఇది అసాధ్యం. అటువంటి బృహత్తర కార్యాన్ని తలకెత్తుకొని నూటికి నూరుపాళ్ళూ కృతకృత్యుడయ్యాడు రచయిత అశోక్‌కుమార్. పైన చెప్పిన లక్షణాలన్నీ 'తూచా' తప్పకుండా 'అశోకనివాళి'లో అక్షరం అక్షరంలోనూ కనిపించేవే.

ప్రతిభా, సమర్థవంతమైన కృషీ చేసి ఉండి కూడా ఏ కారణాలవల్లో మరుగునపడిన లేదా విస్మరించబడిన వారి జీవనసాహిత్య విశేషాల్ని నేటితరానికి అందించడం ద్వారా సాహిత్య యోధుల చరిత్రలకు పూర్తి న్యాయం చెయ్యడమే కాకుండా సాహిత్య చరిత్రకు కూడా న్యాయం చేశాడు అశోక్‌కుమార్ ఈ క్రమంలో. అందుకే ఈ కృషి అనితరసాధ్యం అనిపించింది నాకు.

రచనా సంవిధానం వస్తువుకు అనుగుణంగానే వుంది. ప్రతి రచయిత జీవిత-సాహిత్య వివరాల్ని చెప్పేసి చేతులు దులిపేసుకోలేదు ఈ రచయిత. లోతైన విశ్లేషణ ఉంది ప్రతీ జీవిత చరిత్రలోనూ.

ప్రతీ అమర సాహితీ యోధుడి జీవిత చిత్రణ ఆయన ఛాయా చిత్రం/రేఖా చిత్రం దాని పక్కనే నాలుగు చిరుపాదాల 'శ్లోక నివాళి'తో మొదలవుతుంది. వెంటనే ఆ రచయిత/కవి రచనల నుంచి ప్రముఖమైన కొటేషన్ వుంటుంది. ఆ కొటేషన్‌లో ఆయన సాహిత్య/సామాజిక దృక్పథం ప్రస్ఫుటమవుతుంది. (ఇలా ఆయా రచయితల వ్యక్తిత్వానికి అద్దం పట్టేలా వుండే కొటేషన్‌ని ఎంపిక చెయ్యాలంటే ఆ రచయిత రచనలని కూలంకషంగా చదవవలసి ఉంటుంది. సాధారణ స్థాయిలో పరిశోధన చేసేవాళ్ళు చెయ్యగలిగిన పనికాదు ఇది). తరువాత రచయిత బాల్యం, సాహిత్య కృషి, సాధించిన 'విజయాలు' ఎదుర్కొన్న సవాళ్లు మొదలైన విశేషాలతో వాటితోబాటు ఆ రచయిత సంపూర్ణ గ్రంథాల వివరాలు (కొంతమంది విషయంలో సంపుటాల వివరాలు) ఇవ్వటం జరిగింది. ఏ సాధారణ అకడమిక్ పరిశోధకుడి నుంచో ఇటువంటి సమగ్ర సమాచారం ఆశించడం అత్యాశే అవుతుంది. వెంటనే నివాళి రచయిత అశోక్‌కుమార్ నుంచి సంక్షిప్త విశ్లేషణ లేదా అవసరమైతే నిశిత విమర్శ కన్పిస్తాయి. తరువాత ఆ రచయిత గురించి మరో ప్రముఖ సాహితీవేత్త అభిప్రాయం/అభినందనతో జీవిత చిత్రణ పూర్తవుతుంది. నూరు మంది జీవిత చిత్రణా ఇదే ప్రణాళికతో నడిచింది. పింగళి సూరన తన కళాపూర్ణోదయానికైనా ఇంతటి ప్రణాళిక వేసుకొన్నాడా అన్పిస్తుంది.

ఎంతటి ప్రముఖుడైనా తన దారి వదలేసి పతనం దిశగా ప్రయాణమైనప్పుడు అశోక్‌కుమార్ నీళ్ళు నమలలేదు. నిప్పులు జల్లుతూ నిశిత విమర్శ చేశాడు. చెలం కావచ్చు, గజ్జెల మల్లారెడ్డి కావచ్చు, రాంభట్ల కావచ్చు ఎవరైనా సరే. ఇది ఈ రచయిత వస్త్వాత్మక దృక్పథానికి అద్దంపడుతుంది.

"యుద్ధాల హనుమంతు" (సుద్దాల హనుమంతు) "అతివవాద" (గట్టీ స్త్రీ వాదం) లాంటి ప్రయోగాలు కోకొల్లలు ఈ సంపుటాలలో.

అలాగే నివాళి శ్లోకాల నడకా విరుపూ కూడా ఆహ్లాదంగానూ ఉత్తేజం రగిలించేవిగానూ ఉన్నాయి. మచ్చుకి అనల్పజీవి శీర్షికతో "రావిశాస్త్రి పెన్ను / నరుడి మూడోకన్ను / శ్రామిక వర్గ దోపిడిపై / గురిపెట్టిన గన్ను", అలాగే వట్టికోట ఆళ్వారుస్వామి గురించి "గట్టికోట ఆళ్వారు/ప్ర"జల పోరు" సెలయేరు/ ఉద్యమం సానబట్టిన / తెలంగాణ తల్వారు". ప్రతినివాళి "శ్లోకమూ" ఇలాగే సూటిగానూ సరళంగానూ సాగింది.

అశోక్‌కుమార్ ఇదే పుస్తకంలో ఒకచోట అంటాడు "కళాకారుడికి సందేశాలే కాని దేశాలు ఉండవు" అని ప్రాంతీయ అభిమానాలూ, ప్రాంతీయ బేధాలూ లేకుండా నూరుమందిని ఎంచుకున్నాడు ఈ రచయిత. ఈ నూరుమంది ఒక నూతన మార్గాన్ని నెలకొల్పిన వాళ్ళు కానీ లేదా ఒక నూతన జన స్వర్గాన్ని నిర్మించడానికి తమ తమ సౌఖ్యాన్నో, సంపదనో ఆఖరికి తమ జీవితాన్నో త్యాగం చేసినవాళ్ళు కాని అన్నది గమనించవలసిన విషయం. నివాళికి మరో అర్హత తెలుగుభాషలో సాహిత్య/కళాసృష్టి అన్నది స్పష్టం. కానీ మఖ్దూం మొహియుద్దీన్ ఎంపిక మాత్రం ఇందుకు అనుగుణంగా లేదు. ఈయన ఉర్దూలో మహాకవి. తెలుగు నేలకు చెందినవాడే కానీ తెలుగు హేలకు చెందినవాడు కాదు గదా. (భాష బేధం కూడా చూపించకూడదనుకొన్నాడేమో అశోక్‌కుమార్!) అలాగే కృష్ణశాస్త్రి జీవిత చిత్రణ లేకపోవడం మరింత ఆశ్చర్యకరమైన, అభ్యంతరకరమైన విషయం. It's a conspicuous omission. ఈ లోటు మినహాయిస్తే ఇలాంటి పుస్తకాలని A glowing Torch - For the Forward March" అనవచ్చు.

అశోక్‌కుమార్ డాక్టరేట్ అర్హతని ఏనాడో మించిపోయేడు తన శ్రీశ్రీ సాహిత్యనిధి సంకలనాల కూర్పుల ద్వారా. ఇప్పుడు తెలుగు సాహిత్యంలో డాక్టరేట్ చేయ్యాలనుకొనేవాళ్లకు ఒక అనఫీషియల్ గైడ్‌గా కూడా అర్హత సాధించాడు ఈ అశోక నివాళి రచన ద్వారా.

ఈ రెండు సంపుటాలలో మొత్తం నూరుమంది సాహిత్య యోధుల జీవిత చిత్రాలే కాదు, ఇంకో నూట ఇరవై మంది జీవనరేఖలు కూడా ఉన్నాయి 'ఫుల్‌నోట్స్' రూపంలో వాళ్ళ ఫొటోలతో సహా! ఏ తెలుగు చదువరీ అత్యాశగా కూడా ఆశించలేని కానుక ఇది.

ఈ "అశోకనివాళి" సంపుటాలు ఒక్కమాటలో చెప్పాలంటే "చదివేవి చదివించేవి" (ప్రతీ ఒకళ్ళూ చదివితీరాల్సినవే కాదు - ఎంతోమంది చేత చదివించి తీరాల్సినవి అని వాచ్యంగా చెప్పాలా?).



## కవిత

# మూలాలు

- బాల త్రిపుర సుందరతేజ
9908135077



ఎందరు మధులికలు ..
ఎందరు స్వప్నికలు..
ప్రేమించలేదని
అమ్మాయిల
గొంతులు కోయడంలో
ఆశ్చర్యమేముంది ..
ఉన్మాదులకు
ప్రేరణనిచ్చే ఘటనలు ఎన్నో
చరిత్రలో నిలిచి ఉన్నవిగా
మహానుభావులైన వారే
నీతినియమాలు
విడనాడి కుకార్యాలు
చేసిన వైనం
అల్పమానవుల
అకృత్యాలకు
దారితీస్తోందా..?

ప్రేమను కోరుతూ
దరిచేరిన యువతికి
ముక్కు చెవులు కోసిన వైఖరి
రావణునిలో క్రోధాగ్ని
జ్వాలలను రగిల్చిందా ..
ఒక అహంకారపు చర్య
మరో అహంభావపు
ప్రతిచర్యను ప్రేరేపించిందా ?
సీతాపహరణానికి
కారణమయ్యిందా ?
పురుషాధిక్య భావజాలపు
వికృతమైన ధోరణిలో
ఒక స్త్రీ గాయలపాలై రక్తాన్ని
చిందిస్తే ..
ఒక స్త్రీ నిందలపాలై కన్నీరు
కార్చిందా ..!?
అడిగినందుకు ఒకరికి
శారీరకవేదనని కలిగిస్తే ..
మరొకరికి మనోరోధనను
మిగిల్చిందా !?

దానవుని మించిన దురహంకారంతో
విచక్షణ మరిచి..
కనివిని ఎరుగని బలగర్వంతో
సభామర్యాదను విస్మరించి..
దౌర్జన్యపూరితంగా
ముగ్గురు రాకుమార్తెలను
ఒక అసమర్ధుడికి కట్టబెట్టి ..
కళకళలాడే శుభదినాల కోసం
కోటి ఆశలతో ఎదురుచూసే
ఆ క్షత్రియకన్యల
పచ్చని జీవితాలను
నశింపజేసిన భీష్ముడు
మహాభారత పితామహుడై
ధర్మసందేశాలిచ్చిన తీరు
ఆడపిల్లలను
ఆటవస్తువులుగా మార్చిందా ?
యువభారతానికి తప్పుడు
సంకేతాలనిచ్చిందా ?
మాతృహృదయంలోని
ఆవేదనను అర్ధం చేసుకోలేక
కన్నతల్లికే శాపాలు పెట్టి..
బలహీనతలు జయించలేక
జూదానికి బానిసై నిండుసభలో
భార్య గౌరవాన్ని తాకట్టుపెట్టిన
యుధిష్టరుడు ధర్మరాజై
కొనియడబడిన క్షణానే
స్త్రీలకి ఆత్మాభిమానం
లేని బానిసలుగా భావించే తత్వం
జాతి నరనరాల్లో
జీర్ణించుకుపోయిందా ..?
కారణజన్ములే
కారణభూతులయ్యారా ..?
దేశసంస్కృతిలో స్త్రీల దుస్థితిని
భాగం చేసారా ?

తమ మూలాల్లోని
దాగివున్న మలినాలను
తొలగించుకోనందుకు
భారతవాసులు మూల్యాన్ని
చెల్లించు కుంటున్నారా..
ఓ భారతావనీ !
అసురుల ఆటవికనీతిని
వీరోచితంగా అంతమొందించిన నీవు
ధర్మజ్ఞుల దుర్నీతిని కూడా
ప్రశ్నించి ఉంటే ..
కనీసం ఖండించి ఉంటే ..
ఈనాటి ఈ భద్రత లేని సమాజం
రూపుదిద్దుకొని ఉండేదికాదేమో ..
నీ పుత్రికల నెత్తుటిధారలలో
నిత్యం తడుస్తూ నీ దేశపు మట్టిరేణువులు
విలపిస్తూ ఉండేవి కావేమో..
లోపాలున్నది చట్టలలోనా ?
పౌరుల ఆలోచనల్లోనా ?
ప్రశ్నించవలసింది
న్యాయవ్యవస్థనా ?
వ్యక్తుల అంతరాత్మలనా ?
మార్పురావాల్సింది
చదువుల్లోనా ..?
మనుషుల మనస్తత్వాలలోనా ..?
మూలాలే మూలకారణమైనప్పుడు..
తరానికి తరానికి
భావాలు దిగజారుతున్నప్పుడు..
మహోన్నతమైన ఈ నాగరికతలో
అక్కడక్కడా పరుచుకున్న
అస్తవ్యస్తాలను
అన్వయించుకుంటున్నప్పుడు
మస్తిష్కాలు వికసించలేవు ..

అంతవరకూ
ఎందరు మధులికలో ..
ఎందరు స్వప్నికలో. ◆




# కథల బాటల్లో...

- మందరపు హైమవతి
9441062732

కథ కోసం కాలి నడక అని అనగానే మనసులో ఏదో కొత్తగా అనిపించింది. పిల్లల నుంచి పెద్దలవరకూ కథలంటే ఇష్టపడని వారెవరూ ఉండరు. లేకపోతే మరీ ఇంత ఇష్టమైతే గ్రంథాలయాలకు వెళ్ళి చదువుకొంటాము కానీ ఈ కథకోసం కాలినడక ఏమిటి? అనే కుతూహలం ఎక్కువై నిర్వాహకులను సంప్రదిస్తే గురజాడ జన్మించిన విజయనగరంలో మొదలై శ్రీకాకుళం కథా నిలయం వరకూ కాలినడక సాగుతుందని చెప్పారు.

నేను నడవగలనా అని భయం వేసింది. నడవగలిగినంతసేపు నడచి, తరువాత మానేద్దాం అనుకొన్నాను. ఆ ఉద్దేశంతో కథా యాత్రికుల బృందంలో అడుగు పెట్టాను. అలా సందేహంగా వేసిన అడుగు చివరకు శ్రీకాకుళం కథా నిలయంలో మోపి గమ్యస్థానం చేరాను. శ్రీకాకుళం కథా నిలయం చేరిన వెంటనే ఎవరెస్టు ఎక్కినంత ఆనందం. ఓ వింతైన సంతోష సంరంభం.

ఫిబ్రవరి 6 బుధవారం ఉదయం 6.30 గంటలకు విజయనగరంలో గురజాడ ఇంటి దగ్గర నుంచి ఈ కాలినడక ప్రారంభమైంది. ఈ సందర్భంగా ఆంధ్రప్రదేశ్ భాషా సాంస్కృతిక శాఖ సంచాలకులు డాక్టర్ డి.విజయ భాస్కర్ గురజాడ రచనల గురించి ఉపన్యసించారు. సంగీత కళాశాల ప్రిన్సిపాలు ద్వారం దుర్గా ప్రసాదరావు, డా॥ డివిజి శంకరరావు, డా॥ చాగంటి తులసి, ఇతర పుర ప్రముఖులు ఈ కాలినడకను ప్రారంభించారు. ఢిల్లీ నుంచి వచ్చిన డా॥ దాసరి అమరేంద్ర, బెంగుళూరు నుంచి వచ్చిన వివిన మూర్తి, బ్యాంకాక్ నుంచి వచ్చిన కల్యాణి, శ్రీకాకుళం నుంచి వచ్చిన అట్టాడ అప్పలనాయుడు ఈ బృందంతో తమ అడుగులు కలిపారు. గంటేడ గౌరునాయుడు, మందరపు హైమవతి, నల్లూరి రుక్మిణి, చీకటి దివాకర్, ఎస్.కె. బాబు, శాంతారావు, కె.తిరుమలరావు, జగన్నాధరావు, ఆర్కే నాయుడు, రమేష్, కామరాజు, నెల్లూరు మాస్టారు, డప్పు శ్రీనివాస్, రాము, ఈశ్వర్, సింగ్ ఈ కాలినడకలో పాల్గొన్నారు.

తొలిరోజు నడక సాగి సాగి కస్తూరిబా పాఠశాల చేరింది. అక్కడ ఉపాధ్యాయ బృందం విద్యార్థులనందరినీ సమావేశపరచింది. గురజాడ గురించి, దిద్దుబాటు కథ గురించి అట్టాడ అప్పలనాయుడు వివరించారు. కథకోసం కాలినడక ఉద్దేశాన్ని చీకటి దివాకర్ విశ్లేషించారు. గురజాడ ప్రాముఖ్యాన్ని, కథా కథనశైలిని తాళ్ళూరి కల్యాణి విశదీకరించారు. గురజాడలోని కవితాత్మను ఆవిష్కరించారు ఈ వ్యాస రచయిత్రి. ఇలా దారి పొడవునా విద్యార్థులతో కలసి సమావేశాలు, సంభాషణలు, చాలా సరదాగా గడచిపోయాయి. నాలుగు రోజులూ అద్భుతంగా, చిరస్మరణీయంగా. రామతీర్థం రణస్థలం, నెల్లిమర్ల, చిలకపాలెం, మురపాక... ఏ ఊరైతేనేం, ఏ పాఠశాల ఐతేనేం... మేము వెళ్ళినవన్నీ జిల్లా పరిషత్ పాఠశాలలే. విశాలమైన ఖాళీస్థలాలు.. పచ్చని చెట్ల ఒడిలో పొదరిళ్ళలా ఉన్నాయి. ఇక పిల్లలైతే ప్రతి ఒక్కరూ ఉత్సాహ కెరటాలు, ఉత్తేజ కేతనాలు.

మేం వెళ్ళిన ప్రతిచోటా సభలు ఏర్పాటు చేసినప్పుడు పిల్లల స్పందన చాలా బావుంది. ఒకచోట గిడుగు, గురజాడ వేషధారణలో పిల్లలు ముద్దు ముద్దుగా మాట్లాడుతూ– చదువంటే పాఠ్య పుస్తకాలకే పరిమితం కాదని, సాహిత్యంతోనూ పరిచయం ఉంటే విద్యార్థుల మనసులు వికసిస్తాయని చాటిచెప్పారు. మరొక చోట 'మా తెలుగు తల్లి'కి పాటకి నృత్యం చేశారు. ఇలా మేం వెళ్ళిన ప్రతి చోట గంట, గంటన్నర పాటు సాహిత్య, సాంస్కృతిక కార్యక్రమాలు సాగాయి. అన్నింటికన్నా పిల్లలకూ, మాకూ ఇష్టమైనది చివరలో పాట నేర్చుకోవడం. సమావేశాలు అయ్యాక శాంతారావు గారు 'పాట నేర్చుకొందామా' అని పిల్లల్ని అడగగానే వారు సంతోషంతో కేరింతలు కొట్టేవారు. అన్నింటికన్నా నాకు నచ్చినది మురపాక పాఠశాల. అక్కడ ఒక విద్యార్థిని దేశభక్తి గేయాన్ని అభినయించింది. ఆ స్కూలు ఆవరణ ఎంతో బాగుంది. అక్కడ కూర్చొని ఉండగా... నలుగురైదుగురు పిల్లలు వచ్చారు. శ్రీశ్రీ, గురజాడ, తిలక్‌ల కవితలు చెప్పాను. నేనూ కవిత్వం రాస్తానన్నాను. కొన్ని కవితలు వినిపించాను.

మనం సాధారణంగా పిల్లల్ని నిందిస్తాం, బాగా చదవరని, శ్రద్ధ తక్కువని. కానీ ఇక్కడ తమ పాఠ్య పుస్తకాల్లో లేనిది శ్రద్ధగా విని, అర్థం చేసుకొన్నారంటే వాళ్ళు బాగా తెలివైన వాళ్ళని గ్రహించాలి. వారిలో అనేక అంతర్గత శక్తులు ఉంటాయి. సాహిత్యం వాళ్ళలోని సృజనాత్మక శక్తుల్ని బయటకు తీసుకువస్తుంది. వాళ్ళలోని నిగూఢంగా ఉన్న శక్తుల్ని మేల్కొలుపుతుంది. ఇలాంటి సాహిత్య సంపర్కాలూ, సంభాషణలూ వారిలో నిద్రపోతున్న కళలను చిగురింపచేస్తాయి. ఉపాధ్యాయులు వారిని ప్రోత్సహించాలి. వారిలోపలి కవులను, కథకులను చేయిపట్టి బయటకు తీసుకురావాలి.

ప్రయాణాలంటే పరమానందం నాకు. మనం ఉండేది, మనం పనిచేసేది నాలుగ్గోడల నలు చదరపు పంజరాలే! అపార్టుమెంట్లు వచ్చాక లోపలికి రాగానే చేసే మొదటిపని తలుపు మూయడం. నగరాలైతే ప్రకృతికి దూరంగా, బహుదూరంగా బతకడం అలవాటైపోయింది. కాస్త ఖాళీగా ఉంటే ఒక గది కట్టి కొట్టుకు అద్దెకిచ్చే రూపాయిల సంస్కృతిలో పెరుగుతున్నప్పుడు ఆరు దారుల రహదారుల నిర్మాణమే అభివృద్ధికి నిదర్శనం. ఇప్పుడు ప్రకృతిని చూడడం, ప్రకృతిలో గడపడమే పెద్ద పండగైపోయింది.

ఈ ప్రయాణంలో దారి పొడుగుతూ పచ్చని చెట్ల పలకరింపులు, తాజా గాలుల వింజామర వీవనలు, మబ్బుల గొడుగుల నీడలూ... ఈ కాలినడక బృందంలో అందరికన్నా ఉత్సాహ బాలుడు ఏడుపదుల వివిన మూర్తిగారు. 79 కిమీ ప్రయాణంలో ఎక్కడా వెనకడుగు వేయలేదు. అలసటకు గురికాలేదు. ఎప్పుడూ అందరినీ ఉత్సాహపరిచేవారు. పొట్టిలాగూలు ధరించి వేగంగా నడిచే కథల మూర్తిగారి కబుర్లు సాహిత్య పరిమళ భరితాలు. ఆత్మీయతకు చిరునామా. ఒకసారి నాకు ఒంట్లో బాగాలేదని చెప్తూ 'చెప్పడానికి ఇబ్బందిగా ఉంది' అంటే 'నీ తండ్రిని అనుకోమ్మా! చెప్పు పర్వాలేదు' అన్నారు. తనదగ్గరున్న టాబ్లెట్ ఇచ్చారు. ఇవ్వడమే కాదుబీ గంటకోసారి 'ఎలా ఉంది తల్లీ' అని మనసారా పలకరించేవారు. మా బృందంలోని ప్రముఖ సాహితీవేత్త దాసరి అమరేంద్ర నిత్య యాత్రికులు. ఆ అనుభవాలతో పుస్తకాలు రాసి ప్రచురిస్తుంటారు. అప్పుడప్పుడు అలసిపోయిన వారిని తన మాటల టానిక్కులతో ఉత్సాహపరిచేవారు. ఒకరోజు ఉదయం స్వయంగా కాఫీ పెట్టి ఇచ్చారు. తాను సరదాగా ఉంటూ తన చుట్టూ వారితో కూడా సరదాగా మాట్లాడే స్నేహశీలి కల్యాణి. అడుగుపెట్టిన చోటల్లా పిల్లల్లో కలసిపోయే స్వభావం.

శాంతారావు గారిని చూస్తే పిల్లలకు పండగే. సమావేశాలు ఆలస్యమైనా పిల్లలతో ఆడిపాడడానికి ఉత్సాహపడేవారు. ఇప్పటికీ ఆయన వినిపించిన పాటలు పాడుదామా స్వేచ్ఛాగీతం, ఏం పిల్లడో ఎల్దా మొస్తవా చెవుల్లో గింగురుమంటూనే ఉన్నాయి. గౌరునాయుడు పాటలు పాడుతూ, డప్పుకొడుతూ అందరినీ ఉత్సాహ పరిచారు. చీకటి దివాకర్ కాలినడక మొదటి నుంచి, చివరి వరకు బృంద నాయకులుగా ఉంటూ ఏ ఆటంకం లేకుండా గమ్యం చేర్చారు. పాటలు పాడినప్పుడల్లా చిందువేసి అందరినీ ఉత్సాహపరిచారు. యాత్రలో మేము వెళ్ళిన పాఠశాల ఉపాధ్యాయుల బృందం, విద్యార్థుల బృందం మాకిచ్చిన సహకారం మరువలేనిది. మమ్మల్ని కుటుంబ సభ్యుల్లా ఆదరించారు. భోజనాలు పెట్టారు. బస ఇచ్చారు. చక్కగా విస్తర్లు వేసి కొసరి కొసరి వడ్డించారు. ఒకచోట ఉత్తరాంధ్ర వంటకమైన పిండొడియం వడ్డించారు.

ఈ యాత్రలో ఆనందాలు, అనుభవాలూ ఎన్నో! ఈ కాలినడక సందర్భంగా నేను తెలుసుకొన్నది ఒక్కటే. పిల్లలు తెలివైనవారు. వాళ్ళని శిల్పాలుగా తీర్చిదిద్దాల్సింది మనమే! మురపాకలో ఉపాధ్యాయునికి 'నా కవితా సంపుటి మీ స్కూలుకి పంపిస్తానని' చెప్పాను. పక్కనే ఉన్న ఒక విద్యార్థి 'ఎప్పుడు

కవిత

## ఊయలై ఊగాలి

- కళ్యాణదుర్గం స్వర్ణలత
9848626114

మట్టి దేహంగా వాన దాహంగా
తొలకరికి తడిచి  ఆశలవిత్తులు చల్లి
చినుకుకో ధాన్యపు రాశినికలగన్న వేళ

కరుణించని వరుణుదు కనుమరుగై
తడవని భూమికింద విలవిల లాడిన విత్తులకై
బిందెలతో మోసిన నీటిని విరగబడి మాడ్చేసిన
భానుడి వేడికి కష్టం అంతా కాష్టం అయ్యింది.

వ్యాపారంగా మారిన వ్యవసాయంలో
యెవరో కడుతున్న ఖరీదుకు
పత్తి బేళ్ళపై, ఉల్లికుప్పలపై అర్థాకలిని
చూసిన దైన్యపు దేవత దిగులు పడ్డది.
కల్తీ విత్తనాలు, కల్తీ ఎరువులతో
పాదాలకింద నేల తొలగుతుంటే
కూలిబాటపట్టిన  బడిఈడు బిడ్డడి బాధ్యతకు
కష్టాల నల్లుకున్న ఆలి స్వేదానికి
ఇంద్రధనస్సు తెల్లబడింది.



కూలీలకే చాలని ధరలతో
మార్కెట్ చేరని  ఉల్లి వాసనకు
టమేటా దారి స్వాగతించింది
కొడవలిని చూసిన కంకి బెదరు చూపులా
దళారీ పదునుకు తెగిపడ్డ ధరకు కన్నీరింకింది.
మానని గాయాలు ప్రతిసారీ సలపరిస్తుంటే
గుండెను తొలుస్తున్న గునపంతో
మళ్ళీ విత్తుకై మట్టి తొలగింది
అకాల వర్షం ప్రకృతి విలయం అందని భీమా
ప్రతిసారీ ఊపిరికొనకు నిప్పంటిస్తుంటే
చెరుకుపిప్పిలా కరిగిన కష్టం అప్పును పెంచింది

పట్టించుకోని ప్రభుతలు ఆచరణకు రాని పథకాల మధ్య
ప్రతిసారీ జీవితం మరణపు సరిహద్దును తాకుతుంది.

ఇంకని ఇంకుడుగుంతలు పైరును తడపలేని ఎత్తిపోతలు
గిట్టని గిట్టుబాటు ధరలు ఆదుకోని ఆత్మబంధువుల మధ్య
ప్రతి రైతు సౌఖ్యం నేలమాళిగల్లో నిక్షిప్తం అవుతుంది
అందుకే ఇకపై...
అంతరిక్షాన్ని తాకిన సామర్థ్యం
అన్నంపెట్టే చేతులకు చేయూతనివ్వాలి
అవసానంలోని వ్యవసాయం అందలమెక్కాలి
ఫలసాయం పరిమళిస్తూ గాదుల్ని చేరాలి
ప్రతిపొలం ప్రభుత చేతిలో పరిశ్రమగా ఎదగాలి
రైతు నెల నెలా జీతం పొందే ఉద్యోగి కావాలి
అప్పుల కుప్పలు ఊరిచివరకు వెలి కావాలి
పేనిన ప్రతి తాడూ
ఉట్టిగానో ఊయలగానో మాత్రమే ఉగాలి.. ◆

---

పంపిస్తారండీ.. నేను తప్పకుండా చదూతాను..' అన్నాడు ఎంతో ఉత్సుకతతో. అంత ఆసక్తి ఉన్న వాళ్ళను సరైన విద్యార్థులుగా సాహితీ వేత్తలుగా మలచడం మన బాధ్యతే!

ఈ కాలినడక బృందం గురుత్వాకర్షణ సిద్ధాంతం మాత్రమే తెలిసిన విద్యార్థులకు గురజాడ గురించి వివరించింది. పైథాగరస్ సిద్ధాంతం మాత్రమే అర్థం చేసుకొన్న వారికి ప్రపంచ సాహిత్యానికి తెలుగు భాషా సాహిత్యం తీసిపోదని సోదాహరణంగా చెప్పింది. తెలుగు భాషపై, కథలపై ఆసక్తిని కలిగించింది.

అసలు నేను కథకోసం కాలినడకకు వెళ్లింది శ్రీకాకుళంలో కథా నిలయం చూడడానికి. ఎప్పటినుంచో కథానిలయం చూడాలనుకొన్నాను. కానీ చూడలేదు. ఇన్నాళ్ళకు కారా మాస్టారిని చూడడం, కథా నిలయం చూడడం గొప్ప అనుభవాలు. కథానిలయంలో అన్ని వేల పుస్తకాలు చూడడం, ఆ రచయితల ఫొటోలు చూడడం అద్భుతం.

ఇంతమంది మహామహులతో, కథకులతో, గాయకులతో కలసి నడవడం ఒక మహత్తరమైన అనుభవం. సమిష్టి ప్రయాణంలోని ఆనందాన్ని, పారవశ్యాన్ని తెలియచెప్పింది ఈ ప్రయాణం. ఈ ప్రయాణం ఇంత విజయవంతం కావడానికి, ఇందుకు సహకరించిన తోటి ప్రయాణికులకు పేరుపేరునా నా కృతజ్ఞతాభివందనాలు. నిరంతరం నాలుగు చక్రాల వాహనాల రొదతో, హారన్ల మోతలో చెవులు బద్దలైన బాటలు కథా ప్రేమికుల పాద స్పర్శతో కొద్దిసేపైనా కలకల నవ్వాయి. వారి అడుగుల చప్పుడుకు ఆనంద గీతాలై పరవశించాయి. ◆

# జీబ్రాన్ ప్రవచనాలు : జీవిత మౌలిక భావనలు






- డా. జి. వెంకట రమణ
9000418264

ప్రవక్త అనే మాటకు ప్రవచించేవాడని అర్థం. ప్రవచనం అంటే దేవుడికి సంబంధించిన మాటలు. దేవుని మాటల్ని మనుషులకు ప్రకటించే ఓ ప్రత్యేకమైన పనిచేసే వ్యక్తిని ప్రవక్త అంటాం. 'ఆల్ ముస్తఫా' జీబ్రాన్ సృష్టించిన ప్రవక్త.ఆల్ మిత్ర అనే సన్యాసిని, సమాజంలోని వివిధ రకాలైన వ్యక్తులు అడిగే ప్రశ్నలకు 'ఆల్ ముస్తఫా' అనే ప్రవక్త ఇచ్చే తాత్విక, కవితాత్మక సమాధానాలతో ఈ కావ్యం సాగుతుంది. ఈ కావ్యాన్ని జీబ్రాన్ ముందు అరబిక్ భాషలో రాసి, తర్వాత తానే ఇంగ్లీష్ లోకి అనువాదం చేశాడు. ప్రపంచంలో బైబిల్,షేక్స్పియర్ రచనల తర్వాత, వందేళ్ళుగా జీబ్రాన్ రచనలు కోట్లాదిమంది పాఠకులను అలరిస్తున్నవనడంలో ఏ మాత్రం సందేహం లేదు.

బెందాళం రామకృష్ణారావు తెలుగులో 'ప్రవక్త ది గ్రేటెస్ట్ వర్క్స్ ఆఫ్ ఖలీల్ జీబ్రాన్' అని ఖలీల్ కవిత్వాన్ని చక్కగా నేటివిటీ చెదరకుండా, అనువాదం చేశారు. భావ మాధుర్యం చెడకుండా సున్నితమైన పదాలతోచక్కగా అనువదించి అందించారు. మనకు తెలుగు కవిని చదువుతున్న అనుభూతే కలుగుతుంది తప్ప ఇతడెవరో పాశ్చ్యాత్య కవి రాసిన ప్రవచనమని ఎక్కడా అనిపించదు. ఈ పుస్తకానికి ముందు మాటను వాడ్రేవు చినవీర భద్రుడు చాలా నిడివిగా రాస్తూ, తన చిన్న నాటి అనుభవాలను , జ్ఞాపకాలను, అనుభూతులను ... ఇలా అనేక అంశాలను చర్చించారు.

"ప్రవక్త అనేది యూదీయ, క్రైస్తవ–ఇస్లామీయ పదం. ప్రవక్త అంటే పూజారి కానివాడు. వేల యేళ్ళ ఆసీరియన్–బాబిలోనియన్ – సుమేరియన్ పూజారుల మీద నిరసనగా పాత నిబంధన ప్రవక్తలు ప్రభవించారు. పూజారి దృష్టి వ్యవస్థను ఎరపాటు చెయ్యడం మీద ఉంటుంది. మనిషికీ పరలోకానికీ నడుమ అతడు మధ్యవర్తిగా పని చేస్తాడు. కానీ ప్రవక్త మనుషుల హృదయాల్ని నేరుగా తడతాడు. తట్టండి , తెరుచుకుంటుంది అంటాడు" అని కొంత ఉపోద్ఘాతం ఇచ్చారు. మొత్తం ఇందులో 28 కవితలున్నాయి.వాటిలో కొన్నిటిని నాకర్థమైనంత మేరకు మాత్రమే వివరించే ప్రయత్నం చేస్తాను. ఖలీల్ జీబ్రాన్ కవిత్వాన్ని అర్థం చేసుకోవాలంటే ముఖ్యంగా మనకు బైబిలు, ఖురాన్, భగవద్గీత వంటి తాత్విక విషయాల్ని తెలిపే గ్రంథాల పట్ల కనీస అవగాహనతో పాటు, మనుషులు, వారి మనస్తత్వాలు, సామాజిక జీవితం, సమాజ చలన సూత్రాలపట్ల అవగాహన కూడా తప్పనిసరిగా కలిగి వుండాలి. ప్రతి ఒక్కరూ చదవదగినదీ, ఆచరించదగ్గదీ అని భావిస్తూ ఇప్పుడు 'ఖలీల్ జీబ్రాన్' మీద రాసిన ఈ నాలుగక్షరాలు మీ ముందుంచుతున్నా. అతని కవిత్వాన్ని విశ్లేషించే ముందు ఖలీల్ జీబ్రాన్ గురించిన ప్రాథమిక విషయాలు కొన్నిటిని తెలుసుకోవడం మంచిది.

ఖలీల్ జీబ్రాన్ ఒక ప్రసిద్ధి చెందిన కవి, కథకుడు, చిత్రకారుడు, తత్వవేత్త, సామాజిక శాస్త్రవేత్త. వీటన్నిటిని మించి ఆయనొక గొప్ప జీవన తాత్వికుడు అని చెప్పవచ్చు. ఈయన ఒక సాధారణ రైతు కుటుంబంలో లెబనాన్ లోని

బష్షరీ అనే గ్రామంలో జనవరి 6వ తేదీ ,1883 లో జన్మించాడు. 19 వ శతాబ్దంలోని సంక్షోభం వల్ల జీబ్రాన్ వారి కుటుంబం అమెరికా వెళ్ళి అక్కడ స్థిరపడిపోయారట. తాను కొంతకాలం అమెరికాలో చదువుకొని, మాతృదేశాభిమానం వల్ల తిరిగి లెబనాన్ కి వెళ్ళిపోయారట. చిన్నప్పటి నుండి చిత్ర లేఖనం అంటే ఆయనకు చాలా ఇష్టమట.

మతాల్ని, ముఢాచారాల్ని, మూఢనమ్మకాల్ని, అసమానతాల్నీ, మనుషుల మానసిక నగ్నత్వాన్నీ, మనుషుల కుళ్ళిపోయిన హృదయాల్నీ, సౌందర్యాన్ని చూడలేని కళ్లనూ, వినాల్సిన వాటిని వినని చెవులనూ ఈయన బాగా విమర్శించాడు. సంప్రదాయాల్ని, ప్రభుత్వశాసనాల్ని, చట్టాల్నీ నిశితంగా పరిశీలించి, ప్రజలు ప్రకృతి సౌందర్యాన్ని, స్వేచ్ఛను, భావుకతనూ అనుభవించకుండా, అర్థరహితమైన జీవితాన్ని, సత్యదూరమైన జీవితాన్ని గడుపుతున్నారని ఆవేదన చెందాడు. ఆ ఆవేదనల్లోంచి పుట్టుకొచ్చిన మాటల మంటలే ఆయన కవిత్వం. కణ కణ మండే నిప్పు కణికలే ఆయన సాహిత్యం. అక్రమం, దుర్మార్గం అనేవేవీ లేకుండా ప్రజలంతా పరిపూర్ణజీవితం గడపాలని ఆకాంక్షించాడు. పన్నెండు పుస్తకాలురాసి, తన విశిష్టమైన మేధోసంపత్తితో, తాత్వికతతో మానవజాతిని జాగృతం చేసిన గొప్పదార్శినికుడు జీబ్రాన్.

లెబనాన్ ప్రభుత్వ చర్యలకు వ్యతిరేఖంగా 1903లో "స్పిరిట్ రెబెలియన్" అనే పుస్తకం రాశాడు. దానికి ప్రభుత్వం భయపడి, దాన్ని వీధుల్లో తెచ్చి తగుల బెట్టింది. ఆ పుస్తకం ఫలితంగా దేశ బహిష్కరణకు కూడా గురయ్యాడు. "జీవితం, తిరుగుబాటు, ధర్మం" ఈ మూడూ ప్రతి ఒక్కరిలోనూ తప్పకుండా వుండాలంటాడు జిబ్రాన్.

'ద బ్రోకెన్ వింగ్స్'లో పేద వాడైన జీబ్రాన్ "మిస్ హేలా డాషర్" అనే ఒక సంపన్నుల అమ్మాయిని ప్రేమిస్తాడు.లెబనాన్ లో ధనవంతుల అమ్మాయిని పేదవాళ్లు ప్రేమించడం నేరం. ఆ అమ్మాయిని వేరే వారికిచ్చి పెళ్లి చేస్తారు. అలా తన తొలి ప్రేమ భగ్నంకాగా వాటి తాలూకూ జ్ఞాపకాల్ని "ద బ్రోకెన్ వింగ్స్" అనే పేరుతో ఒక కావ్యం రాశారు. ఆ పుస్తకం గురించి విమర్శకులు "ఇది యువతలో విషం నింపుతుందనీ, వివాహ బంధాన్ని విచ్ఛిన్నం చేసేలా వుందనీ, ఆపుస్తకం విషం కలిపిన తేనె లాంటిది" అని విమర్శించగా, ఖలీల్ దానికి బదులిస్తూ "నా రచనల్లో తేనె కలుపుతున్నారంటున్నారు. నిజానికి నేను ఎక్కువగా కలిపింది విషమే. అయితే దాన్ని వాళ్ళ పొట్టలు జీర్ణించుకోలేవు" అంటూ అంతే ఘాటుగా బదులిచ్చాడు.

జీబ్రాన్ వద్ద డబ్బులు లేని సమయంలో మిస్ మేరీ హెస్కెల్ అనే ఒక ధనవంతురాలు ఆయన్ను బాగా ఆదరించింది. జీబ్రాన్ వేసిన పెయింటింగ్స్‌ను 'మిస్ మేరీ హెస్కెల్'తన స్కూల్ తరపున అన్నీ కొనుక్కొన్నది. జీబ్రాన్ అదే స్కూల్ లో పనిచేసే ఒక టీచర్‌ను ప్రేమిస్తాడు. అయితే ఆమెను పెళ్లి చేసుకోవడానికి జీబ్రాన్ నిరాకరించడంతో ఆమె తన సంబంధాన్ని తెంపుకుంటుంది. పోనీ కృతజ్ఞతగా హెస్కెల్ ను పెళ్లి చేసుకోవాలనుకుంటే ఆమె కూడా తిరస్కరిస్తుంది. తర్వాత అతని జీవితంలోకి పెళ్లి ప్రస్తావనే రాలేదు. అయితే తన జీవితంలోకి మాత్రం స్త్రీల ప్రవేశం ఆగలేదు.ప్రతి వ్యక్తి "తనను తాను పరిపూర్ణం చేసుకోవడమే ప్రేమకు గల పరమార్థం" అని గట్టిగా నమ్మిన వ్యక్తి జీబ్రాన్.

ఏకాంతమే అన్ని విషయాలను తెలుసుకోవడానికి సరైన స్థితి అని తెలుసుకొని చివర్లో న్యూయార్క్ లో ఏకాంత జీవితమే గడిపాడు జీబ్రాన్. ఆ సమయంలో ప్రపంచ నలుమూలల నుంచి ఎందరో కవులు, కళాకారులు, మేధావులు ఆయన్ని కలుసుకోవడానికి వచ్చేవారు. అలా జీబ్రాన్‌ని కలిసినవారిలో జిడ్డు కృష్ణమూర్తి కూడా ఒకరు.

'నౌకాగమనం' సంపుటిలో మొదటి కవిత 'నౌకాగమనం'. అందరి ప్రేమకు పాత్రుడూ, ఆత్మీయ ప్రేమకు ఎంపికైన విశిష్టుడైన ఆల్ ముస్తఫా ఈ కవితలో "మనమీ లోకంలో వదిలేది కొన్ని జ్ఞాపకాల శకలాల్నీ, గుప్పెడు ఆలోచనల్నే కాదు ఆకలి దప్పికల చల్లారని మంటల, తీయదనాన్ని ఆస్వాదించిన హృదయాన్ని అని" అంటాడు. ప్రతి మనిషి ఏదో ఒక రోజు ఈ లోకాన్ని విడిచి వెళ్లిపోవాల్సిందే అనే జీవిత సత్యాన్ని ఈ కవితలో చాలా చక్కగా ఆవిష్కరించారు. 'ఆల్ మిత్ర' అనే సన్యాసిని అతన్ని ఎదుర్కొని ***"ఓ మహా దార్శనికుడా! /సత్యా మార్గ సంశోధితుడా! /ఎన్నెన్ని వసంతాలు ఎంతెంత దూరాలు/ వెదికినావో నీ నౌక కోసం.../ఇన్నేళ్లకు...ఇన్నాళ్లకు/రానే వచ్చింది నౌక నీ కోసం /ఇక బయలుదేరక తప్పదు ఈ సమయం"*** అంటూ అతనికి స్వాగతం పలికి, 'మాక్కూడా నువ్వు గ్రహించిన పరమ సత్యాన్ని బోధపరచుమని' అడుగుతుంది. అప్పుడాయన "ఓ ఆర్ఫలీస్ ప్రజలారా !/మన హృదయాంతరంగాల్లో/ప్రతి నిముషం స్పందించే విషయాలు తప్పా/ఇక నేను చెప్పే కొత్త విషయాలేవీ లేవని" తన చివరిమాటల్ని చెబుతాడు. ప్రతి మనిషి హృదయ స్పందనే ఎప్పటికీ కొత్తదని, ఆ స్పందనల్ని పట్టుకోవాలని సూచించాడు.

ఆల్ మిత్ర ప్రేమను గురించి చెప్పమని

అడుగినప్పుడు, *"ప్రేమ దేనినీ ఇవ్వను లేదు/ దేనినీ స్వీకరించనూ లేదు/దానికి తనదంటూ ఏమీలేదు/ తానెవరిదీకాదు... తనకు తానే/దాత...ప్రతిగ్రహీత...!"* అని కొత్త నిర్వచనమిచ్చాడు.

ఆల్ మిత్ర వివాహం గురించి చెప్పుమని అడుగుతుంది. *"పరస్పరం ప్రేమించుకోండి కాని ప్రేమ సంకెళ్ళను వేసు కోకండి ఆడండి. పాడండి. కానీ మీలో మీరే ఏకాంతంగా వుండండి. ఇచ్చి పుచ్చుకోండి హృదయాల్ని కానీ, ఉండకండి ఒకరి అదుపులో ఇంకొకరు"* అంటాడు. నిజంగా ఇలాంటి స్పష్టమైన అవగాహన లేకనే ఈనాడు ఎన్నో కుటుంబాలు రోడ్డున పడుతున్నాయి. కోర్టుల కెక్కుతున్నాయి. పోలీస్ స్టేషన్లలో కేసులు పెట్టుకుంటున్నారు. సన్నిహితంగా ఉండమంటూనే ఒకరికొకరు మరీ అతుక్కు పోకండనంటాడు. వీణా తంత్రులన్నీ కలిసే ఉన్నా, వేటికవే ప్రకంపించినప్పుడు ఒకే స్వరాన్ని వినిపించినట్లు మధుర సంగీతంలా ఉండమంటాడు. ఈ కాంప్లెక్సిటీ అర్థం కాకపోతే జీవితం అర్థం కాదు. జీవితంలో ఎవరితోనూ ముందుకు కొనసాగలేము. చివరికి భార్యయైనా.

ఒక మాతృమూర్తి అడిగిన ప్రశ్నకు సమాధానంగా మీపిల్లలా ఉండటానికి మీరు ప్రయత్నాలు చేయచ్చు కానీ వాళ్ళు మీలా వుండాలని ఆశించ వద్దనంటాడు. *"మీరు సజీవమైన విల్లైతే వేగంగా దూసుకెళ్ళే శరాలే మీ పిల్లలు"* అంటాడు.

*మీరు చేసిన బొమ్మలు కాదు/ మీ కడుపున కలిగిన వారు /మాటాడక పడి ఉండుటకు/ మరి కదలక పడి ఉండుటకు* అని పిల్లల గురించి చెప్తారు.

ఒక సంపన్నుడు ఇవ్వడం అంటే ఏమని అడిగినపుడు కొంతమందికి ఉన్నది కొంచెమే అయినా అదంతా సంతోషంగా ఇచ్చేస్తారనీ, ఉన్నాఇవ్వడానికి బాధపడే వారూవున్నారనీ, ఇవ్వడంలో కన్నా అవతలి వారు తీసుకున్న దానిలోనే కదాఉంటుంది అమితానందం అనీ, ఇంత తెలిసినా ఇంకా దాచి పెట్టుకోవాలనుకుంటున్నావా చేదు నిజం ఏమిటంటే, నీకున్నదంతా ఇచ్చేయాల్సిందే ఏదో ఒక రోజున" అని హెచ్చరిస్తాడు. మనం ఈ ప్రపంచంలో పుట్టేటప్పుడు ఏమి తీసుకొని రాలేదు. దీన్ని వదిలి వెళ్ళేటప్పుడు మనం ఏమీ తీసుకొని పోలేమనే సత్యాన్ని మనకళ్ళకు కట్టిస్తాడు. నిజంగా ఎంత నగ్న సత్యం కదా. అది బాగా అందరికీ తెలిసినా ఎందుకో మనిషి ఆలోచించడు.

అదేదో సినిమాలో చెప్పినట్లు 'తిన్నామా పడుకున్నామా తెల్లారిందా కాదు జీవితం అంటే'. లేదంటే తిని నిద్ర పోవడం కాదు జీవితం అంటే. సుఖంగా జీవితాన్నీ కాలాన్నీ వెళ్లదీయటం అస్సలే కాదు. అందుకు ఓ అన్న సత్రాన్ని నిర్వహించే సత్రపు యజమాని అడిగిన ప్రశ్నకు ఆల్ ముస్తఫా ఇలా అన్నాడు. *"మనిషి వొట్టి భూమి వాసనని, గాలిని మాత్రమే ఆస్వాదించి బ్రతకలేడు. తాను బ్రతకాలంటే కొన్నిటిని చంపక తప్పదు. తాను పాలు తాగాలంటే దూడ మూతిని కట్టేయాలి"* అంటాడు. *"నిన్ను ఏ శక్తితో చంపుతున్నానో/ ఆ శక్తే నా ప్రాణాన్ని కూడా హరిస్తుంది/ ఇది అనివార్యం/ నేను కూడా/ఆహారంగా మారక తప్పదు/ నిన్ను ఏ న్యాయం నా చేతికి అప్పగించిందో/ అదే న్యాయం నన్ను మరో బలోపేతమైన/ శక్తికి అప్పగించేస్తుంది/ నీ నెత్తురు నా నెత్తురు వేర్వేరు కాదు/ అది స్వర్గ వృక్ష దోహదమైన జీవన సారమే!"* అని, మనుషులందరిలోనూ, సకల చరాచర జీవులన్నిటిలోనూ వుండేది సమానమైన రక్తమే అని అంటాడు. అందుకే బైబిల్ లోని మాటలు *"నేను ఎలా చేశానో నాకూ అలానే చేయబడింది. నీళ్ళు పోయువానికి నీళ్ళు పోయబడును"* అనే మాటల మూలాలు ఆధారమనిపిస్తుంది.

పని అంటే ఏంటని ఓ కర్షకుడు అడిగిన ప్రశ్నకు *"ప్రేమతో పని చేయడమంటే? నీదైన శైలిలోకి ప్రతిచర్యనీ తీర్చిదిద్ది వాటన్నిటినీ నీ ఆత్మశ్వాసతో పూరించడమే"* అని మనకు మన బాధ్యతని గుర్తుచేస్తాడు. పనిని శ్వాసని అంటాడు.

ఆనంద విషాదాల్ని గురించి ఓ యువతి అడిగిన ప్రశ్నకు *"ముసుగు తొలగించిన విషాదమే నీ ఆనందం/ నీలో ఎంత నిగూఢమైన విషాదం ఉందో/ అంతకన్నా ఎక్కువగా నిక్షిప్తమై ఉంది ఆనందమనీ, ఆనంద విషాదాలు అవిభక్త కవలలు"* అంటాడు. *"అవి రెండూ కలిసే ఉంటాయనీ ఒకటి ఒంటరిగా ఉన్నపుడు వస్తే, మరొకటి అప్పటికే మన ఇంట్లో మంచమ్మీద నిద్రలో ఉంటుందనంటాడు. మనం ఆనంద విషాదాల త్రాసులో ముల్లులా అటూ ఇటూ ఊగుతూ ఉంటామని"* అంటాడు.

ఒక భవన నిర్మాణ మేస్త్రి అడిగిన ప్రశ్నకు *" మీ సువిశాల శరీరమే నీ ఇల్లు/ ఈ ఇల్లు కలలు కనకుండా వుండలేదు/ మీ ఇళ్ళలో మీరు కాపాడుకొంటున్నదేమిటో/ ఆశాలు మీ ఇళ్లలో ఏమున్నాయో చెప్పమని"* ప్రశ్నిస్తాడు. *" ప్రశాంత ప్రోత్సాహ మనశ్శాంతి మీకుందా/తోరణాల్లాంటి*

*జ్ఞాపకాల మాలలు మీదగ్గరున్నాయా /ధార్మిక శిఖరాన్ని చేర్చగల సౌశీల్య సౌందర్యం మీదగ్గరుందా?"* అనడుగుతాడు. మీ ఇల్లు నిలువుగా ఎత్తిన తెరచాప కావాలంటాడు. కంటిని కాచే కనురెప్ప కావాలంటాడు.

కార్మికుడు వస్త్రాలంటే ఏంటో చెప్పమని అడుగుతాడు. వస్త్రాలన్నీ శారీరక అందాన్ని దాచిపెడతాయి కానీ అంద వికారాన్ని ఏమాత్రం దాచిపెట్ట లేవంటాడు. సూర్యుని వెచ్చదనాన్నీ, గాలిచే ఆహ్లాదాన్నిచ్చేది వస్త్రాలే . అయితే మలిన చూపుల ములుకులు మీ మీద పడకుండా, మీ శీలంపై దాడి చేయకుండా అడ్డుకునేది కూడా వస్త్రాలే. అంటే ప్రతి మగ వాని చూపులో ఏదో ఒక కల్మషం వుంటుందనేది ఇతని భావన. ఆ కల్మషాలన్నింటి నుండి మిమ్మల్ని కాపాడేది మీ వినయమే అని అంటాడు.

ఓ వ్యాపారి అడిగిన ప్రశ్నకు బదులుగా *"ఏ శ్రమా లేకుండా మీ పరిశ్రమకి /తమ మాటల్ని అమ్మజూపే దళారుల్ని/ రానీయకండి మీ వ్యాపార లావాదేవీల్లోకి !"* అని అంటాడు. వ్యాపారం అంటేనే మాయ మాటలు చెప్పే దళారుల మోసపూరిత కుట్రే. వారి వల్ల రైతుల కష్ట ఫలం వారికి దక్కకుండా పోతోంది.

నేరము శిక్ష గురించి ఓ న్యాయమూర్తి అడిగిన ప్రశ్నకు మీరు న్యాయాన్యాయాలను వేరు చేయలేరనీ, వివేచించలేరని చెబుతాడు. విశ్వాసం లేని తన భార్యని ఒక భర్త తీసుకొస్తే, అతన్నీ అతని హృదయాన్ని తూచండి త్రాసులో అనంటాడు. ఒక వ్యక్తి భౌతిక శరీరంతో బహు నిజాయితీ పరుడైనా, మానసికంగా మహా చోరుడైతే ఆ చోరునికి మీరు చేసే న్యాయ నిర్ణమేమిటి? అని ప్రశ్నిస్తాడు. అంటే పైకి కనబడే వాటిని చూసే మీరు తీర్పు తీరుస్తారు కానీ లోపల కనబడకుండా చేసే భయంకరమైన నేరాలకు శిక్ష విధించలేరని పరిహాసిస్తాడు.

ఇంకా అనేకమంది చట్టాలు స్వేచ్ఛ, వివేకం -మోహం, బోధన వేదన, మాట్లాడటం, మంచిచెడులు, ప్రార్థన, ఆనందం, సౌందర్యం, మతం, వీడ్కోలు మొదలైన అనేక అంశాలను గురించి ఆల్‌ముస్తఫాను ప్రశ్నలడుగుతారు. వాటన్నిటికీ భౌతికజీవన తాత్వికతతోనూ, మార్మికతతోనూ సమాధానాలిస్తాడు.

స్వీయజ్ఞానం అంటే స్వయం వికసిత శత సహస్ర దళ పద్మం. స్వీయ జ్ఞానమంటే *"నేను అంతిమ సత్యాన్ని కనుక్కున్నాను అనకండి. నేనొక సత్యాన్ని కనుక్కున్నాను అనండి చాలు ఆత్మపథాన్ని కనుక్కున్నాను అనడం కన్నా నా పథంలో వస్తున్న ఆత్మని కలుసుకున్నానని అను!"* అని అంటాడు. నిజంగా ఈ మాటలు చదివాక మనమెంత ఆజ్ఞానులమో అని అనిపిస్తుంది.

స్నేహం, స్నేహితుని గురించి అడిగితే, *"నీ అవసరాలకు ఆసలైన సమాధానమే నీ మిత్రుడు, నిన్ను ఆదుకున్నవాడితడు, అభినందనల పంట పండించే సుక్షేత్రం అతడు"* అని పాజిటివ్ విషయాలను ప్రస్తావిస్తూనే, నెగిటివ్ విషయాల్లో కూడా అతనిలో మంచి లక్షణాలనే చూడమంటాడు. మీ స్నేహంలో వియోగం ఏర్పడితే కలత చెందవద్దని, బోధిస్తాడు. మన స్నేహితుడు మనతో లేనప్పుడే మనం అతనిలోని మంచి లక్షణాలను చూస్తామంటాడు.

ఒక ఖగోళశాస్త్రవేత్త అడిగిన ప్రశ్న "కాలం గురించి చెప్పుమని" .అప్పుడు ఆల్ ముస్తఫా

*"కొలతలే లేని,కొలవలేని / అనంతమైన అమేయమైన కాలాన్ని*

*కొలవాలనుకొంటున్నావు నీవు! / నిన్న అన్నది నేటి జ్ఞాపకమని*

*రేపు అనేది నేటి స్వప్నమని ....అందుకే / నేటిని ఆలింగనం చేసుకో*

*నిన్నటి జ్ఞాపకాలతోనూ /రేపటి ఆకాంక్షలతోనూ"*

అంటాడు. కాలం విలువ ఎంత గొప్పది. అందరం దాని వెంట పరుగెతాలి, నడవాలి, లేదంటే కనీసం ఈడ్చైనా ఈడ్వాలి. నేటిని హత్తుకోవాలంటాడు. ప్రస్తుతం ఉన్న సమయమే మనది. రేపు మనది కాదు. నినాటిది ఎప్పటికీ రాదు అనే సామాన్యమైన సత్యాన్ని మన కళ్ల ముందుంచుతాడు.

ఒక విషయం మాత్రం నిర్మొహమాటంగా చెప్పవచ్చు. జీబ్రాన్‌ను చదివితే తప్పకుండా జీవితం పట్ల కొంత అవగాహన స్పష్టత వస్తుంది. తప్పని సరి పరిస్థితుల్లో ఎలాంటి నిర్ణయాన్ని తీసుకోవాలనో ఈయన ప్రవచనాల్ని చదివితే మనకు ఓ మంచి నిర్ణయాన్ని తీసుకొనే ధైర్యం వస్తుంది. ఇతరులను మార్గదర్శనం చేయచ్చు.

జీబ్రాన్ తన 48 వ ఏట ఏప్రిల్ 10 వ తేదీన 1931లో న్యూయార్క్‌లో చనిపోయారు. అతని కోరికమేరకు అతని అభిమానులు ఆయన శరీరాన్ని లెబనాన్‌కు తీసుకెళ్లి అక్కడ సమాధిచేశారు. ఆయన వాడిన వస్తువులు, రాసిన గ్రంథాలు, గీసిన చిత్రాలూ అన్నీ కలిపి ఒక మ్యూజియంగా ఏర్పాటు చేశారు. ఆయన్ని ఒక ప్రవక్తగా ఇప్పటికీ ఆరాధిస్తున్నారు. ◆

## కలసిపోయిన కల

- చలపాక ప్రకాష్
9247475975



కాలనీలన్నీ ఓ సముద్రం !
ఒక్కో అపార్టుమెంటూ
ఒక్కో జీవనది !!

అందులోని మనుషులు
అనేక రుచులు గల నీటి చుక్కలు ?

కన్నీరు, పన్నీరు
ఉప్పునీరు, చన్నీరు
ప్రాస ఏదైనా...
వేసే వేషమేదైనా...
చుక్కల్లా కలిసిపోవాల్సిందే !

మంచుముక్కల్లా అందరిమనసుల్లో
కరిగిపోవాల్సిందే !!

ఎద బాధ ప్రయాణించే
నావకు తెలుసు!
ఆటుపోట్లు గొడవ
పడవకేసే తెడ్డుకు తెలుసు !!

అలలు ఉయ్యాలై ఎగసిపడుతుంటే
కట్టలు తెంచుకుంటున్న ఆనందాన్ని
ఒడిసి పట్టడం ఎవరికి తెలుసు !

అదే జీవిత ఎదుగుదలకి
కనిపించని గొలుసు !!

తెలిసింది ఎంతైనా
తెలియంది కొండైనా
చివరికి
కరిగిపోవాల్సిందే
నేలతల్లి 'కల'గలిసిపోవాల్సిందే ! ◆

## కనిపించని సంకెళ్ళు

- బి. హేమమాలిని

తరతరాల భావ దాస్యమనే
బానిసత్వపు పెనుచీకటి
సంకెలలు తొలగేదెప్పటికి?
సామాజిక శక్తులు వేసిన
ముందరికాళ్ల బంధనాలను
తెంచుకునేదెన్నటికి?
వేదాల్లో, పురాణాల్లో
ఏం చెప్పారో తెలియదు... కానీ
వారి పేరుతో
సమాజంలో సగభాగాన్ని వంచిస్తున్న
మానవ సమూహపు
కపట నాటకానికి తెరవేసేదెన్నటికి?
మతాచారాలనే ముసుగులో
లైంగిక అస్పృశ్యతను పాటిస్తున్న
గుత్తేదారుల పెత్తనం ముగిసేదెన్నటికి?
నీలోనే మరోజన్మకు ఊపిరి పోసే
పవిత్రతను మలినంగా మార్చితే...
ఇదెక్కడి న్యాయమని
ప్రశ్నించే ధైర్యం కూడా నీకు లేదా?

ఋతుచక్రం మలినం కాదమ్మా... పిచ్చితల్లి



అది....
నీలోని మాతృత్వానికి మూలకణాన్నందించే ఆయుధం
మానవ మనుగడకు మూలం
అమ్మకడుపులో తొమ్మిది నెలలూ
ఉమ్మ నీటిలో
మునకలు వేస్తూ గడిపినపుడు లేని మలినం
అమ్మను చేసే శరీర ధర్మానికి అపాదిస్తే...
అణువణువూ ఆక్రోశించలేదా?
పురుష సమాజం చేతిలో కీలుబొమ్మవైన ఓ మగువా...
అత్తిపత్తిలా నీలో నువ్వే ముడుచుకుపోకు...

అపర కాళికవు కానవసరం లేదు.. కానీ
అన్యాయాన్నెదిరించే తెగువ చూపు
నీలోని చైతన్యాన్ని నిదురలేపు....

మాతృస్వామ్యపు ఆనవాళ్ళను తుడిచేసిన
పురుషాధిక్య సమాజపు కుట్రలు గమనించు

నీ అణువణువునూ బంధించిన
కనిపించని సంకెళ్లను ఇకనైన ఛేదించు... ◆




"ఓరేయ్, పీతాంబరా! నరసింహా !! మూలకోనకాడ మన శెనగతోటల్లో అడవి పందులు పడినాయంట. పోదాం పదండిరా" అని కమలక్క రచ్చబండ కాడ నిలబడుకొని అరస్తావుంది. శుక్లపక్ష పౌర్ణమి – ఆకాశంలోని చంద్రుడు తెలుపురంగులో మిలిమిల మెరుస్తున్నాడు. పున్నమి వెన్నెల ఊరు ఊరంతా తెల్లరంగుతో అలికినట్లు వుంది. కడుపులో గుడగుడగా వుండాదని నల్ల రంగన్న పీతాంబరుడు, నరసింహుడు అమ్మ అరువులకి పరుగులు తీసినారు. గబగబ ఇంట్లోకి పోయినారు. ఈటె, కత్తి, కొడవలి, గొడ్డలి, దోటి, గడ్డపారలు ఎత్తుకొని వీధిలోకి వచ్చినారు.

"మేము కూడా మీతో వస్తాము పీతాంబరా, నరసింహా" అంటూ తొరూరు తిమ్మారెడ్డి, పైడిపల్లి పద్మనాభం, గట్టు గుణశేఖరుడు, నేసనూరు నాగరాజు, అడవిచేళ్ల అనంతుడు, సముదాయం సత్యంలు మొద్దుకర్రలు రోకలిబండలు చేతబట్టినారు. కమలక్క టార్చిలైటులో బ్యాటరీలు వుండాయో లేదో చూసుకొంటోంది.

"రెక్కలు ముక్కలు చేసుకొని పంట పండిస్తావుంటే పందుల దెబ్బతో చేతికాడి కూడు నోటి కాడికి వచ్చేట్లు లేదు కదరా నాయనా. పరుగులు తీయండ్రా రేయ్" అని అరుస్తావుంది కమలక్క

కమలక్క కేకలకి ఇంటి ముందరి తెన్నెపైన కూర్చొని చదువుకుంటున్న రామతులసి ఎగిరిదూకి వీధిలోకి వచ్చింది. వారి మాటల్ని బట్టి వారి చేతుల్లోని కర్రలు, కత్తులు చూసి ఆమెకి అడవి పందుల వేట విషయం అర్థమయ్యింది. తిరుపతి వెటర్నరీ యూనివర్శిటీలో వెటర్నరీ సైన్స్ చదువుతోంది రామతులసి. గబగబ వెళ్లి వారికి ఎదురుగా పోయి నిలబడింది. "వన్యప్రాణుల చట్టం ప్రకారం అడవి పందులను చంపడం, వేటాడటం నేరం అని తెలుసా మీకు" అని నిలదీసింది. తొరూరు తిమ్మారెడ్డి వక్కచెక్క తమలపాకులో చుట్టి నములుతూ "నీకేవమ్మా? ఎన్ని కథలైనా చెబుతావు. పుస్తకాల్లో వంద వుంటాయి. అయ్యోపాపం అని అనుకొంటాపోతే మేమెట్లా బతికేది" అని ఎదురు తిరిగినాడు.

"అట్లయితే ఇంకొకటి చేద్దాం" అంది రామతులసి

"చదవేస్తే వున్నమతిపోయినట్లు వుండాది నీ వ్యవహారం.

చదవక ముందు కాకరకాయ, చదివినాక కరకరకాయ మాదిరి వుండాది నీ ఉచిత సలహాలు" అని అడ్డంపడినారు పీతాంబరుడు, నరసింహుడు.

"ఒరేయ్, ఆ పిల్ల చదువుకున్న పిల్లరా. చదువుకున్నోళ్లకి కూడా సేద్యగాళ్లే అన్నం పెట్టాలి. ఏమి చెబుతుందో చూద్దాం. మంచి అయితే విందాం. వద్దనుకొంటే వదిలేద్దాం" అంది కమలక్క

కమలక్కతో సహా అందరూ రచ్చబండ కాడికెళ్లి కూర్చున్నారు. "ఊరు అందరిదీ ఒక దారి, ఉలిపి కట్టెది ఒక దారి మాదిరి, నీకెందుకే ఊర్లో పెత్తనాలు? నోరు మూసుకొని చదువుకోకుండా.." అని అరుస్తోంది ఇంటికాడి నుంచి రామతులసి అక్క ఇవేమీ పట్టించుకోలేదు రామతులసి.

"ఈ రోజు మనం మన కయ్యిలకాడికి పోయి గట్టిగా గట్టిగా అరుద్దాం. డబ్బాలు, చిన్న కర్రలు తీసుకోండి. ఖాళీ డబ్బాలని కర్రలతో కొడుతూ అరుస్తూ వుంటే పందులు జడిసి పారిపోతాయి. టపాకాయలు వుంటే పేలుద్దాం. వాటి శబ్దాలకు అవి భయపడి పారిపోతాయి" అని సలహా ఇచ్చింది.

తొరూరు తిమ్మారెడ్డి పకపకా నవ్వినాడు. "అవి అడవి పందులమ్మా. వాటికి చెవులు, కళ్ళు అంతంతమాత్రమే. వాటికి సరిగ్గా కనబడవు, వినబడవు. వాసన పసిగట్టి భూమిలోని శెనగను గుర్తుపడుతుంది. అవన్నీ గుంపులుగుంపులుగా దూకి పంటల్ని నాశనం చేస్తాయి. 'అరిస్తే పోతాయి, డబ్బాలు కొడితే బెదురుతాయి. టపాసుల శబ్దానికి పారిపోతాయి' లాంటి మంత్రాలకు చింతకాయలు రాలవు తల్లీ" అని అన్నాడు.

"ఎప్పుడూ లేనిది మన కయ్యిలకాడికి అడవి పందులు వచ్చినాయమ్మా రామతులసీ! మొన్న తిమ్మాపురం కయ్యిల్లో తినేసిపోయినాయంట. నిన్న కృష్ణాపురం కయ్యిల్లో తినేసిపోయినాయంట, ఈ రోజు ఏమవుతుందోనమ్మా! మూడు కయ్యిల్లో శెనక్కాయలు వేసినాను. నాకు ఆ పంటే దిక్కుతల్లీ. భద్రంగా రోజూ కొన్ని శెనక్కాయలు ఉడకబెట్టి మరాఠీ గేటు కాడ నిలబడతా. రైలువస్తే గేటు వేస్తే బండ్లు నిలిస్తే నాకు వ్యాపారం. ఎలాగైనా నన్నూ నా కయ్యిల్నీ కాపాడుతల్లీ" అని వేడుకొంది కమలక్క.

"అయితే మన కయ్యిలచుట్టూ ముళ్ల పొదలను కంచెలుగా పెంచుదాం. లేకుంటే పొలాల చుట్టూ అడుగు ఎత్తులో ఇనుప తీగల్తో రెండు మూడు వరసలు కంచెలా చుట్టుదాం" అని ఆవేశంగా చెప్పింది రామతులసి.

తొరూరు తిమ్మారెడ్డి మళ్లీ పకపకా నవ్వినాడు. "జుట్టున్న అమ్మ, ఏ కొప్పు అయినా పెడుతుంది. రెక్కాడితే కాని డొక్కాడని బతుకు కమలమ్మది. కంచె పెంచు, కమ్మిచుట్టు అంటే సరిపోదు. అయినా ఇప్పటికిప్పుడు అవన్నీ అయ్యేదా పోయేదా" అని వెటకారంగా అనినాడు.

"అయితే ఊరిపందుల పెంటని పిడకల్ని చేద్దాం. పిడకల్ని కుండల్లో పెడదాం. కయ్యిల్లో అక్కడక్కడ కుండల్ని పెట్టి పొగబెడదాం. ఆ వాసనకి అడవి పందులు మన చేల దగ్గరకురావు."

"ఇప్పటికిప్పుడు పందుల్ని పట్టి వాటి పెంటని పిడకలు చేసేది సాధ్యమా" అన్నట్లుగా చూసినారు అందరూ రామతులసి వైపు. అర్థమైపోయింది రామతులసికి.

'అలాగైతే మంగలి షాపుల కెళదాం. వెంట్రుకలు తీసుకొద్దాం. పంట చుట్టూ అడుగు పొడుగున వెంట్రుకలు పరుద్దాం. అడవి పందుల ముక్కుల్లోకి ఈ వెంట్రుకలు వెళ్లి వాటిని చికాకు పెడ్తాయి. దీంతో పందులు పొలాలకి దూరమవుతాయి" అని చేతులు ఆడిస్తూ చెప్పింది.

"అమ్మా రామతులసి! అన్నం లేకుంటే జొన్నసాగు చెయ్యమందట నీలాంటి ఆమె ఒకామె. మంగలి షాపుకెళ్దాం, పొలాల్లో వెంట్రుకలు పరుద్దాం లాంటి ప్రయోగాలు ప్రస్తుత పరిస్థితికి కుదరదు లేమ్మా" అని అందరూ అభిమానంగా ఆమెను సముదాయించినారు. మూలకోనకాడికి పోవడానికి అందరూ లేచినిలబడినారు.

"చివరగా ఒకమాట చెబుతా, పెద్ద ఖర్మ కష్టంలేని పద్ధతి. ఎర్రగడ్డ తెల్లగడ్డ (ఉల్లి, వెల్లుల్లి) కలిపి మెత్తగా నూరుదాం. గోధుమ పిండిలో కలిపి వుండలుగా చేద్దాం. పొలాల్లో అక్కడక్కడ 10-15 వుండలను పందులకు ఎరగా పెడదాం. విషపు ఎరలు తిన్నాయంటే పందులు... పరుగు పరుగు" అంది.

"ఇదేదో బాగుందే... అయినా ఎర్రగడ్డ తెల్లగడ్డ గోధుమపిండి... ఇవి కొనను నా దగ్గర దుడ్డులు లేవు కదా" అంది బాధగా కమలక్క.

కానుగ చెట్టుకింద నిలబడి రచ్చబండ కాడి మాటలన్నీ విన్న పట్నంలో కాయగూరలమ్మే, పూలభాగ్యం గంప ఎర్రగడ్డల్ని

వారిముందర తెచ్చిపెట్టింది. తోపుదు బండిలో తెల్లగడ్డలమ్మే గడ్డం వెంకటయ్య గబగబ వచ్చి చేట తెల్లగడ్డలు తెచ్చి ఇచ్చినాడు. అంగట్లో కూర్చొని అంతా విన్న నల్ల రంగన్న గోధుమపిండి పంపించినాడు.

అందరూ చేరి చకచక ఎర్రగడ్డ తెల్లగడ్డల్ని రోట్లో వేసి దంచినారు. గోధుమపిండితో కలిపినారు. వుండల్ని చేసినారు. బక్కెట్లల్లో పెట్టి మూలకోనకి బయలుదేరినారు. రామతులసి కూడా వారి వెనకే నడిచింది.

– – –

అందరూ గెనాలమ్మిట నడుస్తున్నారు. ఆకాశంలోని చంద్రుడు కూడా వీరి వెనుకే నడుస్తున్నాడు. రెడ్డోళ్ల బావికాడ రామతులసి గెనెంమీది నుంచి జారింది. కంపమీద కాలు పెట్టింది. 'అమ్మా' అని అరిచింది. కమలక్క వచ్చేలోగా ఆధారం కోసం ప్రక్క నున్న తుమ్మచెట్టు పట్టుకొంది. నొప్పికి 'అమ్మా అబ్బా' అంటూ మళ్లీ అరిచింది. కమలక్క గబగబ వచ్చి తుమ్మ కొమ్మ పక్కకి లాగింది. కాలిముల్లు పెరికేసింది. రామతులసికి తమ ప్రొఫెసర్ పద్మవాణి చెప్పిన మాటలు గుర్తుకొచ్చాయ". పాఠాలు వేరు – ప్రాక్టికల్‌గా వేరు" అని.

గుంపుగా వెళ్తున్న వీరిని చూసి తిమ్మాపురం విజయులు నాయుడు విషయం ఏమిటని అడిగినాడు. కమలక్క అడవి పందుల విషయం చెప్పింది. మేమూ వస్తామని చెప్పి ఊర్లో వాళ్లందరినీ పిలిచినాడు. విజయులు నాయుడు పిలిచిందే తక్కువ, చెంగమ నాయుడు, కృష్ణమ నాయుడు, గోపాల నాయుడు, భూపాల నాయుడు, రాఘవులు నాయుడు, పురుషోత్తం నాయుడు, మునిక్రిష్ణమ నాయుడు, వెంకట్రామా నాయుడు, సుబ్రమణ్యం నాయుడులు బయలుదేరినారు.

రామన్నోళ్ల బావి కాడికి చేరినారు. కుప్పలు కుప్పలుగా మిణుగురు పురుగులు వీరిని చుట్టుముట్టినాయి. చేతుల్తో వాటిని తరుముతూ నడుస్తున్నారు. నడుస్తున్న రామతులసికి మెత్తగా ఏదో తగిలింది. ఏమిటో అని తొంగి చూసేలోగా పొడుగాటి పాము సరసరా ఆమెని దాటుకొని పోయింది. బిత్తరపోయింది రామతులసి. గజగజ వణకసాగింది. "రామతులసీ, భయపడవద్దమ్మా పాముకరిస్తే ఏమి పసరు నోట్లో పోయాలో నాకు తెలుసులే" అని కమలక్క ధైర్యం చెప్పింది.

రామతులసి వింతగా చూసింది కమలక్కవైపు. మళ్లీ రామతులసికి పద్మవాణి మేడమ్ మాటలు గుర్తుకొచ్చాయి. "పాఠాలు చదవడం అనేది నదిఒడ్డున నిలబడి ఈత అలా కొట్టాలి ఇలా కొట్టాలి అని నేర్చుకోవడం లాంటిది. నిజం అనేది నదిలో ఈత కొట్టడంలాంటిది" అని.

కట్టెలు కత్తులు తీసుకొని గుంపుగా గలగల మాట్లాడుతూ వెళ్తున్న వారికి కృష్ణాపురం ఊరోళ్లు తోడైనారు. కృష్ణాపురం ఊరి రంగాచారి, చంద్రాచారి, బీకి ఆచారి, రవీంద్రాచారి, దేవేంద్రాచారి, మనోహరాచారి, నరసింహాచారి, రమణాచారి, కేశవాచారిలు నిన్న మొన్న జరిగిన అడవి పందుల అరాచకాలను కథలు కథలుగా చెబుతున్నారు.

ఇంతలో ఈసలాపురం కాలువ అడ్డం వచ్చింది. మోకాలిలోతు నీళ్లు పారుతున్నాయి. ఒకరి చేతులు ఒకరు పట్టుకొని చిన్నగా కాలువ దాటుతున్నారు. కాలువ గట్టుపైకి వచ్చిన తులసి పాదాలపైన ఏదో కొరికినట్లుగా అనిపిస్తే తైతక్కలాడింది. కమలక్క సరసరవచ్చి టార్చిలైటుతో తులసిపాదాలని చూసింది. రెండు చిన్న జలగలు ఆమె రక్తం పీలుస్తున్నాయి. కమలక్క తన వేళ్లతో గట్టిగా తట్టింది వాటిని. దూరంగా పోయి పడ్డాయి అవి. నీళ్లేసి కాళ్లను కడుక్కొంది తులసి. "పడవ ఒడ్డున వుంటే సరదాగానే వుంటుంది. సముద్రంలోకి వెళితేనే కదా ఆటుపోట్లు తెలిసేది" ప్రొఫెసర్ మాటలు తులసి మదిలో గింగిర్లు కొడుతున్నాయి. విద్యవేరు వాస్తవం వేరు అన్న విషయం ఆమెకు కొద్దికొద్దిగా అర్థం కాసాగింది.

– – –

అందరూ మూలకోనకి చేరినారు. కమలక్క మూడు కయ్యిలలోనూ కయ్యికి పది వుండలు లెక్కన అక్కడక్కడ వుంచినారు. మంచీ చెడ్డా మాట్లాడుకొంటూ కమలక్క కయ్యి ఎగువ గుబురు పొదల మధ్యన కూర్చొన్నారు. నిశ్శబ్దంగా వుంది వాతావరణం.

దభీదభీమని మనిషి పరుగుల చప్పుడు వినబడింది వారికి. అందరూ బిత్తరపోయినారు. ఇంత రాత్రివేళ ఈ అడవుల్లో తాముగాక ఇంకెవ్వరు వున్నారు అనే సందేహం కలిగింది వారందరికీ. అడుగుల శబ్దం దగ్గరయ్యింది. వారి వారి గుండెల శబ్దం వారి వారికి వినిపిస్తోంది.

గబుక్కన కట్టమీది కొచ్చినాడు కశింకుప్పం కుప్పడు. అడుగుల శబ్దం కుప్పడదని తెలుసుకొని అందరూ గాలి పీల్చుకున్నారు. వాడు గబగబా నడుస్తూ "కమలక్కా, నన్ను

పిలవకుండానే వచ్చేసినారే" అని అడిగినాడు.

"ఏదోలేరా, బిరబిర వచ్చేసినాం. పందులెక్కడ పొలాల్ని పాడుచేస్తాయోనని. అయినా భయం లేదట్రానీకు. ఒక్కడివే వచ్చినావు. ఒంటిగా ఇంత రాత్రుల్లో" అని అరిచింది కమలక్క

కుప్పడు శివాజి సినిమాలో రజనీకాంత్‌లా ఫోజుపెట్టి "సింహం సింగిల్‌గా వస్తుంది. పందులే గుంపుగా వస్తాయి" అని వయ్యారాలు పోతూ చెప్పినాడు. వాడి స్టయిల్‌కి అందరూ పగలబడి నవ్వినారు. కమలక్క అభిమానంగా చిన్న మట్టి పెల్లను వాడిపైన విసిరింది. వాడు మళ్లా రజనీకాంత్‌లా ఫోజు పెట్టి మట్టిపెల్లని తప్పించుకొని ఎగిరిదూకి కమలక్క కూటమిలో చేరినాడు.

ఇంతలో చిన్నగా మొదలైన శబ్దం పెద్ద శబ్దంగా వినబడసాగింది వారికి. అడవి పందులు గుంపులు గుంపులుగా వచ్చాయి. అవి బూడిద గోధుమ తెల్లరంగు వెంట్రుకలతో వున్నాయి. అవి భీకరంగా కనిపించడం లేదుకానీ గుంపుని చూస్తే మాత్రం దడ పుట్టించేవిగా వున్నాయి. అమ్మ పందులు ఉల్లి, వెల్లుల్లి వుండల దగ్గరకి వెళ్లాయి. ఉల్లి వుండల్ని కసాకసా కొరికి తిన్నాయి. పిల్లపందులు వాటి వెనకే వున్నాయి. ఏమయ్యిందో ఏమో... ఉల్లి వుండలు తిన్న పందులు వెనక్కి తిరిగాయి. మిగతావి వాటిని అనుసరించాయి. కొండల చెరువు మీదుగా అడవిలోకి వెళ్లిపోయాయి.

తొరూరు తిమ్మారెడ్డి గన్నేరు చెట్టులోని గన్నేరు పూలు కోసినాడు. పీతాంబరుడు, నరసింహుడుతో కలిసి రామతులసి వద్దకి వచ్చినారు. "అమ్మా ! రామతులసీ! బొట్టు రక్తం నేలన పడకుండా అడవి పందుల్ని అడువులకు పంపినావు తల్లీ, ఆస్తులుంటాయి పోతాయి. చదివిన చదువు మాత్రం చచ్చేంత దాకా మనతోటే వుంటుందమ్మా. నీవు చదివి దీపంలా వెలుగుతున్నావు. లక్షలాది దీపాలను నీవు వెలిగించగలవమ్మా" అంటూ గన్నేరు పూలు ఆమె దోసిళ్లలో పోసినారు. రామతులసి పూల దోసిళ్లతో వారికి నమస్కరించింది.

తిమ్మాపురం వాళ్లు కృష్ణాపురం వాళ్లు ఆనందంతో తప్పట్లు కొట్టినారు. ఈలలు ఊలలు వేసినారు. ఎగర గలిగిన వాళ్లు ఎగిరెగిరి పులి అడుగులు వేసినారు. ఎగరలేని వాళ్లు చేతులు ఊపుతూ ఒళ్ళంతా ఊగించినారు.

"అయినా అన్ని పందులా అక్కా" అని అడిగినాడు కమలక్కని అమాయకంగా కుప్పడు. "ఒరేయ్ కుప్పా! అవి కంటే ఒకటీ రెండు కనవురా నాయనా. వానా కాలాల్లో ఒకేసారి నాలుగు నుంచి డజను పందుల్ని దాకా కంటాయిరా నాయనా. అడవులు, గడ్డి ప్రాంతాలు, నదుల ప్రక్కనుండే వ్యవసాయ ప్రాంతాలలో వాటికి ఆహారం దొరుకుతుంది కాబట్టి అవి అక్కడే తిరుగులాడుతాయిరా నాయనా" అని చెప్పింది కమలక్క. "అక్కా నా అడుగు మీకయ్యిల్లో పడింది కాబట్టి నీకు పందుల కష్టం పోయిందక్కా" అన్నాడు నవ్వుతూ. "ఒరేయ్ కుప్పా! తలగడ తిరగేస్తే తలనొప్పి పోతుందా, గుండ్రాయి దాస్తే పెళ్లి ఆగిపోతుందా" అని చేతులు ఊపుతూ చెప్పింది కమలక్క. అందరూ పడీపడీ నవ్వినారు.

కమలక్క తెలివికి ఆశ్చర్యపడింది తులసి. 'ఎంతోమంది ఆడవాళ్లు అవకాశాలు లేక అవకాశాలు రాక అవకాశాలు దొరకక పల్లెల్లో మగ్గిపోతున్నారు కదా' అనుకొని కాసేపు బాధపడింది.

కుప్పడు తల ఎగరేస్తూ "శెనగతోట పక్కానికి వచ్చినట్లు వుండాది. అందరం చేరి తోట పెరికేద్దామా కమలక్కా! వెన్నెల చూస్తా వుంటే పగలు మాదిరి వుంది కదా, తలా ఒక చేయివేసి ఇప్పుడే పెరికేద్దాం శెనక్కాయలను. మూడు కయ్యిలు ఎంతసేపు" అనినాడు.

అంతే, పదేసిమంది ఒక్కో కయ్యికాడికి పోయినారు. నవ్వుతూ నవ్విస్తూ పెరకతావుండారు. శెనగచెట్లు పెరకతావున్న కశింకువ్వం కువ్వడికి కాల్చిన శెనక్కాయలు తిందామనిపించింది. అక్కడా ఇక్కడా వుండే గడ్డి ప్రోగుచేసినాడు. నిక్కరు జేబులో వుండే చీటా అగ్గిపెట్టెతో మంటవేసినాడు. పచ్చి శెనక్కాయలు కొన్ని నిప్పుల్లో వేసినాడు. కుప్పడు శెనక్కాయలు వేయించేది చూచి అందరూ కుప్పడి చుట్టూ కుప్పగా చేరినారు. తలా పిడికెడు శెనక్కాయలు వారి చేతుల్లో పెట్టినాడు. వేరుశెనగ ఆకుల్ని కిందవేసుకొని అందరూ వాడి చుట్టూరా కూర్చొన్నారు. తింటూ తింటూ తొరూరు తిమ్మారెడ్డి "పాట పాడరా కుప్పా" అని అడిగినాడు. వాడు సిగ్గు మొగ్గలైనాడు. వంకర్లు తిరిగినాడు. "ఆడోళ్లముందర పాడాలంటే సిగ్గన్నా నాకు" అనినాడు. కమలక్క రోషంగా "వాడేంది పాడేది, నేను పాడతా వినండి" అని చెప్పింది. అందరూ పకపకా నవ్వినారు. పూజాఫలం సినిమాలోని జమున పాట "పగలే వెన్నెల జగమే ఊయల" పాడసాగింది. ఎక్కడి నుంచో చల్ల గాలులు చిన్న చిన్నగా వారి ముఖాలను తాకుతున్నాయి. ఆకాశంలోని చంద్రుడు ముసిముసిగా నవ్వుతున్నాడు. ◆

## కవిత

## ఆ కొన్ని క్షణాల కోసం

- పద్మావతి రాంభక్త
9966307777

కొన్ని క్షణాలలో పరిమళాల శ్వాసను నింపుకోడానికి
బయలుదేరినపుడు
ఎన్నో వేలయోజనాల నడకలోనైనా అలుపు తెలియదు
ఉధృతమైన ఆత్మీయుల పలుకుల ప్రవాహంలో పడి
కొట్టుకుపోతున్నపుడు
కాలం రౌతు లేని గుర్రంలా పరుగెడుతున్నా
అసలు గమనింపుకే రాదు
వారి మాటలలోని హరితాన్ని
మనసంతా పూసుకుని పరవశించినపుడు
ఒక అలౌకిక ఆనందస్థితిలో ఈదులాడుతూ
ఎంతో కష్టించి చేరాల్సిన సుదూరతీరం
ఆలోచనలో మెదలనే మెదలదు
వారి సాహచర్యంలో
పగుళ్ళు బారిన గుండె
పన్నీటి వాన కురిసిన అనుభూతికి లోనై పరవశిస్తుంది
వారి సాన్నిధ్యంలో లభించిన అమ్మలాంటి లాలనతో
ఉప్పొంగే కన్నీటినదులెన్నో చిటికెలో ఇంకిపోతాయి
అటువంటి సమయాలను అపురూపంగా
ఒడిసిపట్టుకోడానికి
సప్తసముద్రాలనైనా దాటి వెళ్ళాలనిపిస్తుంది
అటువంటి వారి నుండి
కాసిని మంచిని నింపే పదాలను స్వీకరిస్తూ
మనసుకంటిన మలిలాలను కడిగేసుకుని
మరకలేని తెల్ల కాగితంలా మెరవాలనిపిస్తుంది
అటువంటి వారిని ఆదర్శంగా తీసుకుని అయినా
నలుగురికీ నిస్వార్ధంగా హాయిని పంచే చల్లని చెట్టు నీడలా
మనలను మనం మలచుకోవాలనిపిస్తుంది
మన నోటిలో నానే వాక్యాలు
కొందరి దిగులు దుప్పట్లనైనా మడతపెట్టగలిగితే
అంత కన్నా కావలసినదేముంది
మన పలుకులు మెత్తని రుమాళ్ళై
కొద్ది మంది బుగ్గలపైన గడ్డకట్టిన చారికలనైనా
తుడవగలిగినా చాలు
అప్పుడే ఈ మూన్నాళ్ళ ముచ్చటైన బ్రతుకుకు ధన్యత
కదా!! ♦

## తాయిలాలు

- జీవీవీ సత్యనారాయణ,
9912233739

ఇనుపముక్కని అయస్కాంతము ఆకర్షించినట్లు
ఓటును ఒడిసిపట్టి తన బుట్టలో వేసుకునే
తాయిలాలు సిద్ధమయ్యాయి
చేపలను పట్టడానికి వాడే గేలానికి
ఎర తగిలించినట్టు
ఓట్లను కొల్లగొట్టడానికి
తాయిలాలు తళుక్కుమంటున్నాయి
సరిగ్గా ఎన్నికలకు ముందే యీ తాయిలాలు
ఇపుడే గుర్తొచ్చినట్లు తారస పడుతుంటాయి
అన్నిపార్టీలు క్రొంగొత్త ఆకర్షణీయ ఆలోచనలతో
తాయిలాలును ముస్తాబుచేసి
మనల్ని మంత్రముగ్ధులను చేయడానికి
తమతమ ఖాతాలలో జమచేసుకోడానికి
ప్రజాకర్షణగా మనముందు ప్రదర్శణకు పెడతాయి

అచ్చం ఎన్నికల మేనిఫెస్టోని తలపించే రీతిలో
జనాలను తమ బందిఖానాలో వుంచుకోడానికి



యీ తాయిలాలను సంధిస్తాయి
ప్రజలను గోడును పెడచెవిన పెట్టిన పార్టీలే
సరిగ్గా ఎన్నికలకు ముందే
యీ తాయిలాలను తెరపైకి తెస్తాయి
ప్రభుత్వాలు ఇచ్చే పథకాలనుకుంటామ్ముగాని
ఎవడబ్బ సొమ్మది?
మన జేబునుండి కాజేసిన కాసులేకదా......
యీ తాయిలాల వలలో చిక్కుకుని
సరైన నాయకుడిని ఎన్నుకోకపోతే
మరో ఐదు సంవత్సరాలు
జనం విలవిలలాడడం ఖాయం
యీ మాయలమరాఠీల మాయాజాలంలో
మన బ్రతుకులు మటుమాయం !
తస్మాత్ జాగ్రత్త !! ♦

నచ్చిన రచన



# సామాజిక సమతుల్యతకు ఆలంబన

- వై.హెచ్.కె.మోహన్‌రావు
9440154114

ప్రఖ్యాత చలన చిత్ర గీతరచయిత సిరివెన్నెల సీతారామశాస్త్రి డాక్టర్ నాగభైరవ అవార్డు స్వీకరణ అనంతరం చేసిన స్పందనా పూర్వక ప్రసంగం ఉత్తుంగ తరంగంలా సాగింది. ముగింపులో ఈనాటి తన ప్రసంగానికి 'గంపకూడు' కవితా సంపుటి అట్ట చివరి కవితా పంక్తులే స్ఫూర్తి అని 'సిరివెన్నెల' వెల్లడించిన వైనం చిన్న నారాయణ రావు కవిత్వ పటుత్వానికి గీటు రాయిగా నిలుస్తుంది. సారవంతమైన కవిత్వం రాస్తున్న కవి చిన్ని నారాయణ రావు. కవనలోకంలో సాంద్రమైన కవిగా గుర్తింపు కలిగివున్నారు. అగ్రశ్రేణి కవులు వరుసలోకి చేరియున్నారు. మూడు కవితా సంపుటాలు ప్రచురించిన నారాయణరావు తాజాగా 'గంపకూడు' మకుటంతో మరో సృజనాత్మక సంకలనం తీసుకొచ్చారు. ఆదాయపు పన్ను ఆడిటర్‌గా వృత్తితో అత్యంత వత్తిడితో నిమగ్నమై ఉండే ఆయన సమాంతరంగా పట్టుదప్పని కవనయానం కూడా చేస్తున్నారు. కవితా సంకలనాలతో పాటు 'మాట' అనే శీర్షికతో ఒక దీర్ఘ కవితను కూడా రచించారు. ఈ దీర్ఘకవితనే 'ది వర్డ్' మకుటంతో ప్రముఖ కవి రచయిత రామతీర్థ ఆంగ్ల మాధ్యమంలోనికి అనువదించాడు. బహుళ ప్రాచుర్యం పొందిన 'ది వర్డ్' ఆంగ్ల రచనను భారత ఉపరాష్ట్రపతి ముప్పవరపు వెంకయ్య నాయుడు ఆవిష్కరించారు. ఈ సందర్భంగా 'ది వర్డ్' గురించి ఆయన మాట్లాడుతూ 'ఈ పుస్తకం చదివి 'వర్డ్' యొక్క విశిష్టతను విస్తృతంగా, బహుముఖంగా అవగతం చేసుకున్నాను' అంటూ 'దివర్డ్' అనువాద రచయితనూ, మూల రచయిత నారాయణరావును మెచ్చుకున్నారు. గొప్ప భావుకత, కవీత్వీకరణ నిండుకున్న రచన అంటూ ప్రస్తుతించారు 'ది వర్డ్'కు తల్లివేరు చిన్ని నారాయణరావుకే ఈ ఫలితమంతా దక్కుతుందని అభినందించారు.

చిక్కని కవిత్వాన్ని రాసే చిన్ని నారాయణరావు సాహితీలోకాన్ని ప్రోత్సహించడంలో కూడా ముందే ఉంటారు. సాహిత్య సభలూ, సమావేశాలూ నిర్వహిస్తారు. ఆయా సభలకు ఆర్థిక, హార్థిక సహాయంతోపాటు అన్నీ తానై వ్యవహరిస్తారు. ఇతర ప్రజా సేవా సంఘాలకు చేదోడువాదోడుగా సహకరిస్తారు. చిన్న నారాయణరావు మరో కోణమేమంటే తన సాహితీగురువు నాగభైరవ కోటేశ్వరరావు పేరున ఒక సాహితీ పీఠం ఏర్పరచారు. ఏడాదికొకమారు ఒక సాహితీవేత్తకు డాక్టర్.నాగభైరవ కోటేశ్వరరావు స్మారక సాహితీ అవార్డును అందజేసి ఘనంగా సత్కరిస్తారు. సాహితీరంగంలో స్థిరపడుతున్న మరో ఐదుగురు వర్ధమాన కవులకు సాహితీ స్ఫూర్తి పురస్కారాలు ప్రదానం చేస్తారు. ఒక ఉన్నత స్థాయి సాహితీవేత్తల బృందం అత్యంత పారదర్శకంగా అవార్డీనీ, పురస్కారీలనూ ఎంపిక చేస్తుంది. పై సంగతులన్నీ ఆయన సాహితీ సేవలకు తార్కాణాలు.

తాజా సంకలనానికి 'గంపకూడు' మకుటాన్ని నిర్ణయించుకోవడంలోనే ఒక ప్రత్యేకత ద్యోతక మౌతుంది. ఇదో గ్రామ్యపదం. పట్టణాలు, నగరాల్లోని నేటితరం బహుశా 'గంప'ను ఎరుగకపోవచ్చు. గ్రామీణ ప్రాంతాల్లో వినియోగంలో ఉండే ఉపకరణం గంప'టబ్బు' వచ్చిన పిదప బుట్ట, తట్ట,

గంప, జల్ల ఈ పదాలే కనుమరుగాయె. విదేశీ సంస్కృతీ, పారిశ్రామికీకరణ, ప్రపంచీకరణల దుష్ప్రభావం మన స్థూల సంస్కృతీ, సాంప్రదాయాలపై చూపిన ఫలితమే ఈ వైపరీత్యం. పొలంలో పనిచేస్తున్న యజమానికీ, శ్రామికులకూ అబేధంగా 'బువ్వ' (భోజనం) తీసుకవస్తూంది గంప. సేవలకు గాను పలు గృహాల్లో ఆధారిత కులాల వారు గ్రామసీమల్లో 'అన్నం' సేకరించేందుకు వినియోగిస్తారు. ధాన్యాన్ని మోసుకెళ్ళేది గంప. అంటే గంపను 'అక్షయపాత్ర'తో పోల్చవచ్చు. అందువల్లనేనేమో! చిన్ని నారాయణరావు తన కవితా సంపుటి ముఖచిత్రంగా లోపలి అంచులు ధగధగ మెరిసిపోయే స్వర్ణతాపడం చేసిన పాత్రనే ఎంచుకున్నారు. ఈ మకుటం ఆయన గ్రామీణ సామాజిక కోణానికి దర్పణం పడుతుంది. మానవ సమాజ సమతుల్యతకు ముఖచిత్ర మౌతుంది. నిచ్చెనమెట్ల ఎగుడుదిగుడు కుల సమాజంలోని అంతరాలను ధ్వంసిస్తూ 'గంపకూడు' సమానతకు ప్రతీకగా నిలుస్తుంది. మకుటం ఎంపికలోనే కవి దార్శనికతను అర్థం చేసుకుంటాము.

ఆయన కలానికి పదునైన కవితా లక్షణమేగాకుండా సామాజిక సమస్యలపై తక్షణ స్పందన గోచరిస్తాయి. భావచిత్రాలూ, శిల్పం, కవిత్వీకరణ నిండుగా ఉంటాయి ఆయన కవిత్వంలో. ప్రభావశీలంగా కవత్వీకరించే చిన్ని నారాయణరావు ఒక తపస్సులా కవిత్వాన్ని ప్రేమిస్తున్న కవి. ఆయన రచనలో అమ్మదనం, ఆగ్రహం రెండు కోణాలు దర్శిస్తుంటాయి. ఒక్కోమారు ఆయన కవనం ఊయలలూపుతుంది. మరో మారు ఉగ్రరూప మెత్తుతుంది. మెత్తదనం కత్తిదనం రెండూ మెండుగా ఉన్న కవి నారాయణరావు.

సంపుటిలోని కవితలతో కరచాలనం చేస్తే మకుటంతో వున్న 'గంపకూడు' కవితలో ***'వానచినుకు స్పర్శతో / అవని ఆకుపచ్చ వ్రతం పూనినట్టు / ఆ వీధి వింత కాంతితో శోభిల్లుతుంది'*** అని వాన పరోపకారాన్ని మనముందు పరుస్తారు. పుడమిపైన నెలల తరబడి మంచు, వర్షం విడిది చేసే ఖండాలనూ, ప్రాంతాలనూ మినహాయిస్తే మనవంటి సమశీతోష్ణము, అల్ప వర్షపాతమూ నెలకొని ఉండే ప్రాంతాల జనులకు వర్షం హర్ష ఉత్సవం వంటిది. వర్షం పడకపోతే పంటలే పండవు. పంటలు రాకపోతే మనిషి మనుగడే ప్రశ్నార్థకమౌతుంది. చినుకుతో వీధి ఏమిటి? పుడమి మొత్తం హరితశోభతో పులకించి పోతుంది. ఇటువంటి నేపథ్యాన్ని దృష్టిలోకి తీసుకున్న కవి చినుకు చరిత్రను మన కళ్ళకు కట్టారు.

అదే కవితలో ***'నగరం ఆ కవి బరువుతో/ నిర్నిద్రమై అగ్ని గోళంగా మారినపుడు / గాలిగోపురమై నిటారుగా నిలిచి / నీడనిచ్చే కారుణ్యాన్ని పంచేది / గంపకూడే!'*** అంటూ గంపకూటి ప్రాధాన్యతను విశదీకరిస్తారు. ఆకలి దహిస్తుంది వలుకుబడి. ఈ దహించడాన్నే నారాయణరావు అగ్నిగోళమంటూ గొప్ప సారూప్యతనిచ్చారు. మండుతున్న జఠరాగ్నిని ఆహారంతోనే ఆర్పివేయగలము. అటువంటిది ఒక సమూహ క్షుద్బాధను నివృత్తి చేయాలంటే సామూహిక వితరణ అవసరం. అందుకు సహకరించి పులకరించేదే గంపకూడు. నిజంగా ఒక గుంపు ఆకలి తీర్చడాన్ని నిటారుగా నిలిచిన కారుణ్యపు గాలిగోపురముగా వర్ణించడం ఆయన సందర్భ శుద్ధికి నిలువుటద్దం.

'ఎండకు పిండం పెట్టండి' కవితలో ***'ఎండకు మూకుమ్మడిగా పిండం పెట్టండి / ప్రతి మనిషీ ఓ మొక్కై / ఎదిగే నేలతల్లి గుండెల్లో మ్రానై ఒదిగి / ఎండకు చేతులెత్తి దండం పెట్టండి / సతత హరితాన్ని శిరస్త్రాణంగా ధరించి / శీతల సమీరాల్ని భూమాత తనవంతా పారించి'*** అంటూ వృక్ష సందేశమిస్తారు. వాస్తవానికి చెట్టు ఆవశ్యకతను మనం ఏనాడో విస్మరించాం. అడవులను నిర్దాక్షిణ్యంగా నరికివేస్తున్నాం. నీడనిచ్చే చెట్లను నిర్మూలిస్తున్నాం. చెట్లను తొలగించి ఎత్తైన నిర్మాణాలు చేపడుతున్నాం. వాతావరణాన్నీ, భవితవ్యాన్నీ అడ్డంగా మనమే ముక్కలు చేసుకుంటున్నాం. ఫలితంగా ఉష్ణోగ్రతల సూచీకూడా అదుపుతప్పి పైపైకి చేరుతుంది. భూతాపం పెరిగిపోతుంది. వృక్షనాశనం వలన వాతావరణం సమతుల్యత కోల్పోతుంది. వర్షాలు సక్రమంగా అడుగులు వేయవు. ఒక్కో సంవత్సరం చినుకు ముఖమే చూపదు. ఫలితంగా క్షామం ఏర్పడుతుంది. వృక్షాలు వరద ఉరవడిని నిలువరిస్తాయి. వృక్షాలు తొలగించుకుంటూపోతే వరదలు జనవాసాల్ని పెకలిస్తాయి. అకాల వర్షాలూ, తుఫాన్లు, సంభవించి పెనునష్టం కలిగిస్తాయి. చెట్ల వలన కలుగు ప్రయోజనాలను పెడచెవిన పెట్టి విధ్వంసం వైపుగా పరుగులు పెడుతున్న మానవాళికి చిన్ని నారాయణరావు ఒక మార్గదర్శనాన్ని నిర్దేశిస్తున్నారు. హరిత ప్రపంచాన్ని కాంక్షిస్తూ ఆయన విలువైన సలహానూ, సందేశాన్ని, ప్రభావాన్ని చేస్తున్నారు. 'వృక్షో రక్షతి రక్షిత:' అంటున్నారు. అనుసరిస్తే, ఆచరిస్తే సుఖపడతాం. రానున్న తరాలు ఆహ్లాదకరమైన

## కవిత

## అలికిడి

- స్వప్న మేకల
9052221870

అడుగులన్నీ తడబడిపోతుంటే
మనసేమో ఏ అలికిడిని లెక్కచేయక
భావమంతా గుండెల్లో భారమై నిలుస్తోంది
ఎక్కడ జార విడిచిందో మధుర స్మృతులన్నీ
ఎక్కడ బంధించేసిందో అనుబంధాలన్నిటినీ



ఏకాకిగా మిగిలి పోతుంది
రెక్కలు విడిచి నేల రాలిన పిట్టలా ..
చుట్టూ అలుముకున్న
వెలుగంతా కంటి ముందు
అంధకారమై నిలుస్తోంటే
ప్రతి బింబించని రూపు రేఖల ఆనవాళ్లే..!

అనంత ఆకాశం నిశ్చలంగా ఉంటే
మబ్బు పట్టిన మనసులోనుండి చినుకు ధారలు
కురుస్తుంటే తడిసిన హృదయానికి
మిగిలింది వేదనే..!

ఎంత వేధించిందో తనువుని
ఎంత శోధించిందో అణువణువునీ...
చివరికి మిగిలింది నువ్వు లేని నేనుగానే..!! ♦

---

వాతావరణాన్ని అనుభవిస్తాయి. లేదంటే ప్రతికూల వాతావరణాన్నే చవిచూస్తాయి.

'ఊపిరులూదండి..!' కవితలో ***'ప్రజాస్వామ్యం తుదిశ్వాస / విడువకుండా ఆపరేషన్ చేయండి / ప్రజాస్వామ్య శకలాలకు / ఊపిరులూది బ్రతికించండి'*** అంటూ నేటి ప్రజాస్వామ్య దైన్యాన్ని మనముందుంచుతారు. మనదేశంలో ప్రస్తుతం వర్ధిల్లుతున్న ప్రజాస్వామ్య వ్యవస్థ హీన స్థితికి చక్కని రూపమిచ్చారు. నిజం చెప్పాలంటే మరణశయ్యపైనే వుంది. దాని వికృతరూపాలను వర్ణించాలంటే భాషాభావజాలమంతా సరిపోదు. వైద్య శాస్త్రంతో మనం వింటున్న దీర్ఘకాల క్రానిక్ వ్యాధుల్లాంటి అవలక్షణాలెన్నింటితోనో అది కునారిల్లుతుంది. ఒక్క వాక్యంలో చెప్పుకోవాలంటే మన ప్రజాస్వామ్యం అవినీతి, స్వార్థం, బంధుప్రీతి, కులమతాభిమానం, క్రమశిక్షణారాహిత్య రాచపుండ్లతో కుళ్ళిపోయింది. ఔషధాలు పనిచేయని విధంగా రోగం ముదిరింది. ఇటువంటి తరుణంలో దానికి శస్త్రచికిత్స ఒక్కటే మార్గమని కవి తెగేసి చెపుతున్నారు. శస్త్రచికిత్సతో మాత్రమే ఈ చెడిపోయిన ప్రజాస్వామ్య వ్యవస్థకు స్వస్థత చేకూర్చగలమని చిన్ని నారాయణరావు నిశ్చితాభిప్రాయము.

"తెల్లకాకులు" అనే కవితలో ***'కాకుల్ని పట్టడం.. తెల్లరంగేయడం / ఎవరితరం? / రాజుగారి ముఖమే / 'తెల్ల'బోయింది'*** అని పెద్ద నోట్ల రద్దు, దాని అనంతర పరిణామ ఫలితాలపై వ్యాఖ్యానిస్తారు. ఈ కవిత సమకాలీన సంఘటనలపై ఆయన తక్షణ స్పందనను ప్రకటిస్తుంది. పెద్దనోట్ల రద్దుతో మన ఆర్థిక వ్యవస్థ, సాధారణ ప్రజానీకం అనుభవించిన అవస్థ భారత ప్రజలందరికీ అనుభవపూర్వక అంశమే. జనజీవనం అతలాకుతలమైన సంగతి మనకు ఎరుకే. సామాన్య, మధ్యతరగతి, ఎగువ మధ్యతరగతి జనమంతా పిక్కలు పీకేలా బ్యాంకుల ముంగిళ్ళలో వరుసలు కట్టారు. ఎందరి ప్రాణాలనో ఈ అనాలోచిత నిర్ణయం బలిగొంది. ఇప్పటికీ బ్యాంకుల పనితీరు కరెన్సీలేక అగమ్యమగోచరంగా వుంది. ప్రజలు ఇంతటి త్యాగాలు చేసినప్పటికీ కేంద్రప్రభుత్వానికి ఒనగూడిన ఫలితం సున్నా. వ్యూహం బెడిసికొట్టింది. లక్షల కోట్ల నల్లడబ్బు ప్రభుత్వ ఖజానాకు జమ అవుతుందని చేసిన ఈ ప్రయత్నంలో కేంద్రానికి ఒక్క రూపాయి నల్లధనం కూడా దక్కలేదు. ఈ ప్రక్రియ మొత్తం వృథాప్రయాస, అత్యాశ, అడియాశగా మిగిలిపోయాయి. పైగా నలుపంతా తెలుపైందంటూ, ఎగిరిపోయిన కాకులతో నల్లకుబేరులను కవి పోల్చడం ఔచిత్యంగా ఉన్నది.

ఈ కవిత్వాన్ని చదివి మనసారా అనుభవించాను. అదునైన కవిత్వం రాసిన చిన్ని నారాయణరావుకు హృదయపూర్వక అభినందనలు. 42 కవితలతో 115 పుటలు కలిగి సర్వాంగ సుందరంగా రూపొందిన 'గంపకూడు' కవితా సంపుటి వెల రూ. 100/-. కవిత్వాభిలాషులు తప్ప చదువవలసిన ఈ సంకలనం కోరువారు : చిన్ని నారాయణరావు, ఆదిత్య డిగ్రీకాలేజి దగ్గర, ఆదిత్యనగర్, చిల్డ్రన్స్‌పార్క్ రోడ్, నెల్లూరు - 524003, చరవాణి : 9440202942 అను చిరునామాను సంప్రదించండి. ♦

## కవిత

# ఎన్నికల కాలం

- జానూ సురేష్
7569480800



ఇది ఎన్నికల కాలం
ఋతుపవనాలు
ఏ.సి గదుల్లోనుండి
ఇప్పుడిప్పుడే బయటికొచ్చి
వాడ సందుల్లో సైతం
తిరుగాడేకాలం

ఇది ఎన్ని 'కలికాలం'
ఖద్దరు ధరించిన
పొలిటికల్ ఊసరవెల్లులు
ప్రజాస్వామ్యాన్ని
పరిరక్షిస్తామంటూ
వెల్లువలా ప్రజల మీదకు
దూకుతున్నకాలం
చొక్కా ప్యాంటు
మార్చినంత ఈజీగా
పూటకో పార్టీతో దోస్తీకట్టి
ఎలాగైనాసరే
దేశ ప్రజానీకాన్ని ఉద్ధరించాలని
ఆబగా ఎదురుచూస్తున్న
దగుల్బాజీ కాలం

రాజకీయ పెట్టుబడిదారుల
సంపాదనకు
పదవులే 'బడా దారులు' గా
కనిపిస్తోంటే

పార్టీ అయస్కాంత క్షేత్రాలకు
ఆకర్షించబడే
తుప్పుపట్టిన ఇనుప ముక్కలై
అధికార మాంసపు ముద్దకోసం
కాళ్లను వేళ్ళను నాకుతూ తిరిగే
బుజ్జి కుక్కలై
కోతల్లో పిట్టలదొరల్ని కూడా
ఉలిక్కిపడేలా చేస్తున్నారు

తెల తెల్లని కారు కూతలకు
కుర్రకారు సైతం తూగుతూ ఊగుతూ
వెర్రిగా పార్టీ లారీలెక్కుతుంటే
పచ్చని ప్రజాస్వామ్య వనం
దహనంకాక ఇంకేమవుతుంది!!?

అనుకోవాలేగాని
పట్టపగలు చుక్కల్నే కాదు
విశ్వాంతరాలాల్ని
ఇట్టే చూపెట్టగలరు
ఆకాశంలో అలల్ని
సముద్రంలో సూర్యునికి
స్నానమూ చేయించగల
వీరులు,ధీరులు ఉన్నారు
ఐదేండ్లకాలం
విసుగెత్తిపోయిన ఓటర్లు
నెట్వర్క్ లు మారకుండ
ఎలక్షన్ స్పెషల్ ఆఫర్లు
ప్రకటించేస్తున్నారు
రగిలిపోయి షూటర్లుగా
మారుతున్న ఓటర్లను
క్వార్టర్ల పంపిణీతో
వశం చేసుకునేందుకు
రంగం సిద్ధం చేసుకుంటున్నారు
ఇది ఎన్ని 'కల' కాలం
ఎన్నో కలల్ని కళ్ళల్లో నింపుకొని

మండుటెండలాంటి జీవితాలకు
హామీలు ఎండమావులని తెలిసినా
చినుకు కోసం ఆరాటంగా
ఆకాశం కేసి చూస్తున్న
రాయలసీమ రైతన్నలా
వరాల వానలో తడుస్తూ
పగటికలలో చిందులేస్తూ
చేతికి చిక్కిన చేప పిల్లను
జారవిడుచుకున్నంత సులభంగా
నాయ 'కుల' స్పర్శకు కరగి మరగి
ఓటును సమర్పించుకొనే మహా చెడ్డకాలం

మర్డర్ మొనగాళ్లు
అత్యాచార వీరులు
స్కామ్ రారాజులు
దోపిడీదారులు, దొంగలు
పాలన అధికారులుగా
అర్హతలు స్థిరీకరించబడుతున్న చోట
రక్తపాత మహా వృక్షాలు
అవినీతి కలుపు మొక్కలు
స్వేచ్ఛగా పెరగక ఊరకుంటాయా..!!?
ప్రజాస్వామ్య మైదానంలో
అర దశాబ్దానికి ఒకసారి ఆడుకొనే
అందమైన అబద్ధపు ఆటకు
మద్యం, నోటు, హింస
ఈ మూడేగా అంపైర్లు

ఎప్పుడో నా చిన్నపుడు చదువుకున్నా
మనదేశం అభివృద్ధి చెందుతున్న దేశం అని
నేటికి పిల్లలు ఇదే చదువుతుంటే
అభివృద్ధి చెందిన దేశంగా
ఇంకెప్పుడు మారతామయ్యా
ఐఏఎస్ లనో ఐపిఎస్ లనో
విద్యాధికుల్నో, సమాజాన్ని చదివినోళ్ళనో
ప్రత్యక్ష రాజకీయాలకు అర్హుల్ని చేయండయ్యా
అన్నా ఓటరన్నా..!
అటు ఇటు దిక్కులు చూస్తావేందన్నా
సగం తెగిన సంకెళ్ల వేదనతో
దేశం నీముందు నిల్చుంది
ఆ చేతిలోని ఆయుధాన్ని
ఇప్పటికైనా సరిగ్గా సంధించు....



# ప్రపంచీకరణపై నిరసన కెరటాలు

- వొరప్రసాద్

ప్రపంచ ధనవంతుల జాబితాలు ప్రసార మాధ్యమాల్లో ముందుపీఠిన కనపడుతుంటాయి. ప్రపంచీకరణ విధానాలు మనదేశంలో అమలు చేయడం ప్రారంభమైన తర్వాత ఈ జాబితాలు మనకు బాగా పరిచయమయ్యాయి. విశ్వసుందరి అందాల పోటీల్లో మన దేశానికి చోటు దక్కడం ప్రపంచీకరణ కంటే ముందు మనం ఎప్పుడూ చూడనిది. నేడు ప్రతీరోజూ ఎక్కడో ఒకచోట మనకు వినపడుతున్న రైతుల, చదువుకునే పసివాళ్ళ ఆత్మహత్యలు వంటివి కూడా గతంలో ప్రపంచీకరణ కంటే ముందు లేవు. ఈ ప్రపంచీకరణ కాలంలోనే మనం ఈ దృశ్యాల్ని తరచూ చూస్తున్నాం.

ఈ ప్రపంచీకరణ విధానాలు మనదేశ ప్రజా జీవనాన్ని గతంలో ఎన్నడూ లేనంతగా ప్రభావితం చేశాయి. వ్యవసాయ కేంద్రంగా ఉన్న భారత ప్రజల జీవనశైలి క్రమంగా పట్టణీకరణ, నగరీకరణతో రూపుమార్చుకుంది. ఈ ప్రపంచీకరణతో ఆధునిక సౌకర్యాల కోసం వెంపర్లాడేలే ఒక సాలెగూడు మనచుట్టూ ఏర్పాటయ్యింది. సామాజిక దృష్టి వెనకపట్టుపట్టి ప్రతీ ఒక్కరికీ డబ్బు సంపాదనే ధ్యేయంగా, జీవిత లక్ష్యంగా మారిపోయింది. అభద్రత జీవితం నిండా పేరుకుపోయింది. మానవ సంబంధాలు విధ్వంసం అయ్యాయి. కనీస మానవ విలువలు కూడా అదృశ్యమయ్యాయి. సంపాదనకోసం ఎన్ని ఘోరాలకు పాల్పడినా సమాజం పట్టనట్టుగా మారింది. రాజకీయాలు పూర్తిగా కార్పొరేట్లు శాసించే పరిస్థితి ఏర్పడింది. తమ వ్యాపారాల కోసం రాజకీయరంగాన్ని వాడుకోవడం మామూలయ్యింది. లాభాల వేటలో ప్రకృతి వనరుల పట్ల నిర్లక్ష్యం, వాతావరణ పరిస్థితుల్లో పెనుమార్పులకు దారితీశాయి. అకాల వర్షాలకు, చిన్నపాటి వరదలకు సైతం తట్టుకోలేని నగరాలు ఉక్కిరిబిక్కిరి అవుతున్నాయి.

ఈ వర్తమాన భారతసమాజపు చిత్రాన్ని అర్థం చేసుకోవడం సంక్లిష్టంగా మారింది. సమాజంలోని మంచి చెడ్డల్ని సాహిత్యం రికార్డు చేస్తుంది. సాహిత్యంలో ఇతర ప్రక్రియల కన్నా కవిత్వంలో తక్షణం స్పందించే గుణం ఉంటుంది. అల్ప రచనలో అనల్పార్థం కవిత్వంలోనే సాధ్యం. కొద్ది అక్షరాల్లో లోతైన ఆలోచనను, అవగాహనను అందించే లక్షణం కవిత్వంలో ఉంటుంది. సామాజిక దృష్టితో రాసిన కవితలు సూటిగా, శక్తివంతంగా ఉండి పాఠకుడిని కదిలిస్తాయి. అటువంటి కవితల సమాహారమే 'కవితా కెరటాలు' సంకలనం. ఈనాటి సంక్లిష్ట సమాజపు చిత్రాన్ని అద్దంలా మనకు చూపిస్తుంది. రెండు దశాబ్దాల ప్రపంచీకరణ ప్రభావాన్ని అత్యంత వాస్తవికంగా ఈ సంకలనంలోని కవితలు

చిత్రించాయి.

వైజాగ్ ఫెస్ట్ 2017 ఆహ్వాన సంఘం నిర్వహించిన కవితల పోటీకి వచ్చిన వాటిలో నుండి ఎంపిక చేసిన కవితలతో ఈ సంకలనం వెలువడింది. 2017 డిసెంబర్ 1 నుండి 10 వరకు విశాఖపట్నంలో ఆంధ్ర విశ్వవిద్యాలయం ఇంజనీరింగ్ కాలేజి ప్రాంగణంలో ఏర్పాటుచేసిన గురజాడ వేదికపై ఈ పోటీల ఫలితాలు వెల్లడించి బహుమతులు ప్రదానం చేశారు. సుమారుగా నాలుగు వందలకు పైగా వచ్చిన కవితల్లో నుండి 76 కవితలతో చీకటి దివాకర్, ఎ.వి. రమణారావు, నూనెల శ్రీనివాసరావు, పాయల మురళీకృష్ణ ఈ సంకలనం రూపొందించారు.

ఈ సంకలనంలోని మొదటి మూడు కవితలు బహుమతి పొందిన కవితలు. సిరికి స్వామినాయుడు రాసిన 'జనంలోంచి..' కవిత మొదటి బహుమతి గెలుచుకోవడమే కాదు పాఠకుడి హృదయం కూడా గెలుచుకుంటుంది. వర్తమాన సమాజ చిత్రాన్ని గుప్పెడు అక్షరాల్లో కవిత్వం చేసి మన ముందుంచుతాడు- *'పడమటి కొండమీద/ వెలుగు మేకను మింగేస్తున్న చీకటి చిలువలా - దళారీ/ శ్రమశక్తినీ సహజ సంపదనీ మింగేస్తూ-/ సర్వవ్యాప్తమైనపుడు ఎవరితో యుద్ధం చేస్తావు?/ వ్యవస్థీకృతమై.. శత్రువు/ ఊసరవెల్లిలా రంగులు మార్చుకుంటూ.../ మబ్బుల మాటునుంచి శరసంధానం చేస్తున్నప్పుడు/ ఎలా యుద్ధం చేస్తావు?"* అంటాడు. మేలు చేస్తాయనే పేరుతో ప్రజలను మాయచేస్తూ మనదేశంలో ప్రపంచీకరణ విధానాలు అమలుచేశారు. ఆ విధానాలు అందర్నీ కమ్మేశాయి. ఏది మేలు చేస్తుందో, ఏది చెడు చేస్తుందో తెలియని ఒకానొక స్థితిలోకి దేశప్రజల్ని నెట్టేశారు. మనచేతుల్తో మనకళ్ళే పొడిచేశారు.

ఈ ప్రపంచీకరణ విధానాల్లో శత్రువు ఎవడో తెలియని పరిస్థితి. శత్రువు వ్యవస్థీకృతమై ఉన్నాడని కవి చెప్తున్నాడు. ఆ విధానాలను సమర్థించిన మనలో కూడా శత్రువు ఉన్నాడని కవి పరోక్షంగా చెప్తున్నాడు. కవిత మొత్తం ప్రపంచీకరణ విధానాల సారాంశాన్ని చెప్తూనే మనం ఏం చెయ్యాలో కూడా మార్గదర్శనం చేస్తుంది. శత్రువు తెలియకుండా యుద్ధం చేయాల్సి వచ్చినప్పుడు ఏం చెయ్యాలో కూడా కవి చెప్తాడు. పది శాతం కుబేరులకు వ్యతిరేకంగా తొంభైశాతం పేద, మధ్యతరగతి ప్రజలంతా ఐక్యమై జట్టుకడితేనే శత్రువు ధ్వంసమవుతాడనే భావన కవిత వ్యక్తం చేస్తుంది. *'బహుళ పడగల సర్పమై-వాడు/ చుట్టేస్తున్నాడు భూగోళాన్ని!/ దేశాల మధ్య హద్దులు చెరిగిపోయి.../ పెనుతుఫానుకు/ పచ్చని అరటితోట కకావికలమైనట్టు-/ అడవులూ నదులూ మైదానాలూ/ అన్నీ అతలాకుతలమై.../ ఉనికిని కోల్పోయి/ ఊళ్లకు ఊళ్లు వల్లకాల్లైపోయి.../ యుద్ధమైతే లేదుగానీ.../ యుద్ధానంతర భీభత్సమైతే... భయానకమై!"* అంటాడు. యుద్ధం లేదు కానీ యుద్ధానంతర భీభత్సం భయనకమై అనడంలో కవి శక్తి కనపడుతుంది. యుద్ధాలకు మించి దళారీవ్యవస్థ వ్యాపారకాంక్ష ప్రజల్ని భయపెడుతున్న స్థితిని కళ్లముందుంచుతాడు.

ఈ సంకలనంలో వైవిధ్యభరితమైన కవితా వస్తువులు విశేషంగా కనబడతాయి. ఇంచుమించు ప్రతీకవితా వస్తురీత్యా భిన్నంగానే ఉంటుంది. ఏ రెండు కవితల్లోనూ ఒక వస్తువు మనకు కనిపించదు. ఆ రీత్యా ఈ సంకలనం ప్రత్యేకమైనదే. ఇటీవల భావప్రకటనా స్వేచ్ఛపై దాడులు జరగడం తెలిసిందే. ఆ వస్తువుతో కూడిన కవితకు ద్వితీయ బహుమతి రావడం యాదృచ్ఛికం కాదు. గౌరీలంకేశ్ హత్యను నిరసిస్తూ రాపాక సన్నివిజయకృష్ణ రాసిన కవిత పాఠకుడికి ఉద్రేకం కలిగించకుండా ఉండదు. ఒక్క గౌరీలంకేశ్ హత్యను నిరసిస్తూ రాసినట్లనిపించినా వరుసగా జరిగిన గోవింద పన్సారే, కల్బుర్గి, తదితర హత్యలన్నీ పాఠకుడి దృష్టిపథంలోకి రాకుండా ఉండవు. ఎందరినని చంపుతారు అంటూ "నేనూ గౌరీలంకేశ్‌నే" అన్న ప్రకటన రాజ్యాన్ని సూటిగా సవాల్ చేస్తుంది. గౌరీలంకేశ్ హత్య జరిగిన సందర్భంలో దేశవ్యాప్త నిరసనలలో "నేనూ గౌరీలంకేష్‌ని" అంటూ మాస్కులు ధరించి చేసిన నిరసన ప్రదర్శనల దృశ్యం మన కంటిముందు ప్రత్యక్షమవుతుంది. *"నువ్వు పారిపోతావంతే/ నేను మాట్లాడుతూనే వున్నాను/ నేను/ మరణాన్ని/ నువ్వు చేసిన హత్యలో చూడలేదు/ పిరికి పందవై/ నువ్వు/ పారిపోతున్నప్పటి/ నీ భయంలో చూసాను/ నీ చావుని చూసాను/ నువ్వలా శవంలా/ పరిగెత్తడం చూసాను/ పారిపోతూ పారిపోతూ/ నువ్వు హత్యను చేసాననుకుంటావు- మాట్లాడుతూనే ఉండటాన్ని/ హత్య చేయడం / నీకెప్పటికీ సాధ్యం కాదు"* మాట్లాడుతూనే ఉండటాన్ని హత్య చేయలేవు అనడం రాజ్యాన్ని ఛాలెంజ్ చేయడమే. ఇలాంటి కవితలు చదివినపుడు కవి ఒక సామాజిక

విమర్శకుడిగా కనపడతాడు. ప్రజా కంటకులను తన కవిత్వం ద్వారా నేరస్తులుగా నిరూపిస్తాడు. నిజానికి అదే కవి చేయవలసిన సామాజిక కర్తవ్యం. కవి బాధ్యత కూడా.

ప్రకృతి ఒడిలో అలవాటైన జీవితానికి దూరమవ్వడం ఒక విషాదం. అడవి బిడ్డల జీవనాన్ని విధ్వంసం చేసింది ఈ ప్రపంచీకరణ. గిరిజన ప్రజానీకం వలసబాట పట్టి దిక్కులేని వారవుతున్నారు. ప్రకృతి వనరుల మీద కన్నేసిన కార్పొరేట్లు ఆక్టోపస్‌లై అడవులను కబళిస్తున్న సంగతి తెలిసిందే. ఖనిజ సంపద కోసం విలువైన సహజ వనరులను సమూలంగా కాజేయడం కోసం ఎలాంటి దుర్మార్గాలకైనా వెనుకాడని పరిస్థితులు మనం చూస్తున్నాం. అలాంటి గిరిజనులను వస్తువులుగా చేసుకొని రాసిన కవిత 'వనమాలి'. ***"వంపులు తిరిగిన కోనడొంకకి పసిడి వడ్డాణమైన వలిసెపూల సోయగం/ వలసరైలు పట్టుకుంటుంది... చన్నుకు వేలాడే శిశువుల్తో/ వెన్నుకు వేలాడే మూటల్తో!"*** సుధేరా రాసిన ఈ కవితకు తృతీయ బహుమతి రావడంలో ఆశ్చర్యం ఏమీ లేదు. ఈనాటి భారత సమాజంలో నిర్వాసిత గిరిజనుల సమస్య అత్యంత తీవ్రమైన సమస్య. ఇటు నాగరిక జీవనంలో ఇమడలేక, అటు స్వంత స్థలం నుండి దౌర్జన్యంగా నెట్టివేయబడిన గిరిజన జీవితం అత్యంత విషాదంతో నిండి ఉంది. ఆ దృశ్యాన్ని ఈ కవిత వేదనా భరితంగా వ్యక్తం చేస్తూనే గిరిజనుడి సహజ ప్రతిఘటనా స్వభావాన్ని మన కళ్ళ ముందుంచుతుంది.

ఈ బహుమతి కవితలకు ఏమాత్రం తీసిపోకుండా మిగతా కవితలు పాఠకుడ్ని వెంటాడి చదివిస్తాయి. ర్యాలీ ప్రసాద్ తన 'అతడు సూర్యుడు' కవితలో– ***" ఏ గుడిసెలో దీపం/ యింధనం లేక బతుకుతో పోరాడుతుందో/ ఆ యింట్లోంచే సూర్యుడుదయిస్తాడు"*** అంటాడు. ఈ రెండు చరణాలే కాకుండా కవిత మొత్తం పాఠకుడ్ని ఆపకుండా చదివిస్తుంది. ఎవరినైతే ఈ సమాజం నిర్లక్ష్యం చేస్తుందో, ఎవరినైతే ఈ సమాజం కష్టాలకు గురిచేస్తుందో, ఎవరినైతే ఈ సమాజం నిత్యావసరాలు కూడా అందకుండా చేస్తుందో వాళ్ళు ఎలా ఊరుకుంటారు? అని ఈ కవిత చదివిన తరువాత పాఠకుడికి తోచకుండా ఉండదు.

స్వచ్ఛభారత్ ప్రచారం హోరెత్తిపోతున్న సందర్భంలో పుప్పాల శ్రీరాం కవిత 'ఏబిసిడిఎప్పూ ఓడిఎప్పూ" చదివి తీరాల్సిందే. ***స్త్రీలను గౌరవించడం/ మన సాంప్రదాయమన్న నినాదాలన్నీ/ ఊరవతల రైలు కట్ట మీద/ ఉమ్మడిగా ఆత్మహత్య చేసుకుంటాయి"*** అంటాడు. డెబ్బై ఏళ్ళ స్వతంత్ర భారతంలో బహిరంగ మల విసర్జన సమస్యను తీర్చలేకపోవడాన్ని నిలువెత్తు కవితా చరణాల్తో వ్యవస్థను ప్రశ్నిస్తుంది ఈ కవిత.

అడవుల్ని కార్పొరేట్ కంపెనీలు కాజేయడాన్ని తన కవితా చరణాల్లో దృశ్యంగా మారుస్తాడు–'మనాది' కవితలో అనిల్ డ్యాని – ***ఎక్కడిది ఇంత పచ్చదనం/ మనుషుల్లోంచి అడివిలోకి పాకిందా/ అడివిలోంచి మనుషుల్లోకి పాకిందా/ ఏమో మరి ఒక ఊదురు గొట్టాన్ని పొయ్యి ముందేసుకుని/ పొగ లేవకుండా ఊపిరిని పొయ్యిలోకి నెట్టి/ కళ్ళ వెంబడి కారిన తల్లుల కన్నీళ్ళతో అలా పారుతున్న/ ఈ బంగళాఖాతాన్ని అడగాలి/ ఎవడో ఏసీ గదులలో పడుకుని/ ఈ కనుమల మధ్యన ఒక వ్యాపారాత్మక కలకంటాడు/ ఇక్కడి చేపల్ని వేటాడి విదేశీ ఎండకు ఎండబెడతాడు/ ఇక్కడి మకరందాన్ని సీసాలో బంధించి/ తెల్ల తోలువాడికి కప్పులో కాఫీలా కలిపిస్తాడు/ ఏళ్ళ తరబడి గిరిజనుల కడుపు నింపుతున్న/ అడవితల్లి మౌనంగా దుఃఖించిన సందర్భం అది"***

మనుషుల్లో మానవత్వం కనుమరుగయితే మానవ సంబంధాలు ఎంత దుర్భరంగా తయారవుతాయో తన 'మహాయాత్ర' కవితలో చొక్కర తాతారావు తీవ్రంగా చెప్తాడు. ***"కళ్ళముందు ఎంత లోకమున్నా ఎవరూ తోడురారు/ లోకమెప్పుడూ ఒంటరయ్యింది/ మనుషులు దూరమవుతున్నారు/ శక్తినంతా కూడతీసుకో/ నీ శవాన్ని నువ్వే మోసుకోవాలి"*** నాగరికత వికసించే కొలదీ మనుషుల మధ్య పరస్పర సహకారం, అనుబంధం వంటి లక్షణాలు పెరగాలి. కానీ ఆధునిక వ్యవస్థ ఉన్న మానవ విలువల్ని కూడా ధ్వంసం చేస్తుండటాన్ని కవి చిత్రీకరిస్తున్నాడు.

కులమతాల కతీతంగా దేశమంతా భిన్నత్వంలో ఏకత్వంగా కొనసాగాలని స్వాతంత్ర్యోద్యమ నాయకులు ఆకాంక్షించారు. ఆనాటి దేశప్రజలందరి ఆమోదంతో లౌకిక రాజ్యాంగం ఏర్పాటయ్యింది. ఈ రోజు అదే లౌకిక రాజ్యాంగాన్ని హేళన చేస్తూ దేశంలో మత రాజకీయాలు చొచ్చుకు వచ్చిన తీరును తన 'దేశముఖచిత్రం' కవితలో ఇల్ల ప్రసన్నలక్ష్మి ఆక్షేపిస్తారు ***"మతోన్మాద తపోనిగ్రహ/ విగ్రహాల తలపోతల హిమశైల నగవులపై/ పచ్చదనపు తనూలతల***

*తనువులపై/ ఫిరంగులు చేసే వెచ్చటి నెత్తుటి సంతకం/ రాజ్యాంగ పుటలను సైకత శిల్పాలుగా/ కూల్చుతూ కులం జోరీగల హోరు"* వర్తమాన భారతాన్ని తీవ్రంగా కలిచివేస్తున్న సమస్య. దేశంలోని రాజ్యాంగ వ్యవస్థలన్నీ నిర్వీర్యం చేయబడటాన్ని ఈ కవిత ప్రశ్నిస్తుంది.

ఆధునిక సమాజంలో మహిళలు అన్నిరంగాల్లో భాగస్వాములవుతున్నారు. కానీ వేల సంవత్సరాల అణచివేత అవశేషాలు ఇంకా కొనసాగుతూ మహిళలను వెంటాడటాన్ని తన 'అసంతృప్త' కవితలో వ్యక్తం చేస్తారు – గంగవరపు సునీత *"కన్నీటి వ్యథలనూ– అసంతృప్తి సెగలనూ/ గర్భంలో మోస్తున్న నిండు చూలాలు/ అదృశ్యమైన ప్రేమ/ యాంత్రికతే సహజీవనమై/ దాహాలతో..మోహ దేహాలతో/ శూన్యమైన చీకటి రాత్రుల సాక్షిగా/ అనేక వందలసార్లు/ చచ్చి...బతుకుతున్న సగటు ఇల్లాలు"*

భావ ప్రకటనా స్వేచ్ఛపై జరుగుతున్న దాడికి మంచి సమాధానం– చెళ్ళపిళ్ళ శ్యామల 'దండయాత్ర' కవిత–*"గాయపడ్డ అక్షరం/ రక్తాన్ని చిందించీ/ మట్టిని తట్టిలేపింది/ నెత్తురింకిన నేల/ చైతన్యమై ప్రజ్వరిల్లింది/ వేయిప్రశ్నల వెల్లువై ఉరికింది"*

మహిళల కోణంలోంచి రాసిన ఆలోచనాత్మక కవిత మందరపు హైమవతి 'మౌనరాగం' – *"పద్యాల పాలపిట్టలు ఎగరడానికి/ స్వేచ్ఛాకాశం కాదని ఆశల గొంతు నులిమినపుడు/ మనసు గదిలో మారుమూల కూర్చుని/ వెక్కి వెక్కి ఏడ్చిన శివరంజనీ రాగాన్ని / నేనిప్పుడు సరిగమల సప్తస్వరాల్లేని/ సంగీత సరస్వతిని/ వివాహం దుష్టమాంత్రికుని శాపానికి/ నిలువెల్లా శిలయైన మౌనరాగాన్ని"*

నగరీకరణ దాడికి కనుమరుగవుతున్న పల్లెల గురించి 'పచ్చబొట్టు' కవితలో కొండి మల్లారెడి *"గూళ్ళు చెదిరిపోతున్న/ ఊళ్ళు ఏవైతేనేం/ చరిత్ర పుటల్లోంచి చెదిరిపోతున్న/ ఆనవాళ్ళు../ నిలువెల్లా విధ్వంసమై/ నిర్దాక్షిణ్యంగా/ తరిమేయబడుతూ/ కండ్లముందే కనుమరుగవుతున్న/ ఈ దేశపు పట్టుగొమ్మలు"* అంటూ సరళమైన కవితా వాక్యాల్తో పాఠకుడిని ఆలోచింపచేస్తాడు.

చేనేత కుటుంబాల ఆకలిచావుల వార్తలు గుండెల్ని పిండేస్తాయి. వారి జీవిత విషాద దృశ్యాన్ని 'చేనేత బతుకు సమాధిపైన' అంటూ ఇనుపకుర్తి చినసత్యనారాయణ కవిత్వం చేస్తారు– *"చిక్కుదారాల్ని చక్కబెట్టే చేతినైపుణ్యం/ జీవితంలో చిక్కుల్ని చక్కబెట్టలేకపోయింది/ అగ్గిపెట్టెలో అమర్చిన ఆరుగజాల చీరప్రతిభ/ ప్రపంచీకరణ దెబ్బకి/ ఆకలి తీర్చలేక / ఆత్మహత్య చేసుకుంటోంది"* అంటాడు కవి.

చదువుకునే విద్యార్థులు ఆత్మహత్యలు చేసుకోవడం అంటే అటువంటి వ్యవస్థ ఎంత లోపభూయిష్టమైన వ్యవస్థో అర్థం చేసుకోవాలి. జీవితం పట్ల ఆశని, ఆత్మవిశ్వాసాన్ని కల్పించాల్సిన చదువులు ఆత్మహత్యలకు పురికొల్పడం అత్యంత విషాదం. 'ఆత్మహత్యల సంతకం' కవితలో జి.వి. సాయిప్రసాద్ విద్యార్థుల ఆత్మహత్యల దృశ్యాన్ని కవిత్వం చేస్తూ ఆలోచింపచేస్తాడు– *"నాకిప్పుడు కనిపిస్తున్న దృశ్యం/ కత్తుల వంతెనపై నడుస్తున్న పసిమొగ్గలు/ ఒత్తిడి చరిత్రలో నలుగుతున్న చిరుదివ్వెలు/ నెత్తుటి చారికల్లా మిగులుతున్న రేపటి సూర్యులు/ నేల రాలుతున్న నేటి విద్యాకుసుమాలు/ కాలుతున్న పూలతోటలో/ ఆత్మహత్యల సంతకం"* అంటూ కవిత సాగుతుంది.

ప్రపంచీకరణ పరమార్థం మార్కెట్. మార్కెట్ మాయలో మానవ సంబంధాలకు అవకాశమే లేదు. మార్కెట్ స్వభావాన్ని కవి డా|| బండి సత్యానారాయణ –'మార్కెట్... మార్కెట్...మార్కెట్' శీర్షికన వాస్తవిక భావనను దృశ్యం చేస్తాడు– *"ప్రపంచమంతా నిద్రపోయినా / మార్కెట్ నిన్ను నిద్రపోనివ్వదు/ కలలో కూడా మార్కెట్/ నిన్ను కవ్విస్తూనే ఉంటుంది"*

టి.వి.లు, సెల్‌ఫోన్‌ల ద్వారా తమ వస్తువులను మార్కెట్ చేసుకోవడం ప్రపంచీకరణలో ఒక ప్రధానమైన అంశం. ఆ ప్రకటనలు ఎంతటి మోసపూరితమో 'మేల్కొలుపు' కవితలో ఎస్. సుమిత్రా దేవి చెప్తున్నారు – *"మనుషులంతా మొద్దుబారి మందగించేలా/ కొత్త ఆశల వలలు/ ఎన్నడూ పరిచయం లేని రంగులు/ తెలియరాని హంగులు కొత్తలోకం వెంపరలు/ నట్టింట్లోని బొమ్మలపెట్టె నుండి/ అరచేతిలో ఇమిడిన మాటల గుట్టు నుండీ/ వేళ్ళ కొసల నుండి మొలుచుకొస్తాయి"* అంటారు కవయిత్రి.

మనుషుల మధ్య ఆర్థిక సంబంధాలు ఏ స్థితికి చేరుకున్నాయో 'మట్టి బతుకులు' కవితలో బండి రుక్మిణమ్మ చెప్పిన తీరు ఆకట్టుకుంటుంది – *"చావు పుట్టుకల మధ్య/ పైసలే ఫెవికాల్ బంధమైనాక/ మనుషలంతా ఒకటి*

*కాదంటున్నారు"* అంటూ కవిత్వం చేస్తారు.

ఇప్పుడు మాట్లాడుకోవటమంటే అనుబంధం పెంచుకోవటం కోసం కాదు. అవసరాల కోసం, అమ్మకాల కోసం, వ్యాపారం కోసం తప్ప ఇతరత్రా మాటలు ఉండవు. ఈ అంశాన్ని 'చిన్నమాట' కవితలో చాలా చక్కగా కవిత్వం చేశారు– శారద ఆవాల. *"నమ్మకమైన అపనమ్మకాల మధ్య/ మాటలన్నీ అవసరాలకు పూసిన నకిలీ పూలే/ అనగా అనగా మనిషి/ మాట మీదే నిలబడే వాడట/ ఇప్పుడు మాటలూ చేతలూ / సమాంతరంగా సాగుతుంటాయి/ తేనెపూసిన మాటల వెనుక/ గరగరమనే చేదుపాట"/ "మాటంటే మనుషుల మధ్య అల్లుకునే/ ఆత్మీయ సేతు బంధనం కదా!"* అన్న కవయిత్రి మాటలకు కాదనకుండా ఉండలేం.

మనిషి చనిపోయిన తర్వాత దహనం చేసే ప్రక్రియ కూడా ప్రపంచీకరణలో ఎలా మారిపోయిందో 'వేగంగా దహనం చెయ్యాలా?' అనే కవితలో కుప్పిలి వెంకట రాజారావు చెప్పిన తీరు విస్మయపరుస్తుంది. కానీ నిజం కదా. *"ఆప్యాయత ఆన్‌లైన్లో ఉందేమో!... శవం దార్లో పడి ఉంది/ ఆ శవంపై స్వార్థపు ఈగల రొద/ నిర్లక్ష్యపు దోమలు కాట్లు వేయడం మానలేదు/ పలకరింపులన్నీ చుట్టూ చరవాణులతో దోబూచులాడుతున్నాయి"* అంటూ రాసిన ఈ కవిని మెచ్చుకోకుండా ఉండలేం.

మనుషుల మధ్య మానవీయ బంధాలు అదృశ్యమైపోవడాన్ని చాలా వేదనగా కవిత్వం చేశారు 'ఒక పుర్రె – రెండు ఎముకలు' కవితలో ఉమ్మడిశెట్టి నాగేశ్వరరావు. *"మరణశయ్యపై మానవత భారంగా ఊపిరి పీలుస్తుంది/ ఆకాశం నిశ్శబ్దంగా వుంది/ అవని నిర్లిప్తంగా ఉంది/ కాలం నిశ్చేష్టంగా వుంది/ చరిత్ర మౌనంగా ఉంది"* వర్తమాన కాలాన్ని కవి కనిపెట్టాడనిపిస్తుంది ఈ కవిత చదివితే.

ఈ కవితా సంపుటిలో వైవిధ్యానికి నిదర్శనం డా॥ మాటూరి శ్రీనివాస్ రాసిన 'వాళ్ళకు ఏమి కావాలి?'. కవిత– ట్రాన్స్‌జండర్స్ పట్ల సమాజం తన ధోరణిని ఇప్పుడిప్పుడే మార్చుకుంటుంది– *"తృతీయ ప్రకృతి పరిమళాలు/ జీర తప్ప గొంతే లేనోళ్ళు"* అంటూ వారిపట్ల సానుకూలంగా ఆలోచింపజేస్తుంది ఈ కవిత.

రాజకీయాలు గ్రామాల్లో వివిధ పార్టీల పేరుతో ప్రజలను విడదీయడాన్ని ప్రశ్నిస్తుంది 'ఊరెట్లా ఉంది?' కవిత. పౌరుషదేవి రాసిన ఈ కవిత గ్రామ రాజకీయాల దుస్థితికి కవితా రూపం ఇస్తుంది. *"కానీ రాజకీయ రంగస్థలం మీద వూరు/ రెండో మూడో భాగాలుగా చీలిపోయి నిత్యసమరం చేస్తుంది/ మనుషులంతా మోహాలకు తొడుగులతో తోలు బొమ్మలయి తైతక్కలాడుతుంటారు/ అవును ఊరిప్పుడు ఊరుకునే వుంది/ పల్లె వల్లకుంది"* అంటూ వ్యక్తీకరిస్తారు కవయిత్రి.

పచ్చని మైదానాలు, ఎడారులు అన్నీ ప్రపంచీకరణలో వ్యాపార వస్తువులుగా మారడాన్ని చాలా విభిన్నంగా కవిత్వం చేశారు 'నేను గాని ఓ ఈల వేస్తే' కవితలో ఎం.డి. అబ్దుల్లా. – *"నేల కూలిన వనాల మేర/ గనుల బొరియల్లోంచి/ ఆర్తనాదాల అంతిమ సంగీతం వినిపిస్తోంది" "గోల్ఫ్ కోర్టులు.. కూల్‌డ్రింక్ కర్మాగారాల చేరువలో/ ఎడారులు.. హాలీవుడ్ అవుట్ డోర్లుగా మారుతున్నాయి"* అంటారు కవి.

కార్పొరేట్లు అధిక ధరలు ఇచ్చి పొలాలు కొనేస్తున్నారు. రైతులు అమ్ముకుంటున్నారు. ఆ తర్వాత పరిస్థితి ఏంటో 'మైకంలో ఉన్నాను' కవితలో డా॥ డివిజి శంకరరావు చక్కగా వ్యక్తీకరించారు. – *"ఉన్న ఫళంగా బురద పొలం మాయమైంది/ ఊరంతా బంగరు ఊరికొయ్యలు మొలిచాయి" "సమాధులపై సౌధాలు మెరిశాయి"* అంటూ చిన్న కవితలో పెద్ద భావం వ్యక్తీకరిస్తారు కవి.

నోట్ల రద్దు అంశాన్ని కూడా చక్కటి కవితగా మార్చారు బి.వి. శివప్రసాద్ తన 'వాళ్ళు బాగానే ఉన్నారు' కవిత ద్వారా *"ఏక పక్ష నిర్ణయాత్మక నోట్ల రద్దు/ మామూలు జీవితాలపై కురిసిన మహా పిడిగుద్దు"* అంటూ ఒక్కసారిగా మనకు నోట్ల రద్దు అవస్థలను గుర్తుచేస్తారు కవి.

పొలాలు అమ్ముకునే పరిస్థితుల్ని ఒక పద్మవ్యూహం అంటూ 'దైన్యం' కవిత రాశారు– గార రంగనాథం– *"రెక్కల కష్టం గెద్ద లెగరేసుకు పోతుంటే/ మడి సెక్క దేహభాగం ఒక్కో ముక్క/ తెగనమ్ముకుంటే గాని జీవించలేని దౌర్భాగ్యం/ కర్మభూమి పన్నిన పద్మవ్యూహం"* పొలాలు కార్పొరేట్ల పరమవ్వడం సహజంగా జరుగుతున్న చర్య కాదు అని కవి ఆలోచింప చేస్తాడు.

వర్తమాన సమాజ దృశ్యం మొత్తం 'ఒత్తిడి ఉక్కపోత' కవితలో గవిడి శ్రీనివాస్ చిత్రీకరించాడు. *"స్వప్నాల మాటున సంకెళ్ళు బిగుస్తున్నాయ్/ నాలో నన్ను చూద్దామని బయలుదేరా/ ముక్కలవుతున్న నమ్మకాన్ని/ సర్దుకుపోతున్న దేహాన్ని/ కాస్తంత హెచ్చరించా!" "ఇప్పుడు పునర్నిర్మించుకోవాల్సిన / కాలంలో సాగిలపడుతున్నందుకే"/ అలసట దేహానికి/ యుద్ధభేరి మోగించే భావాలకి కాదు"*

కవిత

# ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు

- మూని వెంకటా చలపతి
7396608321

*కొత్త వెలుతురు నీ ఒంటికి చుట్టి
ఉరుముల మెరుపుల మధ్య నుంచి
బానిస మేఘాల మనసును తుడిచేందుకు
ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు....!*



*చీకటిని ఛేధించడానికి
వేకువ వెలుగుల్ని పరచడానికై
చిరునవ్వుల మొక్కల్ని చిగురింప చేయడానికి
ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు...!*

*విష నాగరికతలో నలిగిపోతున్న సమాజానికి
పడమర మార్గాన్ని చూపడానికి
తెల్లటి కాగితంపై ఎర్రని అక్షరాలతో
ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు...!*

*చెయ్యి చెయ్యి కలిపి సహసంతో నడిచి
శాంతి కోటలు నిర్మించడానికి
ప్రేమతో మనందరం జీవించడానికి
ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు...!*

*కులముల క్రౌర్యాన్ని కడతేర్చడానికి
మనుష్యుల వ్యధను తొలగించడానికి
ఈ ధరిత్రిలో నిజాన్ని మాత్రమే నిలపడానికి
ఉదయించాలి ఓ అక్షర సూర్యుడు...!* ◆

---

సామాజిక పరిస్థితుల్ని అర్థం చేసుకోవడమే కాదు. పరిష్కారం కోసం ప్రయత్నం చేయడంలోనే నిజమైన సంకల్పం ఉంటుంది అని చాటుతుంది ఈ కవిత.

ఎంతటి విషమ పరిస్థితులు ఎదురైనా మనిషి ఎదుర్కొంటాడు. మనిషిలో సహజంగానే భావాలు పురివిప్పుకొంటాయి అంటూ 'సంగ(ఘ)మం' కవిత ద్వారా రెడ్డి శంకరరావు ఆశాభావాన్ని వ్యక్తం చేస్తారు. - ***"ఎవరు ఆపగలరు/ సంచరిస్తూ... సంచలిస్తూ/ వీచేగాలిని/ జనించే నిప్పుని/ జ్వలించే జలాన్ని/ విస్ఫోటనమై ఎగిసిపడే/ భావాల్ని"*** సామాజిక మార్పు పట్ల ఒక ఆశాభావాన్ని ఈ కవిత వ్యక్తం చేస్తుంది.

యువ కవయిత్రి జి. సృజన 'కొత్తబడి కావాలి' అంటూ రాసిన కవిత ఆలోచింపచేస్తుంది- ***"ఇక్కడ భవనాలు ఇంత ఆధునికంగా ఉన్నాయి కానీ/ ఆలోచనలెందుకు ఇంత అనాగరికంగా ఉన్నాయి/ వైఫైలు, ఆన్‌లైన్లూ, సైబర్లు, హైటెక్కులూ/ విశ్వమంత విశాలంగా ఉన్నాయి కదా/ మన చేతులెందుకు ఇంతగా కుంచించుకు పోతున్నాయి"*** స్వచ్ఛమైన తాజా గొంతుతో వేసిన ఈ ప్రశ్నకు ఈ సమాజంలో ఎవరు సమాధానం చెప్తారు. ఎవరు బాధ్యత తీసుకుంటారు. అందరమూ బాధ్యత వహించాల్సిందే. తర్వాత తరాలకు మనం ఎటువంటి సమాజాన్ని అందివ్వాలో తేల్చుకోవాల్సింది మనమే.

జీవితాన్ని అతలాకుతలం చేస్తున్న అనేక వర్తమాన అంశాలని కవులు, కవయిత్రులు ఈ సంకలనంలో స్పృశించారు. కవితలన్నీ చాలా లోతైన భావాన్ని వ్యక్తపరచాయి. ఆయా అంశాల పట్ల పాఠకులకు ఎంతో కొంత ఆలోచన రేకెత్తిస్తాయి. వాస్తవికమైన అవగాహనతో, సామాజిక దృష్టితో కూడిన ఇన్ని కవితలు ఒకేసారి చదవటం మంచి అనుభూతి. ప్రపంచీకరణ ఫలితాలు అనేక రూపాల్లో సమాజాన్ని ప్రభావితం చేసిన తీరుకి ఈ కవితలు అద్దం పట్టాయి. ఒక విధంగా ప్రపంచీకరణ విధానాలకు నిలువెత్తు నిరసన కెరటం ఈ సంకలనం. ప్రపంచీకరణ అసలు గుట్టును ఈ సంకలనంలోని ప్రతీ కవితా బట్టబయలు చేసింది. కొద్దిమంది ధనవంతుల కోసం ఈ విధానాలు బలవంతంగా మనదేశ ప్రజల మీద ఎలా రుద్దబడ్డాయో కవులు తమ కవిత్వంలో చిత్రించారు. విలక్షణమైన కవితలతో వాస్తవిక అవగాహనను అందించే 'కవితా కెరటాలు' కవిత్వ సంకలనం అందరూ తప్పక చదవవలసిన పుస్తకం. ప్రజాశక్తి బుక్‌హౌస్‌లలో లభిస్తుంది. వెల 100 రూపాయలు. గిరిధర్ రూపొందించిన కవర్‌పేజీ అదనపు ఆకర్షణ. సముద్ర కెరటాలతో నీలిరంగుతో ఆకర్షణీయమన ముఖచిత్రం సంకలనానికి మరింత వెన్నతెచ్చింది. ◆

# స్వీకారం



## బ్లాక్ వాయిస్ కవిత్వం

**తంగిరాల సోని**

వెల : 100/- పేజీలు: 90

ప్రతులకు : 9676609234

**కు**ల సమాజంలో పెత్తందారీ కులాల వారు దళితులపై సాగించే రకరకాల హింస, పీడన, వివక్ష తాలూకు వివిధ రూపాలు. వారి శ్రమ నిత్యం దోపిడీకి గురవ్వడం, దళిత స్త్రీలపై పెత్తందారీ కులాల వారు సాగించే లైంగిక వేధింపులు, అత్యాచారాలు, హత్యలు మొదలైన అంశాలపైన కొత్త గొంతుతో సోని కవిత్వం వినిపస్తుంది.

**- ప్రొ॥ చల్లపల్లి స్వరూపరాణి**



## వెన్నెల చివుళ్ళు కవిత్వం

**సునీత గంగవరపు**

వెల : 72/- పేజీలు: 128

ప్రతులకు: 9494084576

**ఇ**ప్పటి కవయిత్రులలో సునీత సునిశిత దృష్టి ఉన్న రచయిత్రి. అంతమాత్రమే కాదు సూక్ష్మగ్రాహి కూడా. ఒక్కోసారి గాయపడుతుంది. భావ కవితాగేయంలా రాయబడుతుంది. ఒక్కోసారి కృష్ణుడి కోసం అన్వేషించే గోపికవుతుంది. ఒంటరిగా గోడమీద కూర్చున్న కన్నీటి దీపికవుతుంది.

**- ఎండ్లూరి సుధాకర్**



## ఖలీల్ జిబ్రాన్ కవిత్వం

ప్రవక్త..చెరిగిన కల

అనువాదం: ఎన్. శైలజ

వెల : 75/- పేజీలు: 139

ప్రతులకు: ప్రముఖ పుస్తక కేంద్రాలలో

**ఖ**లీల్ జిబ్రాన్ కవిత్వం చదివిన వారికెవరికైనా వారి వారి హృదయాల్లో, జీవన దృక్పథంలో మార్పు రాక తప్పదు. భావతీవ్రత, అంతరాంతరాల అగాధాల్లోంచి పెల్లుబికే ప్రేమ, కరుణ, ఆశ్చర్యం, అద్భుతం, అవి ఆయన కవిత్వానికే సొంతం. నాకొచ్చినంత నా వంతుగా తెలుగు పాఠకులకు..ప్రేమతో..

**- శైలజ**



## మనిషాక పద్యం కవిత్వం

**మెట్టా నాగేశ్వరరావు**

వెల : 180/- పేజీలు: 192

ప్రతులకు: 9951085760

**అ**ద్భుతమైన అభివ్యక్తి సౌందర్యంతో మెట్టా కవిత్వాన్ని ఆవాహన చేసుకుని, మనిషిగా ఉన్నతీకరిస్తున్న కవి. అతడు మాట్లాడే ప్రతి అక్షరమూ కవిత్వమే. ఎందుకంటే అతని జీవితమే కవిత్వం. సాదాసీదాగా ఉండే అతని వాక్యం జీవితాన్ని తొడుక్కుని కవిత్వమైపోతుంది. అదే అక్షరాల తడి. అతనిలోని పారదర్శకత అతని బలం. కదిలితే అక్షరమై కురిసే అతడిలో గడ్డకట్టిన అనుభవాలు ఉన్నాయి. అవే ఇప్పుడీ పదాలూ, వాక్యాలూ, అట్టడుగు జీవితాల్ని అక్షరాల్లో పొదిగి, ఎదిగింపజేస్తున్న కవి మెట్టా.

**- కవి యాకూబ్**



ఆంధ్రరత్న

## గోపాలకృష్ణుని చాటువులు

ప్రచురణ: జయంతి పబ్లికేషన్స్

వెల : 40/- పేజీలు: 48

ప్రతులకు : 8978261496

'**ఆ**ంధ్రరత్న గోపాలకృష్ణుని చాటువులు' అనే ఈ గ్రంథం 'శ్రీ రంగనాథ ప్రబోధమ్' అనే శీర్షికతో సంస్కృత శ్లోకాలతో ప్రారంభమైంది. 'ఆంధ్ర నాయకులు' అనే శీర్షికతో ఉన్న సీసపద్యంతో ముగిసింది. గోపాలకృష్ణయ్య గారు మొగమాటం లేని వ్యక్తిగా, చెప్పదలచుకున్న విషయాన్ని హాస్యపూరితంగా, ముక్కుమీద గుద్దినట్లుగా వ్యక్తం చేసిన తీరు అభినందనీయం.

**- గుమ్మా సాంబశివరావు**




## సబ్బు బిళ్ళ

**మినీ కవితలు**

**డా॥ రావి రంగారావు**

వెల : 25/- పేజీలు: 48

ప్రతులకు: 9247581825

**సూర్యకవి**

వర్షాకాలం/ ప్రేమ గీతం / చలి కాలం / విరహ గీతం / ఎండా కాలం / విప్లవ గీతం.

**అనుబంధాలు**

ఎక్కి / తొక్కుతుంటే చాలదు/ చైను / తెక్కుండా చూసుకోవాలి.../ జీవితం / ఓ సైకిల్.

**- డా॥ రావి రంగారావు**

# స్వీకారం



## నీలిగోరింట కవిత్వం

**మందరపు హైమవతి**

వెల : 120/- పేజీలు: 224

ప్రతులకు: 9441062732

'మందరపు హైమవతి కవితా ముద్ర తెలుగు స్త్రీవాద కవిత్వంలో చెరగనిది. తనదైన ప్రత్యేక స్వరంలో స్త్రీ ఆర్తిని, ఆవేశాన్ని, ఆగ్రహాన్ని, ప్రేమనూ, ప్రేమ రాహిత్య జీవిత వేదనలను, ఆర్థిక సంబంధాల ప్రభావంతో ఛిద్రమవుతున్న స్త్రీ పురుష సంబంధాలనూ కవిత్వీకరించిన అపురూప కవయిత్రి మందరపు హైమవతి.

**- ఓల్గా**



## పదండి ముందుకు

**అడిగోపుల వెంకటరత్నం**

వెల : 100/- పేజీలు: 132

ప్రతులకు: 9848252946

ఏకత్వంలో భిన్నత్వం అందరూ వల్లెవేసేదే. దానిని ఇప్పటి పరిస్థితులకు అతకటం ఈ కవికే చెల్లింది. మృగరాజును జయించిన మనిషెంత బలవంతుడో, స్వేచ్ఛను బలిగొన్న మనిషెంత నిర్దయుడో, తాను నిశ్శబ్దమై ప్రపంచాన్ని శబ్దమయం గావించిన మనిషెంత విధ్వంసకుడో కొంతయినా తెలియాలంటే ఈయన కవిత్వంతో కరచాలనం చేయాల్సిందే!

**- రావెల సాంబశివరావు**



## త్రిపురనేని మధుసూదనరావు

సాహిత్య సర్వస్వం - 1

సంపాదకులు: **సి.యస్.ఆర్. ప్రసాద్**

**వి. చెంచయ్య**

వెల : 300/- పేజీలు: 438

ప్రతులకు: 9989189250

టీఎంఎస్ మార్క్సిస్టు సాహిత్య విమర్శను భూ మార్గం పట్టించాడు. పాశ్చాత్య మార్క్సిస్టు భావన మీద నిర్మాణమైన తెలుగు మార్క్సిస్టు సాహిత్య విమర్శను టీఎంఎస్ ప్రాదేశికం చేసాడు. ఆ మాటకొస్తే తెలుగు సాహిత్య విమర్శకు కొత్తచూపు నిచ్చాడు. సంప్రదాయ చట్రంలో మునిగిపోయిన విమర్శకు, ప్రజాస్వామిక, ప్రగతిశీల, విప్లవ దృక్పథాలను అద్దాడు.

**- చింతకింది కాశీం**



## త్రిపురనేని మధుసూదనరావు

సాహిత్య సర్వస్వం - 2

సంపాదకులు: **సి.యస్.ఆర్. ప్రసాద్**

**వి. చెంచయ్య**

వెల : 200/- పేజీలు: 277

ప్రతులకు: 9989189250

వచ్చి వాస్తవాలు, ఆలోచనలు రేకెత్తించే చురకత్తుల్లాంటి పదునైన మాటలు త్రిమధురా వ్యాసాల్లో కోకొల్లలు. త్రిపురనేని మధుసూదనరావు ఒక అరుదైన రచయిత. ఆలోచననీ, ఆవేశాన్నీ సమపాళ్ళల్లో రంగరించిపోసి వుత్తేజాన్ని కలిగించే ఉపన్యాసకుడు. సాహసవంతుడైన సాహిత్య విమర్శకుడు.

**- వి. చెంచయ్య**



## త్రిపురనేని మధుసూదనరావు

సాహిత్య సర్వస్వం - 3

సంపాదకులు: **సి.యస్.ఆర్. ప్రసాద్**

**వి. చెంచయ్య**

వెల : 300/- పేజీలు: 436

ప్రతులకు: 9989189250

ప్రభావశీలమైన వ్యక్తులు తమ కాలాన్నేకాక, తదనంతర కాలాన్ని కూడా ప్రభావితం చేస్తారు. భవిష్యత్తులోకి విస్తరిస్తారు. అలాంటి వాళ్లను ఎలా అర్థం చేసుకోవాలనే ప్రశ్న ప్రతి తరం ఎదుర్కొంటుంది. మార్క్సిస్టు సాహిత్య విమర్శ రంగంలో మధుసూదనరావు అలాంటి వారు.

**- పాణి**

విప్లవ కథా రచన



## కొత్త ప్రపంచపు నిర్మాణ కళ

**అల్లం రాజయ్య**

వెల : 35/- పేజీలు: 48

ప్రతులకు: 9989189250

తెలుగు కథ శిఖర సదృశమైన ఆయన కథల్లాగే, ఆయన విమర్శ కూడా చాలా చాలా గంభీరంగా, తాత్వికంగా ఉంటుంది. విప్లవ కథ నడిచి వచ్చిన దారిని, దాని వైవిధ్యభరితమైన విస్తృతిని ఉద్యమ సంబంధంలో రాజయ్య వివరిస్తారు. విప్లవ కథ సౌందర్యాన్ని, సామాజికతను వివరించడానికే ఈ ప్రయత్నమంతా. విప్లవకథ మానవ ఆచరణలోని మార్పు క్రమాల్లోని సౌందర్యాన్ని చిత్రిస్తే, ఆ సౌందర్యాన్ని విప్లవ విమర్శ మరింత సౌందర్యభరితం చేస్తోంది.

**- పాణి**

# స్వీకారం

## చేను చెక్కిన శిల్పాలు కవిత్వం

**సోమేపల్లి వెంకటసుబ్బయ్య**

వెల : 60/- పేజీలు: 34

ప్రతులకు: ప్రముఖ పుస్తకాల షాపుల్లో



'చేను చెక్కిన శిల్పాలు' తాజా నానీల సంపుటి. అన్నట్టు.. పుస్తకాలకు పేర్లు పెట్టడంలో ఆయనకు ఆయనే సాటి. ఆయన గ్రంథ శీర్షికలు లోతైనవి. గర్భితార్థాలతో వ్యాఖ్యాన సాపేక్షకమైనవి. నిరంతరం మననం చేస్తూ వాటిని వెలికి తీస్తారు. ఈ 'చేను చెక్కిన శిల్పాలు' కూడా అలాంటిదే. వ్యవసాయంలోంచి మొలచిన మొక్కలీ నానీలు.

**- డా॥ ఎన్. గోపి**

## సామాజిక నానీలు

**ఎస్.ఎం. సుభాని**

వెల : 60/- పేజీలు: 40

ప్రతులకు: ప్రముఖ పుస్తకాల షాపుల్లో



అల్పాక్షరాలతో అనల్పార్థం వచ్చే ప్రక్రియ ఆత్మను సుభానీ పట్టుకున్నారు. శీర్షికలో సూచించిన విధంగా ఈ నానీలు సమాజంలోంచి వచ్చినవే. వీటిలో సమకాలీనత స్పష్టంగా కన్పిస్తుంది. కవి కాలాన్ని రికార్డు చేస్తాడంటారు. సుభాని ఈ నానీల ద్వారా ఈనాటి సమాజ స్పందనలను రికార్డు చేసారు.

**- సోమేపల్లి వెంకటసుబ్బయ్య**

## వెన్నెల కౌగిళ్లు కవిత్వం

**వెన్నల**

వెల : 150/- పేజీలు: 171

ప్రతులకు: 9701450206



కవులది కళాత్మక జగత్తు. వెన్నెల ఎంత హాయిగా వుంటుందో వెన్నెల గారి కవిత్వం అంత హాయిగా వుంది. ఆహ్లాదంగా వుంది. అందుకు కారణం ఆమెలో ఈస్తటిక్ బ్యూటీ వుంది. వస్తు పరిశీలనా దృష్టి వుంది. అనుభూతి సాంద్రత వుంది. భావనా బలం వుంది. బాల్య హృదయం వుంది. అంతులేని సృజనాత్మకత వుంది.

**- బిక్కి కృష్ణ**

## లైఫ్ హాలిడే కవిత్వం

**అక్షరమాలి సురేష్**

వెల : 100/- పేజీలు: 75

ప్రతులకు: 9493832470




ప్రపంచీకరణ నేపథ్యంలో కార్పొరేటీకరించబడిన వ్యవస్థ గుప్పిట్లో మారిన వాతావరణాన్నీ, ఛిద్రమైన విలువల్నీ ఈ కవి ఎడ్వాన్స్‌డు టోన్‌లో చిత్రిస్తున్నాడు. నగర ప్రపంచంలో రాజీపడలేక పల్లెప్రపంచాన్ని వదులుకోవాల్సిన అనివార్యతను అంగీకరించలేక – ఈ రెండు ప్రపంచాల మధ్య ఉక్కిరిబిక్కిరై తండ్లాటను అనుభవిస్తున్న మధ్యతరగతి సెన్సిటివ్ మానవుల వేదనను ఈ కవి పట్టుకోగలిగాడు.

**- జి. లక్ష్మీనరసయ్య**

## ప్రభావరి కిరణాలు

**డా॥ రావి రంగారావు**

వెల : 20 పేజీలు: 32

ప్రతులకు: 9247581825



చిత్రాలు, పద చిత్రాలు / ముఖ్యం కాదు,/ జనం గుండెల్లో కవి / సత్య చిత్రాలు గీయాలి.

కాగితం మీద రాసినా/ కంప్యూటరు మీద కొట్టినా / ప్రజల మనస్సుల మీద / కవిత కనిపించాలి.

చనిపోతుంది మబ్బు / వర్షం బిడ్డను కని, / భూమి పడతి చేతుల్లో / క్షేమంగా పెట్టి!

**- డా॥ రావి రంగారావు**

## సర్ ఆర్థర్ కాటన్

**మువ్వల సుబ్బరామయ్య**

వెల : 100/- పేజీలు: 152

ప్రతులకు: 8978261496




తెలుగువారికి ప్రాతఃస్మరణీయుడైన సర్ ఆర్థర్ కాటన్ జీవిత చరిత్రలు గతంలో చాలానే వచ్చాయి. అయితే శ్రీ మువ్వల సుబ్బరామయ్య విభిన్నంగా వ్రాశారు. నీటి విలువను చాటి చెప్పిన మహత్తర రచన ఇది. 'నీరు', 'నీటి విలువ', 'నీటిపై ఖర్చు' గురించి సర్ ఆర్థర్ కాటన్ 1874లో చేసిన మూడు ప్రసంగాలు ఈ గ్రంథంలో శ్రీ సుబ్బరామయ్య గారు మన కందించారు. నీటిపై అవగాహన పెంచడానికి ఈ ప్రసంగాలు ఉపయోగపడతాయి. ప్రత్యేకించి ఇరిగేషన్ ఇంజనీర్లకు ఈ ప్రసంగాలు పాఠ్యగ్రంథాల వంటివి.

**- మండలి బుద్ధప్రసాద్**

## అరుణ్‌సాగర్ సంస్మరణ సభ



అరుణ్‌సాగర్ సంస్మరణ సభ (3వ వర్ధంతి) విజయవాడలోని మాకినేని బసవ పున్నయ్య విజ్ఞాన కేంద్రంలో సాగర్ సాహితీ మిత్రుల ఆధ్వర్యంలో ఫిబ్రవరి 10న జరిగింది. సభాధ్యక్షత వహించిన ప్రముఖ కవి ఖాదర్ మొహియుద్దీన్ మాట్లాడుతూ అణగారిన వర్గాల వ్యథలను సమాజం దృష్టికి తెచ్చేందుకు కవి, పాత్రికేయులు అరుణ్‌సాగర్ చేసిన సాహిత్య కృషి సమాజంలో కవులందరూ అందిపుచ్చుకోవడమే ఆయనకిచ్చే అసలైన నివాళి అన్నారు. పాత్రికేయురాలు వడ్లమూడి పద్మ మాట్లాడుతూ పాత్రికేయుడుగా, స్నేహితుడుగా, కవిగా అరుణసాగర్ వ్యక్తిత్వాన్ని, ప్రత్యేకతనూ వివరించారు. ప్రముఖ విమర్శకులు కవి, జి.లక్ష్మీనరసయ్యకు అరుణ్ సాగర్ జీవన సాఫల్య సాహిత్య పురస్కారం అందజేశారు. ప్రముఖ అడ్వకేట్ సంపర శ్రీనివాసుకు సాగర్ మిత్ర అవార్డును ప్రదానం చేశారు. జి. లక్ష్మీనరసయ్య సాహిత్య కృషిపై కవి, విమర్శకులు కోయి కోటేశ్వరావు వివరణాత్మక ప్రసంగం చేశారు. ఈ సభలో ప్రముఖ కవి మువ్వా శ్రీనివాసరావు, అరుణ్‌సాగర్ సహచరి ప్రసన్న, సోధరుడు జగన్, ఇతర కుటుంబ సభ్యులు, న్యూట్రిషనిస్టు డాక్టర్ జానకి, టివి 5 జర్నలిస్టు జె.రాంబాబు, పలువురు కవులు, రచయితలు అరుణ్‌సాగర్ మిత్రులు పాల్గొన్నారు. ♦

## 'సైరా మా బళ్లారి' ఆవిష్కరణ సభ




కర్నూలు పట్టణంలోని పింగళిసూరన తెలుగుతోట (ఫంక్షన్ హాల్)లో ఫిబ్రవరి 3న జంధ్యాల రఘుబాబు పాటల పుస్తకం 'సైరా మా బళ్లారి' ఆవిష్కరణ సభ జరిగింది. విశ్రాంత ఉపాధ్యాయులు కోటేశ్వరప్ప పుస్తకాన్ని ఆవిష్కరించారు. ప్రజానాట్యమండలి జిల్లా అధ్యక్షులు ఎంపి బసవరాజు అధ్యక్షతన జరిగిన సభలో సాహిత్య ప్రస్థానం సంపాదకవర్గ సభ్యులు కెంగార మోహన్ మాట్లాడుతూ ఏ పాటకైనా సాహిత్యమే జీవం, అది సమాజంలో ప్రజల్ని చైతన్య పరుస్తుందని అన్నారు. ఈ పాటల్లో రచయిత పర్యావరణ ప్రేమికుడుగా, మార్క్సిస్ట్‌గా, అంబేద్కరిస్టుగా కనిపిస్తాడన్నారు. ఆకాశవాణి కర్నూలు స్టేషన్ సంచాలకులు రొక్కం కామేశ్వరరావు మాట్లాడుతూ పాటకు సరైన బాణీ ప్రధానమన్నారు. అనంతరం లలిత కళాసమితి అధ్యక్షులు పత్తి ఓబులయ్య మాట్లాడారు. రఘుబాబు రాసిన పాటల్ని గాయకులు పాడి వినిపించారు. రచయిత జంధ్యాల రఘుబాబు స్పందిస్తూ సమాజంలోని అసమానతల్ని కవితలు, కథలతోనే కాక పాటలతో అందించాలన్న సంకల్పంతో ఈ ప్రయత్నం చేశానన్నారు. ఈ సభలో సాహితీస్రవంతి జిల్లా నాయకులు గౌరెడ్డి హరిశ్చంద్రా రెడ్డి, సాహిత్య అభిమానులు పాల్గొన్నారు.

## 'జీవన స్వరం' ఆవిష్కరణ సభ



కాకినాడ సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఇంద్రగంటి నరసింహమూర్తి కథల సంపుటి 'జీవన స్వరం' ఆవిష్కరణ సభ గాంధీభవన్‌లో ఫిబ్రవరి 17న జరిగింది. సాహితీస్రవంతి జిల్లా అధ్యక్షులు జోశ్యుల కృష్ణబాబు అధ్యక్షతన జరిగిన ఈ సభలో కవి, రచయిత మార్ని జానకిరామ్ చౌదరి పుస్తకాన్ని ఆవిష్కరించారు. బొల్లోజు బాబా, సుంకర గోపాలయ్య పుస్తకాన్ని సమీక్షించారు. ఈ సభలో సాహితీస్రవంతి రాష్ట్ర ఉపాధ్యక్షులు గనారా, రచయిత ఇంద్రగంటి నరసింహమూర్తి, పద్మజావాణి, అద్దేపల్లి జ్యోతి, ఇందిర, ఎజ్రాశాస్త్రి తదితరులు పాల్గొన్నారు. ♦

## కర్నూల్లో కందుకూరి శతవర్ధంతి సభ



కందుకూరి శతవర్ధంతి కర్నూలు జిల్లా ఆహ్వానసంఘం ఆధ్వర్యంలో ఫిబ్రవరి 22న కర్నూలులోని లలితకళాసమితి లో కందుకూరి శతవర్ధంతి వేడుకలు జరిగాయి. ఆహ్వాన సంఘం అధ్యక్షులు పత్తిఒబులయ్య అధ్యక్షతన జరిగిన ఈ సభలో సాహితీస్రవంతి గౌరవ అధ్యక్షులు తెలకపల్లి రవి మాట్లాడారు. కందుకూరి అధ్యయనం వల్లనే చరిత్రలో నిలిచిపోయారని దాదాపు 130 పుస్తకాలు రచించారని అన్నారు. ఈ దేశంలో నేటికి బాల్యవివాహాలు ఉండటం సిగ్గుచేటన్నారు. మూఢాచారాలను, దురాచారాలను ఆయన ఆనాడే ఖండించి జాతికి శాస్త్రీయ దృక్పథాన్ని అలవరచారన్నారు. వాస్తును వ్యతిరేకించి, వాస్తవానికి బాటలు వేశాడన్నారు. మోది గంగా హారతిని చూసి నేతలందరూ నదులకు హారతులు పట్టడం విడ్డూరమన్నారు. హిమాచల్ శాసన సభలో యజ్ఞంచేయడం మూర్ఖత్వం కాక మరేమవుతుందన్నారు. రాజ్యాంగంలో రాసుకున్న నిబంధనలు పాటించని వారు మనల్నేలే పాలకుని ఇది పురోగమనమా? తిరోగమనమా అని ప్రశ్నించారు. ఆహ్వాన సంఘం గౌరవాధ్యక్షులు జి.పుల్లయ్య మాట్లాడుతూ కందుకూరి ఆశయాల సాధనకు పునరంకితం కావాలన్నారు. ఆహ్వాన సంఘం కన్వీనర్ యస్ఎండి ఇనాయతుల్లా మాట్లాడుతూ కందుకూరి శత వర్ధంతి ఉత్సవాలను జిల్లాలో 18 చోట్ల జరిపామని, నేటి ఆధునిక తరానికి కందుకూరిని పరిచయం చేసే అవకాశం కల్గిందన్నారు. ఈ సభలో కందుకూరిపై జంధ్యాల రఘుబాబు రాసిన పాటని యంపి బసవరాజు పాడి వినిపించారు. ఈ సభలో ప్రగతి విజ్ఞాన కేంద్రం కన్వీనర్ జెయన్ శేషయ్య, ఐద్వా రాష్ట్ర నాయకులు నిర్మల, అలివేలమ్మ తదితరులు ప్రసంగించారు. అంతకు ముందు కందుకూరి చిత్రపటానికి పూలమాల వేసి సభ ప్రారంభించారు. కందుకూరి శత వర్ధంతి సభల నిర్వహణలోనూ, వక్తలుగా పాల్గొన్న గౌరెడ్డి హరిశ్చంద్రా రెడ్డి, యస్ బాలాజీరావ్, కళ్యాణదుర్గం స్వర్ణలత, ఎన్.నాగమణి తదితరులను ఆహ్వాన సంఘం సభ్యులు సత్కరించారు. ఈ సభకు వాఖ్యాతగా ఆహ్వాన సంఘం సమన్వయ కర్త, సాహితీ స్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి కెంగార మోహన్ వ్యవహరించారు. ◆

## గజల్ ఆదినారాయణ సంస్మరణ సభ



గజల్స్ ద్వారా సామాన్యులను సైతం చైతన్యం చేసిన ప్రముఖ గజల్ కళాకారుడు ప్రదాన ఆదినారాయణ లేనిలోటు సాహితీ జగత్తుకు తీరని లోటు అని వక్తలు పేర్కొన్నారు. ఆయన బహుముఖ ప్రజ్ఞాశాలి అని కొనియాడారు. శ్రీకాకుళంలోని బాపూజీ కళామందిర్‌లో ప్రముఖ గజల్ కళాకారుడు, సాహితీవేత్త ప్రదాన ఆదినారాయణ సంస్మరణ సభను సాహితీస్రవంతి ఆధ్వర్యంలో ఫిబ్రవరి 24న నిర్వహించారు. ఈ సందర్భంగా ఎమ్మెల్యే గుండ లక్ష్మీదేవి మాట్లాడుతూ తుదిశ్వాస విడిచేవరకు పాటనే ఊపిరిగా చేసుకొని జీవించారన్నారు. సమాజంలోని రుగ్మతలను స్వీకరించి తన గానంతో ప్రజలకు సందేశాన్ని అందించేవారని కొనియాడారు. కేంద్ర మాజీ మంత్రి కిల్లి కృపారాణి మాట్లాడుతూ సాహిత్యానికి, సంగీతానికి సుపరిచితులైన వ్యక్తి ప్రదాన ఆదినారాయణ అని అన్నారు. పలువురు సాహితీవేత్తలు మాట్లాడుతూ కళారంగానికి ఆదినారాయణ చేసిన సేవలను ప్రభుత్వం గుర్తించకపోవడం బాధాకరమని ఆవేదన వ్యక్తం చేశారు. ఆదినారాయణతో తమకున్న అనుబంధాన్ని గుర్తు చేసుకున్నారు. అనంతరం ప్రదాన ఆదినారాయణ పాడిన గజల్స్ సిడిని ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి జిల్లా ప్రధాన కార్యదర్శి చింతాడ రామారావు, రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్, కేతవరపు శ్రీనివాస్, డి.ఆర్.కె. నాయుడు తదితరులు పాల్గొన్నారు. ◆

## విజయనగరంలో పుస్తకావిష్కరణలు



విజయనగరంలో ఫిబ్రవరి 21న సాహితీస్రవంతి ఆధ్వర్యంలో మాతృభాషా దినోత్సవం సభ జరిగింది. ఈ సందర్భంగా సిరికి స్వామినాయుడు కవితా సంపుటి 'మట్టి రంగు బొమ్మలు', బొల్లోజు బాబా రాసిన 'కవిత్వ భాష' పుస్తకాల ఆవిష్కరణ జరిగింది. 'కవిత్వ భాష' పుస్తకాన్ని ప్రముఖ కవి, కథకులు గంటేడ గౌరునాయుడు, 'మట్టి రంగు బొమ్మలు' పుస్తకాన్ని దేవరాజు గోపాలకృష్ణ ఆవిష్కరించారు. మానాపురం రాజాచంద్రశేఖర్, మొయిద శ్రీనివాసరావు 'కవిత్వ భాష' పుస్తకంపై ప్రసంగించారు. మట్టిరంగు బొమ్మలు పుస్తకంపై అద్దేపల్లి ప్రభు ప్రసంగించారు. ప్రముఖ కవి పాయల మురళీకృష్ణ సభకు అధ్యక్షత వహించారు. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర కార్యదర్శి చీకటి దివాకర్, జిల్లా అధ్యక్షులు పి.ఎస్. శ్రీనివాసరావు, ఎస్వీఆర్ కృష్ణారావు, రెడ్డి శంకరరావు, చంద్రికారాణి, హైమవతి, చెళ్ళపిళ్ళ శ్యామల తదితరులు పాల్గొన్నారు. ◆

## 'బ్లాక్ వాయిస్' ఆవిష్కరణ సభ



సామాజిక పరివర్తన కేంద్రం ఆధ్వర్యంలో విజయవాడలోని ప్రెస్‌క్లబ్‌లో ఫిబ్రవరి 3న తంగిరాల సోని కవితా సంపుటి 'బ్లాక్ వాయిస్' ఆవిష్కరణ సభ జరిగింది. ఆవిష్కర్త డా॥ చల్లపల్లి స్వరూపరాణి మాట్లాడుతూ కుల సమాజంలో పెత్తందారులు దళితులపై సాగించే రకరకాల హింస, పీడన, వివక్ష వంటి అంశాలను తంగిరాల సోనీ తీవ్రస్వరంతో కవిత్వం చేశారన్నారు. సభాధ్యక్షత వహించిన బివిఎస్ సత్యనారాయణ మాట్లాడుతూ సోని తన కవితా సంపుటిలో బడుగు బలహీన వర్గాలపై దాడులకు వ్యతిరేకంగా కవితలు రాశారన్నారు. రచయిత తంగిరాల సోని స్పందిస్తూ తన అనుభవంలోకి వచ్చిన సామాజిక అంశాలను కవితా వస్తువులుగా స్వీకరించానని అన్నారు. సీనియర్ పాత్రికేయులు ఘంటా విజయకుమార్, బెందాళం కృష్ణారావు, పింగళి చైతన్య, కరీముల్లా, దుగ్గినపల్లి ఎజ్రాశాస్త్రి, డాక్టర్ నూకతోటి రవికుమార్, సామాజిక పరివర్తన కేంద్రం ప్రధాన కార్యదర్శి వున్నవ వినయ్‌కుమార్ తదితరులు పాల్గొన్నారు. ◆


**FORM IV**

(Rule 8)

UNDER PRESS AND REGISTRATION OF BOOKS ACT, 1867
STATEMENT ABOUT OWNERSHIP AND OTHER PARTICULARS
ABOUT MONTHLY -SHAITYA PRASTHANAM

| | | |
|---|---|---|
| 1 | Place of Publication | Vijayawada |
| 2 | Periodicity of its Publication | Monthly |
| 3. | Printer's Name | V Krishnaiah |
| | 1 (a) Whether a citizen of India | YES |
| | (b) If a foreigner, the country of origin | - |
| | Address | H No 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 4 | Publisher's Name | V Krishnaiah |
| | 1 (a) Whether a citizen of India | YES |
| | (b) If a foreigner, the country of origin | - |
| | Address | H.No 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 5 | Editor's Name | T RAVI |
| | Nationality | INDIAN |
| | 1(a) Whether a citizen of India | YES |
| | (b) If a foreigner, the country of origin | - |
| | Address | H No 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |
| 6 | Name and addresses of owner | V Krishnaiah |
| | 1(a) Whether a citizen of India | YES |
| | (b) If a foreigner, the country of origin | - |
| | Address | H No 27-30-4, MB Vignana kendram, Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002 |

**I, V. KRISHNAIAH, here by declare that the particulars given above are true to the best of my knowledge and belief.**

Sd/
V KRISHNAIAH
Publisher

Date 01.03.2019


Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,
Published at **Shaitya Prasthanam** 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad-20. **Editor. T. Ravi**

# వల్లంపాటి వెంకటసుబ్బయ్య

15.03.1927 - 02.01.2006



'కథా శిల్పం', 'నవలా శిల్పం' వంటి గ్రంథాలు వెలువరించారు. విమర్శకులుగా పేరు గడించారు. అనువాదకులు. కథలు కూడా రాసారు.

బలి

SAHITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.VJ/187/2017-19
Date of Posting : 1st &2nd of Every Month ▪ Date of Publication: 27.02.2019



If Un delivered please return to: Prasthanam, C/o M.B. Vignana kendram, 27-30-4, 3rd Floor
Akulavari veedhi, Governorpet, Vijayawada - 520002. Ph: 0866-2577248, Cell: 9490099059



మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M332 |
| పుస్తకం పేరు | సాహిత్య ప్రస్థానం |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 69 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | madh |
| పేజీలు విడదీసినది | MADHU |
| స్కాన్ చేసినది | [illegible] |
| పరీక్ష చేసినది | ROHITH |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good. |